# PREFACE

One of the principal factors that caused a revolution in the world of thought, exceptional in its force, extent and duration, in seventeenth century Europe was the philosophy of Descartes. Descartes' *Discours de la Mèthode* is an "inimitable logbook of spiritual discovery" and may well be called the phenomenology of the emergence of the Modern Mind. It marks the development in Europe of autonomous creative philosophy subordinate to nothing but reason and founded on universal "good sense."

The Telugu translation of the *Discours* contained in the following pages is perhaps the first translation of this great classic into a non-European language. This translation along with the Introduction by one of us (Dr. Murty) is our humble contribution towards the promotion of an appreciation of modern Western thought by the more than thirty million Telugu-speaking people of India, and it is hoped that it will stimulate to however small a degree rethinking on problems which are as vital and

important today in India as they were in Descartes' day in Europe, when she was on the threshold of a new era of philosophic and scientific achievement.

We hoped that this book would be published under the auspices of the *Unesco*, as the ideals that motivated us are the same that inspired the *Unesco* Major East-West project. Though the then Director, Department of Cultural Activities, Shri P. N. Kirpal (now Secretary, Education Ministry of India), M. Jacques Havet and M. Roger Caillois of the Translation and East West Major Projects of the *Unesco* recognised the importance of our work and extended to us their full support, for lack of available funds during that year (1957) *Unesco* could not give any financial assistance. But we are grateful to Shri Kirpal, M. Havet and M Caillois for their appreciation and encouragement.

We have to also record our obligation to Shri T. Viswanatham, former Finance Minister of Andhra, and Chairman of the Indian Company Law Reform Commission, for the great interest he evinced in the publication of this work. Himself a profound student of literature and philosophy, in Shri Viswanatham one is always sure to find discerning support for good causes.

We wish to express our sense of abiding gratitude to our Vice-Chancellor, Dr. V. S. Krishna, in whom are to be found those twin virtues, i. e. "perception of the understanding and the disposition of the will" to do what is judged to be right, mellowed by "a highly perspicacious intellect", which Descartes valued so much in his friend and disciple Princess Palatine Elizabeth, for the encouragement he gave us while we were engaged on this work and for having it published by Andhra University.

In translating the *Discours* we have been immensely helped by Gilson's commentary and the English translations of Veitch, Haldane and Ross, and Kemp Smith.

Andhra University,<br>WALTAIR.

**K. Satchidananda Murty**<br>**K. V. R. Narasimham.**

---

# సమర్పణ

శ్రీ సింహాచల వరాహనృసింహస్వామికి :

ప్రభూ !

ఇది పాశ్చాత్యభావప్రపంచమందు విప్లవమును తెచ్చిన డెకార్ట్ ప్రమాణమీమాంసపై ఫ్రెంచిభాషలో వ్రాసిన గ్రంథమున కాంధ్రానువాదము. విభిన్న సంస్కృతులకు చెందిన వారు, తమతమ సంస్కృతులయందు జనించిన కళలను, దర్శన శాస్త్రములను, సాహిత్యమునే కాక, భిన్న సంస్కృతులలోని విషయములనుగూడ అవగాహనచేసికొనిననాడే, సర్వమానవ సౌభ్రాతృత్వమును, అన్యసంస్కృతీసహనమును, సమన్వయమును, సాధ్యపడును. ఈయాశతోడనే దీని నాంధ్రభాషలోనికి పరివర్తనము చేసితిమి. పరమసత్యము ఏకము; అది ఒకానొకజాతియొక్కగాని, మతముయొక్కగాని వారసత్వము గాదు. సద్బుద్ధియు, జిజ్ఞాసయుగల సర్వమానవులకును అది లభించును. అట్లే, ఈశ్వరజ్ఞానమును, ఆత్మజ్ఞానమును గూడ, చింతనముచేయగల ప్రతిమానవునకును లభింపగలవు. వీనికై, ఒకానొక గ్రంథముపైగాని, సంప్రదాయముపైగాని, గురువుపైగాని ఆధారపడవలసిన అవసరము లేదు. ప్రతిమానవునకును నీచే ప్రసాదింపబడిన 'బుద్ధి', లేక, 'సంవిద్' అనునది కలదు. నిష్పాక్షికముగను, అహంకార రహితముగను, దాని

నుపయోగించు ప్రతిమనుజునకును సత్యముయొక్కయు ధర్మము యొక్కయు నిజస్వరూపమభివ్యక్తమగును; కర్తవ్యతాజ్ఞానమును, అర్థకామముల సంప్రాప్తియును, తన్మూలముగ సాధ్యపడును. పై విషయములను, భారతదేశమున అక్షపాదగౌతముడును, వాత్స్యాయన ఉద్యోతకరులును, ఉదయనుడును చెప్పిరి. అట్లే, డేకార్ట్ కూడ యూరోప్‌లో చెప్పి, "మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః" అను నీ వచనమును ధృవపరచియున్నాడు. అయితే, ఈభారతీయ దార్శనికులకంటె డేకార్టునకు నీ యనంతమహిమయందును, నీచే సృజింపబడిన మానవుని మేధాశక్తియందును, విశ్వాసమెక్కుడగుటచే, సంప్రదాయ ఆగమముల ప్రామాణ్యమునకంటె, మేధాశక్తికే ఎక్కువ ప్రాధాన్యమునిచ్చెను. అదే సమంజసమేమో! మానవునకు నీవిచ్చిన శక్తి అపారము. ప్రతిమానవునకును నీవు అత్యంతము సన్నిహితుడవే. అట్టిచో ఆతడు స్వహృదయ ప్రత్యయమైన అనుభవముమీద మాత్రమే ఆధారపడి, బాహ్యములైన గురుబోధలకును, సంప్రదాయములకును, శాస్త్రములకును పరతంత్రుడు గాకుండుట యుక్తమే గదా!

ఈమహాగ్రంథమునకు, యథాశక్తిగ, ఈపరివర్తనము గావించితిమి. దీనిని నీ పాదపద్మములందుంచి ప్రణతులమగుచున్నారము.

అనువాదకులు

# ఉపోద్ఘాతము

## డెకార్ట్ జీవితము, కృషి

కె. సచ్చిదానందమూర్తి

### జన్మాదులు:

ఫ్రాన్సుదేశపు టురేన్ ప్రాంతమందలి లహేలో 31 మార్చి, 1596 న రెనె డెకార్ట్ జన్మించెను. ఆయన తండ్రి జోయాకిం బ్రిటాని లోక్ సభలో (1585-6) సదస్యుడు; తాత పియిరీ వైద్యుడు. రెనె తల్లిదండ్రులకు రెండవకుమారుడు; రెనె ఆయన మేనమామ పేరు. డెకార్ట్ కుటుంబనామము. వారు మధ్యతరగతి భూస్వాములు. జోయాకిం తదనంతరము ఆయన సంతానము ఆతని పుష్కల సంపత్తికి వారసులైరి; కాబట్టి రెనె డెకార్ట్ లేమి అనునది ఎఱుగకుండ స్వతంత్రముగ జీవించుట సాధ్యపడెను. ఏడాదికి ఆయనకు ఆరేడువేల ఫ్రాంకుల ఆదాయము వచ్చెడిది.

లాటిన్ భాషలో ఆయన పేరు రెనాటస్ కార్టీసియస్. అందుమూలముగానే ఆయన తదుపరి స్థాపించిన దార్శనిక వాదము కార్టీషియన్ మతమని పిలువబడెను.

### విద్యాభ్యాసము:

తన 10 వ ఏట డెకార్ట్ 4 వ హెన్రీ రాజుచే స్థాపింపబడిన లఫ్లెచ్ లోని ఏసుసభ (Society of Jesus) వారు

స్థాపించిన విద్యాలయములో చేరి తొమ్మిదేండ్లు విద్యాభ్యాసము చేసెను. ఆకాలమందు ఏసుసభ వారి విద్యాలయములలో ఆరేండ్లు మానవీయ శాస్త్రములు (Humanities), మూడేండ్లు దర్శన శాస్త్రమును బోధించెడివారు. ఆ మూడేండ్లలో, మొదటి సంవత్సరము నీతి తర్క-శాస్త్రములు, రెండవ సంవత్సరము గణిత భౌతిక శాస్త్రములు, మూడవ సంవత్సరము తత్త్వశాస్త్రము బోధించెడివారు. మూడేండ్లలోను ఒకే గురువు ఉండెడివాడు. డెకార్ట్ గురువు ఫోర్నెత్. 1614 లో డెకార్ట్ అచట విద్యాభ్యాసము పూర్తిచేసి పొయిటియర్ విశ్వవిద్యాలయములో చేరి, అచట అధ్యయనానంతరము నవంబరు 1616 లో న్యాయశాస్త్ర పట్టభద్రుడాయెను.

తన విద్యాభ్యాసమును గూర్చి ఆయన చేసిన సమీక్ష:

విద్యాభ్యాస దశనుండియు డెకార్ట్‌కు జీవితమున ఉపయోగించు ప్రతివిషయమును గూర్చియు స్పష్టము నిశ్చితము నగు జ్ఞానము సంపాదింపవలెనను ఆసక్తి యుండెడిది. గణిత శాస్త్రమందీ గుణములుండుటచే అది ఆయన కానందదాయకముగ ఉండెడిది; ఇతర విషయములందీ స్పష్టత, నిశ్చితత్వము కన్పడక ఆయనకవి అసంతృప్తి కల్గించెడివి. గెలీలియో మున్నగువారు అప్పుడప్పుడే కనుగొనుచున్న విషయములు, భౌతిక శాస్త్రముల ఫ్లైచ్ విద్యాలయములో పరిశీలింప బడుచుండినను, అవి నిశ్చయ జ్ఞానముక్రింద పరిగణింప బడవచ్చునా యను సంశయము డెకార్ట్‌కు ఉండెడిది.

మొత్తముమీాద, వ్యవహారమందు స్పష్టమైన పథ మును చూపుటకుగాని, జీవితమును నిశ్చింతగా గడుపుకొను టకుగాని, విద్యాలయములు తన కుపకరింప లేవని డెకార్ట్స్ తలచెను. లాటిన్, ఫ్రెంచి భాషలలోని గ్రంథములను కూలంకషముగా అధ్యయనము చేయగల్గుటయు రెండు భాషల లోను సుందర శైలిలో వ్రాయగల్గుటయు తప్ప మరొక ప్రయోజనము వాటివలన కలుగ లేదని డెకార్ట్స్ ఎంచెను. ప్రతిదానిని గూర్చి ఆకర్షకముగా మాట్లాడి తమశక్తి తెలి యని వారి మన్ననల పొందుట కుపయోగించును తప్ప, అచట బోధింపబడు దర్శనశాస్త్రము ఇంకెందులకును ఉపయో గించదని ఆయన తలచెను. విద్యార్థుల తలలలోని కెక్కువగా బయటనుండి విషయము నెక్కించుటయు, వారి విచారణా వివేక శక్తులకు పని కల్పింప కుండుటయు అచటి లోపములని ఆయన అభిప్రాయము. ప్రాచీన విద్వాంసుల వాదములను విమర్శనా రహితముగా గ్రహించి శబ్ద ప్రమాణమునకే హెచ్చు ఆధిక్యము ఇచ్చుటయు, ఆరిష్టోటిల్ కనిపెట్టిన త్రిఅవ యవన్యాయ (Syllopidm) రీతిగ ప్రతిపాదనలు చేసికొని పోవుటయు వ్యాఖ్యాన వివరణములకు నూతనముగా కనిపెట్ట బడిన సత్యము లన్నట్లుగా మొదుగుపెట్టి చూపుటయు, సమ కాలిక గణిత భౌతిక జీవశాస్త్రములను అవహేళన చేసి కల్పనలు చేసికొని పోవుటయు నాటి తత్త్వశాస్త్ర మందలి లోపములని ఆయన భావించెను.

పుస్తకములపై వైముఖ్యము :

ఇట్లు విమర్శనాదృష్టితో తనవిద్యాభ్యాసమును తనకు బోధింపబడిన విషయములను పర్యవేక్షించిన డెకార్ట్‌కు పుస్తకములన్నను, ప్రాచీనవాదములన్నను జుగుప్సకలిగెను. జీవితసమస్యలపై మననముచేయుటవలన ఏర్పడినట్టి, తమ సిద్ధాంతముల పర్యవసానములను సరకుచేయనట్టి దార్శనిక వాదములు నిష్ప్రయోజనములని ఆయన భావము. అందు కనియే, విద్యాభ్యాసానంతరము ఆయిన ఎన్నడును ఎక్కువగా చదువలేదు ; ఏదైనను పుస్తకమును ప్రారంభించినను సాంత ముగా చదువువాడు కాడు. అప్పుడుకూడ సమకాలిక శాస్త్ర జ్ఞులో దార్శనికులో వ్రాసినట్టియు, తన స్నేహితులు చదువు మని చెప్పినట్టియు పుస్తకములనుతప్ప ఇతరములు చూచెడి వాడుకాడు. అట్లు బలవంతముగా చదువుటకు ప్రారంభించి నప్పుడుకూడ ఆ పుస్తకములనుండి ఏదైన నేర్చుకొనవలెనను ఆశతోగాక, తానుపరిశోధించుచున్న, లేక, ఆలోచించుచున్న సమస్యల పరిష్కారమునుగూర్చి అవి ఏమైనను సూచనల నీయగలవేమో అను ఉద్దేశ్యముతోడనే వాటిని చదువు చుండెడివాడు. గిల్బర్ట్, కెప్లర్, హార్వేలకుతప్ప ఆయన మరెవరికి ఋణపడినట్లుగా చెప్పికొనలేదు ; బేకన్‌ను ప్రశం సించినను ఆయననుండి ఏ ఊహాలను డెకార్ట్ గ్రహించలేదు. తదితరుల నాయన లెక్కలోనికే తీసికొనలేదు ; వారెవరును తన మనోవికాసమునకు తోడ్పడినట్లుగా తలపలేదు.

డెకార్ట్ వివేకము:

సత్యాసత్యములను బాగుగా వేరుచేసి చూచి సత్యమును మాత్రమే గ్రహింపవలెననెడి డెకార్ట్ వివేకమే ఆయనను రసవాదము జ్యోతిషము ఇత్యాదులకు బానిసగాకుండ కాపాడెను. మహామేధావియగు కెప్లర్ ఒక జ్యోతిష సంబంధమైన దినచర్య పుస్తకమును వ్రాయుచుండెడివాడనియు, జాన్ అను క్రైస్తవ ఋషికి ప్రసాదింపబడిన శ్రుతిని (apocalypse) గణితశాస్త్రప్రకారముగా న్యూటన్ వివరించి తన ఈ ప్రయత్నమును గురుత్వాకర్షణ సూత్రము (Law of Gravitation) ను కనుగొనిన కృషికంటె గొప్పదిగా ఎంచెననియు గురుతుంచుకొందుమేని డెకార్ట్ వివేకశక్తి స్పష్టము కాగలదు.

లోకానుభవ సంగ్రహణ:

తాను విద్యాలయములలో చదివిన గ్రంథము లిచ్చిన జ్ఞానముచే అసంతుష్టుడై, "విశ్వమనే మహాగ్రంథము" నే చదువగోరియు, రాజ సభలను, సైన్యములను, భిన్న దేశములను చూచుచు అనుభవములను సంపాదింపవలెననియు డెకార్టు 1616 నుండి 1619 వరకు నానాదేశములయందు పర్యటించెను. సైన్యమందు చేరిన ఇట్లు బాగుగా చేయవచ్చునని తలచి, 22 వ ఏట ఆయన నాసో ప్రభువగు మారిస్ సైన్యములో చేరెను.

బీక్‌మన్‌తో సమావేశము :

నవంబరు 10, 1618 న డెకార్ట్ ఇష్టా జీవితము గడుపుచుండిన దశలో, అతడు హాలండ్‌లో ఐజాక్ బీక్‌మన్‌ను కలిసికొనుట సంభవించెను. బీక్‌మన్ వయస్సులో డెకార్ట్ కంటె ఎనిమిదేండ్లు పెద్ద. వైద్యశాస్త్రమందు ఆచార్యోపాధిని పొందినను భౌతికశాస్త్రములో అతనికి ఆసక్తి మెండు. బీక్‌మన్ 1627 లో డోర్ట్‌రెక్ట్ కళాశాలకు ప్రధానాచార్యుడాయెను.

బీక్‌మన్‌తో కలయుట డెకార్ట్ జీవితములో ఒక అపూర్వ నూతనాధ్యాయమునకు దారితీసెను. డెకార్ట్ బీక్‌మన్‌కు భౌతికశాస్త్రములోని కొన్ని సమస్యలను పరిష్కారము చేయు మార్గములు సూచించెను. బీక్‌మన్ డెకార్ట్ ప్రతిభను దాని లోతులను చూచి ఆశ్చర్యచకితుడై అతనికి విశేష ప్రోత్సాహము కల్గించి, అతనిని మేల్కొల్పెను. దానితో డెకార్ట్ యొక్క సోమరితనమును, జీవితములో గమ్యము లేకుండుటయు తొలగిపోయెను. డెకార్ట్‌లో ప్రసుప్తముగా ఉన్న ఊహాశక్తులను (Speculative powers) పురిగొల్పి, ఆతడు దాదాపుగా మరచిపోయిన విజ్ఞానమును అతనికి గురుతు చేసిన ఘనత బీక్‌మన్‌ది. డెకార్ట్ ఆతనిని తన ఆధ్యాత్మిక పిత అనియు, తనకృషికంతకును మూలమాతని సంసర్గమే అనియు వ్రాసెను.

నూతన శాస్త్రజ్ఞాన సృష్టి :

ఈనూతన మైత్రి ఏర్పడిన కొన్ని నెలలలోనే డెకార్ట్ ఒక నూతన శాస్త్రమును (Scientiam penitus novam) కనుగొనెను. అవిరతములు (Continuous) మరియు విరతములు(Discontinuous) అను అన్ని విధములైన పరిమాణము (Quantity) తో సంబంధముగల అన్ని సమస్యలకు వర్తించు నొక సామాన్య పరిష్కారము దీనివలన లభించెను. మరికొన్ని నెలలకు డెకార్ట్ తన యాంత్రిక సూత్రములను (Principles of mechanics), రేఖాగణితమును (Geometry), ఇతర విషయములను సమన్వయించి తన కృషిని సంపూర్ణము చేయ నాశింపగలెను.

దేశాటనము :

ఏప్రిల్ 1619 లో సైనికోద్యోగము నుండి విరమించుకొని, ఈ శాస్త్రీయ కృషివలన కలిగిన మానసికమగు బడలికను తీర్చుకొనుటకు దేశాటనముసేయ డెకార్ట్ హాలెండును వీడెను. ఆమ్‌స్టెర్డంనుండి ఓడలో బయలుదేరి పోలెండ్, తురింజియా, బొహెమియా, ఆస్ట్రియాలను చూచుకొనుచు ఫ్రాంక్ ఫర్ట్‌లో ఫ్రెడరిక్ చక్రవర్తి పట్టాభిషేకోత్సవములను చూచి, తరువాత బవేరియా ప్రభువగు మేక్సిమిలియన్ సైన్యమందుద్యోగము స్వీకరించెను. 1619-20 లో బవేరియాలోనే

ఉన్నట్లుగను, కోపెన్‌హేజన్, డాన్‌జింగ్‌లను కూడ చూచి నట్లుగను మనకు తెలియవచ్చుచున్నది.

విచికిత్స — సత్యాన్వేషణము: సంశయపద్ధతి, దాని పర్యవసానము:

నవంబరు 1619 లో డెకార్ట్ తిరిగి శాస్త్రీయ (Scientific) దార్శనిక (Philosophic) సమస్యలపై ఎక్కువగా విచారింప ప్రారంభించెను. తన నానాదేశాటనమువలన కలిగిన ఫలితమేమని ఆయన ప్రశ్నించుకొన దొడగెను. దేశాచారములును, విభిన్నదేశములందలి సంప్రదాయములును, వాని పరస్పర వైరుధ్య వైచిత్ర్యములనుబట్టి వానిలో ఏ ఒక్కటియును స్వసంవేద్య సత్యములనుండి నిగమనము చేయబడినదిగాకపోవుటచేత, అవి ఏవియు ఈశ్వరనిర్దిష్టములుకావని ఆయనకు తేలెను. అయితే జీవితమున కుపయుక్తమగు స్పష్టమైన సంశయమున కాస్కారములేని సత్యదర్శన మెక్కడ లభించును? ప్రాచీనుల వ్రాతలయందు స్వయంసిద్ధసత్యము అనుపలబ్ధమని వాని నీవరకే ఆయన పరిత్యజించి, చుట్టునున్న విశ్వగ్రంథమందలి సత్యము వెదుకబూనెను. బాహ్య విశ్వమును, దేశాచారములను, సాంప్రదాయములను ఎంతగా అవలోకించినను అట్టిసత్యము ఆయనకు భాసింపలేదు. ఒక వేళ సత్యము ఆత్మనిహితమా? స్వాత్మాన్వేషణమువలనను, స్వస్వరూపజ్ఞానమువలనను అట్టి సత్యము లభించునాఏమి?

బాహ్యాపరిశీలన నాపి అంతర్వీక్షణముచేసి ప్రయత్నించిన అది లభించునేమో! బహిఃప్రపంచముగాక, ఒకవేళ వ్యక్తిస్వభావమే (Individual Personality) సత్యస్వరూపమును ప్రదర్శించు నేమో! అయితే అంతర్వీక్షణము చేయవలెనన్నచో బాహ్యాకారణములవలన వచ్చిన ఏ అనుభూతులపైన ఆధారపడక, స్వయంసిద్ధములుగా కన్పడని ప్రతిఅభిప్రాయమును పరిత్యజించవలెను. పాతబూజును దులిపి, అనాలోచితముగా సంఘమునుండియో, సంప్రదాయమునుండియో, ఇంద్రియానుభూతులవలననో మనకు సంక్రమించిన ప్రతి విశ్వాసమును, అభిప్రాయమును, సంశయించుటకును, విమర్శించుటకును పరీక్షానంతరము నిశ్చితమని తేలినచో అంగీకరించుటకును, లేదా, పరిత్యజించుటకును సంసిద్ధత యుండవలెను. ఏదో ఒక చిక్కు కలుగగనే, దారితెలియక అసలుమార్గమే లేదను సంశయవాదుల అగమ్యగోచరత్వము కాదిది. డెకార్టుకు స్ఫురించిన సంశయపద్ధతి, బుద్ధికి సత్యమును కనుగొనగలశక్తి కలదు అను శ్రద్ధపై ఆధారపడియున్నది. సంశయించుటే ఒక ఘనకార్యమనిభావించి ప్రతివిషయమును సంశయించుట నిరతసంశయవాదమందో, ఆధారరహిత నిషేధవాదమందో పర్యవసించును. డెకార్ట్ అవలంబింపదలచినది సక్రమమగు సంశయపద్ధతి (Methodical Scepticism) ఈపద్ధతి నవలంబించువారు నిష్పక్షపాతబుద్ధితో వివేచన చేయగలిగియుండవలెను. సంప్రదాయసిద్ధమైనట్టియు సంఘముచే స్వీకరింపబడి

నట్టియు, లేదా ఇంద్రియ జ్ఞానజన్యమైనట్టియు ప్రతివిషయమును సత్యముకాదని ఋజువుచేయుటే ప్రయోజనముగా గాని, అట్టి ప్రతివిషయమును సత్యమే అని చాటుటే లక్ష్యముగాగాని కారాదు. మన ఆలోచన నూతనత్వములో పర్యవసింపవలసిన అవసరములేదు. ఆలోచనచే ప్రాచీనకాలమునుండి పరిపాటిగా వచ్చిన కొన్ని విషయములు సనాతనసత్యములుగా ప్రతిపన్నములుగావచ్చును; లేదా వాని నన్నిటిని నిరాధారములైన విశ్వాసములుగా చూపవచ్చును. అందఱును ఇటులచేయలేదు: తొందరపాటుకల్గిన స్థైర్యరహితులకు సంశయపథమందు ప్రవేశించినచో, తిరిగి దానిని పరిత్యజించుటకు వలసిన ఓర్మి, వినయము కలుగక పోవచ్చును. అనుభవముకలవారును, సక్రమపద్ధతి చూచాయగానైన స్ఫురించుచున్నవారును, నూతన ఆలోచనా ప్రణాళికలను సృష్టించు ప్రతిభకలవారునుమాత్రమే ఇట్టి మార్గమున ఉపక్రమించవలెను. అప్పుడుకూడ, ఇతరులందరకు ఏదో బోధింపవలెనని ఉబలాటముతోడగాక, స్వీయాభివృద్ధి కొరకుమాత్రమే ఈప్రయత్నము చేయవలెను. సత్యదర్శనమున కాధారము చిరకాలీన సంప్రదాయముగాని, వ్యావహారిక సత్యముకాని కాజాలదనియు, వ్యక్తిగతమును క్రమబద్ధమును విమర్శనాత్మకమును అగు విశ్లేషణపైననే (individual's Systematic Critical analysis) సద్దర్శన సంస్థాపన జరుగవలెననియు డెకార్ట్ తీర్మానించుకొనెను. స్వబుద్ధి శక్తియను నికషోపలమును ఉపయోగించి సదసద్వివేచనగావించి, సంప్ర-

దాయక, వ్యావహారిక అనుభవమునంతను సమగ్రపరీక్షచేసి, సత్యగ్రహణము, అసత్యపరిత్యాగముచేసి, తనకు తానై బుద్ధిమంతుడు జీవితమునకొక గమ్యస్థానమును తదనుగుణమగు విధానమును ఏర్పరచుకొనవలెను. అదియే నిజమైన దర్శనము. అంతేగాని ప్లేటో, అరిస్టోటిలులో లేదా, తాదృశులగు మరెవరో ప్రాచీనులో, అర్వాచీనులో, వ్రాసిచ్చినది సద్దర్శనము కాజాలదు. అయితే పరీక్షించి సత్యాసత్య నిర్ణయము చేయుదాక చేయవలసిన దేమి? అంతవరకు మనుష్యుడు అనిశ్చితావస్థలో కింకర్తవ్యతా విమూఢుడుగా నుండవలెనా? లేక ఎట్లయినను సరే, తోచినట్లు బ్రతుకుచుండవచ్చునా? దీనికి సమంజసమని డెకార్టుకుతోచిన సమాధాన మేదియన: తనకు నిశ్చిత జ్ఞానోపలబ్ధిజరిగి సద్దర్శనము సువ్యవస్థితమగునంతవరకు మనుష్యుడు దేశాచారములను పాటించుచు లోకమందు తనకున్నస్థితితో తృప్తివహించి, తదనుసారము వ్యవహరించవలెను. స్వసంప్రదాయముయొక్కయు, స్వసంఘముయొక్కయు ఆచారములను తాత్కాలికముగ పరిగ్రహించి, వానిని శక్త్యనుసారము వ్యవధినిబట్టి పరీక్షించుటకును విమర్శించుటకును సంసిద్ధుడై యుండవలెను. సమగ్ర పరీక్షానంతరము, స్వయంసిద్ధములైన సంశయమునకేమాత్రము తావులేని అబాధిత సత్యము ప్రాప్తించినదప్పు, దేశాచారములను సంప్రదాయమును ధిక్కరింపరాదు. ఒకపరి ఈపరిశోధనయు, ఈ జిజ్ఞాసయు సంతృప్తికరముగ పర్యవసించినపిదప, ఆ సత్యదృష్టికి

అసమ్మతములైన విషయములను పరిత్యజించుటకుకూడ వెనుకీయరాదు. దర్శనమెప్పుడును వ్యక్తికి స్వాయంనిష్ఠముగా నుండవలెను. స్వతస్సిద్ధ, సరళ, స్పష్టసత్యములపై ఆధారపడి యుండవలెను. ఇంద్రియప్రత్యక్షముపైననో, (ఇంద్రియజ్ఞానము భ్రాంతికాదని నిశ్చయమెక్కడిది?) శబ్దప్రమాణముపైననో ఆధారపడినదర్శనమునకు సునిశ్చితత్వ మసంభవము.

ప్రమాణ పరీక్షణము: నూతన దర్శన నిర్మాణ వాంఛ: శాస్త్ర ప్రపంచ స్వరూపము:

ఈవిధములైన ఆలోచనలు డెకార్ట్‌ను అక్టోబరు నవంబరు 1619 లో ఎక్కువగా ప్రోద్బలముచేసి, నవంబరు 10 వ తేదీకి ఆయిన నొక నిశ్చయమునకు తెచ్చినవి. అంతవరకు కనిన, వినిన, ఇతర విధములుగా గ్రహించిన, ప్రతి అభిప్రాయమును విశ్వాసమును సమగ్రముగా పరీక్షించవలె ననునదియే ఆనిశ్చయము. అయితే, ఇది ఒక మనుష్యుడు చేయగలపనియా? ఒకని జీవితమందు కొనసాగునా? అనుసంశయ మాయనను బాధించసాగెను. వెంటనే, ఆయనకు మరొక భావము పొడమెను. కళాకారుడొక్కడు తనకు తానై అంతయు స్వాయముగా నిర్మించిన వస్తువునందు, పలువురు చేసిన నానాభాగములు కల్గిన వస్తువులలో లేని సంపూర్ణత, సౌందర్యము ఉండును. అట్లే నిర్మింపనున్న దర్శనములో ఒక సామరస్యము ఏకత, పరిపూర్ణత ఉండవలెనన్న అది ఒకే వ్యక్తియొక్క

సృష్టిగా నుండినచే మంచిదేమో! కాక, సంఖ్యాప్రపంచ మంతయు పరస్పరానుబద్ధముగా నున్నస్లే, సత్యమంతయు అవినాభావముగా క్రమబద్ధము కాకుండునా? శాస్త్రము లన్నియు పరస్పర సంబద్ధములై (Catenam Scientinum) ఒకానొక సుందరత లేకుండ ఎట్లుండ గలవు? అట్లయినచో, నిస్సంశయమైన స్వతస్సిద్ధ సత్యమొకటి లభింపగానే, తద్ద్వారా తదను బంధితములైన యావత్సత్యమును క్రమ ముగా మానవుడు తెలిసికొనలేడా? ఈవిధముగా ఆలో చించి కొంతవరకు సమాశ్వాసనము చెందియు, డెకార్ట్ ఆనాడు ఈమహాకృషి ఎట్లగునను ఉద్వేగముతోనే దినమంతయు గాఢ చింతాక్రాంతుడై ఎట్లో రాత్రి శయనించెను. అది 1619 నవంబరు 10వ తేదీ; దినమంతయు ఆయన బవారియా ఉల్మ్‌నగర పరిసరములో శీతబాధ బాపుకొను Poel లో నుండి ఇట్లు విచికిత్స జేసి, దానిచే మరల మరల ఆలో చించుచు నిదురపోయెను.

డెకార్ట్ స్వప్నములు:

ఆరాత్రి ఆయనకు మూడు స్వప్నములు వచ్చెను. మొదటిదానిలో కొన్ని భూతములను చూచి భీతుడై తిన్నగా నిల్చి నడువలేకపోయినట్లును, అట్లు నడచుటకు ప్రయత్నింపగనే పెద్ద సుడిగాలి వచ్చి తన్ను పరవశుని చేసినట్లును, చివరకు ఒక విద్యాలయము కానుపింపగా అందలి దేవాలయములోనికి

ప్రార్థనకేగ ప్రయత్నించినట్లును ఆయనకు కన్పడెను. ఇంతలో మెలకువవచ్చి, తన పాపఫలితముగా దానిని ఎంచి, రెండు గంటల ప్రార్థనచేసి తిరిగి శయనించగా మరొక స్వప్నము వచ్చెను. అందులో ఉరుములవంటి మహాధ్వని విని భయపడి నట్లునూను, కండ్లు తెరచి చూడగా విస్ఫులింగములు తన చుట్టును గది అంతయు వ్యాపించినట్లుగను కన్పడెను. వెంటనే మేల్కొని, తాను ఎఱుగకయు ఎఱిగియు చేసినపాపములకు తన అంతఃకరణపొందిన పరితాపమే తనకు కలిగిన భయ రూపమును తాల్చెననియు, ఉరుము, సత్యసారము (Spirit of Truth) తన్నావహించుటకు సూచన యనియును, ఊహించు కొనెను. శాంతించి తిరిగి నిదురించగా ఆయనకు మూడవ స్వప్నమువచ్చెను. అందులో, తానెఱుగకుండ ఎవరో తన బల్లపై ఒక పుస్తక ముంచినట్లును, దానినితీసిచూచి అది యొక నిఘంటువని తెలిసికొని అది తనకుపయోగించునని సంతోషించుచుండగా, అకస్మాత్తుగా ఎట్లువచ్చినదో తెలియ కుండగనే అక్కడ మరియొక పుస్తకము కానవచ్చినట్లును, అదియొక కవితా సంగ్రహమైనట్లును కానవచ్చెను. స్వప్న మందే కుతూహలముతో దానిని విప్పిచూడ, ఆయనకు "ఏజీవితమార్గమును నేనుఅనుసరించవలెను?" (Quod Vitae sectabor iter) అనుపంక్తి దృష్టిగోచరమైనట్లు, అదేసంవత్స మందెవరో అజ్ఞాతుడగు మనుష్యుడు "అవును మరియు కాదు" (Est et non) అను మాటలతో ప్రారంభించు పద్యములను

కొన్నిటిని చూపించినట్లును అతనితో కొంత సేపు సంభాషించి నట్లును అనుభవమాయెను. ఇంతలో స్వప్నముపోయి, మేల్కొనకుండగనే, తనకు అనుభవమైనది స్వప్నమా యథార్థమా యని సంశయించి, స్వప్నమే అని నిర్ణయించుకొని, ఆ స్వప్నమున కర్థమేమాయని ఆలోచింపసాగెను. నిఘంటువు శాస్త్రముల సమష్టికిని, కవితాసంగ్రహము దర్శనశాస్త్రమునకును ప్రజ్ఞాదృష్టితో కూడిన జ్ఞానమునకునుగల ఐక్యమునకును ప్రతీకములని ఎంచెను. దార్శనికుల రచనలలోకంటె కవిత్వమందే ఎక్కువ సత్యముండుటలో డెకార్టుకు సందేహములేదాయెను. ఈశ్వరప్రేరిత జ్ఞానము దైవికము; భావనాశక్తికున్న ప్రభావ మత్యధికము; ఇవిరెండు ప్రజ్ఞాయుక్తి జ్ఞానమునకు సులభతరముగా దొరికీయునని ఆయనతలచెను. ఇవిరెండును కవులకు స్వాయత్తములు. "ఏజీవితమార్గమును నేననుసరించవలెను?" అనుపంక్తి ఒకానొక జ్ఞాని యొక్కయో, ఈశ్వరమీమాంసపై ఆధారపడిన న్యాయశాస్త్రముయొక్కయో ప్రబోధముగా అర్థముచేసికొనెను. ఇంతలో, డెకార్ట్, తాను స్వప్నమందున్నానా లేక మేల్కొని ఆలోచించుచున్నానా యని సంశయముకల్గి మేల్కొనెను. అప్పుడుకూడ తన మూడవ స్వప్నమునే వ్యాఖ్యానించు కొనుచు, కవితా సంగ్రహము కన్పడుటకర్థము శ్రుతి, అంతఃప్రేరణ — ఈ (revelatation, inspiration) రెండును తన కృషి కనుకూలములనియు, "అవును, మరియు కాదు" అనుదానికర్థము

మానవజ్ఞానములోను వ్యావహారిక శాస్త్రములలోనుగల సత్యా సత్యములనియు భావించెను. తానుఊహించిన మహాకృషికి — అనగా సమస్త శాస్త్రముల పరస్పర సంబంధమును వెలుగు లోనికి తెచ్చి, స్వీయప్రజ్ఞతో నూతన దర్శనమును నిర్మించి, తన్మూలముగా సత్యాసత్య నిర్ణయముచేసి జీవితమునకొక నిశ్చిత మార్గము నేర్పరచుట — యోగ్యునిగా ఈశ్వరుడు తన్ను అనుగ్రహించినాడనునదియే ఈమూడు స్వప్నముల తాత్పర్యముగా డెకార్ట్ తలపోసెను.

డెకార్ట్ మ్రొక్కుబడి:

మరునాడు మేల్కొని, డెకార్ట్ తన స్వప్నములను గూర్చియే పరిపరివిధముల ఆలోచించుచు, తన సత్యాన్వే షణను సఫలము చేయుమని భగవంతుని ప్రార్థించుచు, తనకు నిర్దిష్ట విధానమును స్ఫురింపచేయుమని యాచించుచు గడపెను. ఏసుక్రీస్తు తల్లి మేరీనికూడా ఎంతయో యాచించి, తన కార్య సాఫల్యభారము నామెపై వైచి, ఆమె అనుగ్రహమును ఇంకను త్వరితముగా పొందగలందులకై, ఇటలీలోని లెటోలో గల యామె దేవాలయమునకు తీర్థాటనము చేసెదననియు, వెనిస్ నగరమునుండి పాదచారిగా లొరెటోకు వెళ్ళెదననియు, ఒకవేళ బడలికవలన నట్లు చేయలేకపోయినచో అతిహీనము లైన చినిగిన దుస్తులలో* వెళ్ళి దర్శనము చేసెదననియు

* తిరుమల వెంకటేశ్వర సన్నిధికి ముండనముచేసికొని, బిచ్చమెత్తి కొనుచు దీనావస్థలో వెళ్ళినట్లు.

డెకార్ట్ మ్రొక్కుకొనెను. వెంటనే కాకపోయినను, నాలుగేండ్ల పిదప 1624 లో డెకార్ట్ ఈ మ్రొక్కు చెల్లించుకొనగలిగెను.

### సమస్త శాస్త్రజ్ఞానమునకు మూలము: భగవదస్తిత్వము:

ఇట్లు సమస్త శాస్త్రములు పరస్పర సంబద్ధములను నొక మహాద్భుత నూతన శాస్త్ర (Mirabilis Scientiae) ప్రాతిపదికను డెకార్ట్ కనుగొనెను. నాటి నుండియు సమన్వయాత్మక మగు నావిశ్వతోముఖ శాస్త్ర స్వరూపమును కరతలామలక మెట్లుచేయవలె నను నదే డెకార్ట్‌కు జీవిత లక్ష్యమాయెను. అయితే తన ఈప్రయత్నము భగవదనుగ్రహమునకు పాత్రమైనదనియు, అందుకు తార్కాణము తన స్వప్నములనియు, తాను వెలువరింపబోవు శాస్త్ర ప్రపంచమున కంతకును భగవంతుడే మూలకందమనియు డెకార్ట్ ఆవేశ తాత్పర్యము. ఆయన ఈ ప్రతిభా దృష్టియే తదుపరి, ఆయన దర్శనము ఈశ్వరాస్తిత్వముపై నిర్మితమగుటకు కారణ మాయెను. ఈ అంతః ప్రేరణ (Inspiration) సుసంబద్ధమగు ఆలోచనా పథకముగా మారుటకు మాత్రము ఎన్నో సంవత్సరములు పట్టెను. కేవలము జ్ఞానసమాహారము దర్శనము కాజాలదు; ప్రతిభాదృష్టితో ఉద్దీపితమైనప్పుడే అనుభవమందలి, ఆలోచనల యందలి నానాత్వము సమన్వయ మొంది సుందర క్రమబద్ధ దర్శనముగా మారునని దీనివల్ల తెలియుచున్నది.

డెకార్ట్ : కవిహృదయము :

డెకార్ట్‌లోని కవిహృదయమును మొదటగా గమనించినవాడు రాత్తార్. డెకార్ట్ విద్యార్థిగా ఉన్నప్పుడు కవిత్వమును ఎక్కువగా చదువుచు ఆనందించెడివాడు. ఆయన రచనలలో శిల్పము, చిత్రలేఖనము, వాస్తువిద్య, రంగస్థలము, నిత్యజీవితములోని దృశ్యములు మొదలగువాని నుండి గ్రహింపబడిన ఎన్నో ఉపమానము లున్నవి. ప్రతిరాత్రి 10 గంటలు నిదురించుచు, వనములు, ఉద్యానములు, సుహాసౌధములు - వీని గూర్చిన స్వప్నముల గనుచు, కథలలో నూహింపబడిన సుఖముల ననుభవించుచు నుందుననియు, జాగ్రదావస్థలో కూడ దివాస్వప్నములను నక్తస్వప్నములతో తనకు తెలియకుండగనే సమ్మేళనము చేయుచుందుననియు, ఆయన బాల్జాకుకు ఒకమారు వ్రాసెను. (Colitationes Privalai) "స్వీయ ఆలోచనల" లో మనలో అంతర్నిహితముగా నున్న జ్ఞాన బీజములను దార్శనికులు బుద్ధి వ్యాపారమువలన వెలికి దెత్తురనియు, భావనాశక్తిచే కవులు వానిని వెలికి దెత్తురనియు, గంభీరార్థ యుక్తములగు ఆలోచనలు (Graves sententias) దార్శనికుల వ్రాతలలోకంటె కవుల వ్రాతలలోనే హెచ్చుగా ఉండుననియు ఆయన వ్రాసియున్నాడు.

ప్రమాణ పద్ధతి స్ఫురణ :

1619 శీతకాలములోను తరువాతను, డెకార్ట్ వాని ఆవిర్భావ (Manifestation) మును, అభివ్యక్తిని, వాహకములను (Media) వ్యావర్తనము చేసి, గణితశాస్త్రీయ పదార్థముల సంబంధములు యుగ్మనిష్పత్తులు (Proportions)- వీనిపై తన ఆలోచనల కేంద్రీకరించి ఎన్నో సమస్యల పరిష్కరించి, విశ్లేషణాత్మక రేఖాగణితము (analytical geometry) ను కనుగొనెను. దానిని ఏ విషయములోనైనను అన్వయింపవచ్చునెంచి రేఖాగణితముతో అన్వయించెను. సకలశారీరక ప్రక్రియలను గణితశాస్త్రరీత్యా ప్రతిపాదింపవచ్చునని తలచి, కాంతిశాస్త్ర (Optics), శరీర నిర్మాణ శాస్త్రములలో విశేషముగ కృషిచేసెను. ఖగోళ శాస్త్రజ్ఞుల తోడను, కళ్ళద్దములు, శాస్త్రీయ పరికరములు చేయువారి తోడను విశేషించి సహవాస సంభాషణలు చేసెడివాడు. 1620 నవంబరు 10 వ తేదీనాటికి ఒకక్రొత్తపరిశోధనకు ఆధారముల నర్థము చేసికొనసాగెను. వివిధశాస్త్రములలోని సత్యములను కనిపెట్టుపద్ధతి, అనగా బుద్ధిని సక్రమవిధానముగా నడిపించవలసిన పద్ధతి ఆయనకు కొంచెముగా స్ఫురించెనని దీనివలన తోచుచున్నది. సంవత్సరము క్రిందట సాధ్యమని తోచిన సమన్విత విశ్వతోముఖశాస్త్రమును (Unified-science) నిర్మించుటయను ఆదర్శమునకు మార్గమిప్పటికి

ఆయనకు తట్టెను. ఆమార్గమును సుస్పష్టము చేసికొని దానిని విశదీకరించుటకు మరి ఎనిమిదేండ్లు పట్టెను.

విశ్లేషణాత్మక రేఖాగణితము: భౌతికశాస్త్ర ప్రగతి:

ఇక్కడ విశ్లేషణాత్మక రేఖాగణితమునుగూర్చి వివరించుట యుక్తము. ఒక సమస్యను పరిష్కారము చెందినట్లుగా భావించి, ఆ ఊహాపర్యవసానములను పరీక్షించుట విశ్లేషణ పద్ధతి. ఒక సమతలమందలి బిందువు స్థానమును రెండు స్థిర సరళరేఖలనుండి గలదూరమునుబట్టి నిర్ణయించుటయే సహనిర్దేశకముల (Co-ordinates) ను ఉపయోగించుట. ఇది డెకార్ట్సుకు పూర్వము యూరప్‌లో ఎవరును చేయలేదు. రేఖాగణిత బీజగణితముల అన్వయమనగా, సంఖ్యాసంబంధములు కల్గిన పరిమాణములన్నిటిని రేఖలతో వ్యక్తపరచుటయే. (All quantities between which numerical relations hold are expressible by lines) గుణభేదములన్నిటిని ఆకార (Shape), పరిమాణ (Dimension) ములతో సంబంధితములుగా (Correlated) చేయవచ్చుననియు, ఈ సంబంధముల నన్నిటిని సంఖ్యారూపకమగు సంకేతముల ద్వారా (Numerical Symbolism) వ్యక్తీకరింపవచ్చుననియు, సంఖ్యాలక్షణముల ఆకారముల పరిమాణముల పరస్పర సంబంధములు (Relations between properties of numbers) సమీకరణము (Equations) ల ద్వారా వ్యక్తీ

కరింపబడవచ్చునియు ఈ పరిశోధనవలన నిర్ధారణ ఆయెను. అంతవరకు ఇతరమార్గములలో అనుసంధానము చేయబడు చున్న భౌతికశాస్త్రమిక అట్లుగాక సంఖ్యలతో—గణిత శాస్త్రముతో—మేళనముచేసినచో విశేషసఫలత సిద్ధించునని తోచుటకు డెకార్ట్ పరిశోధన దారితీసెను. 18వ శతాబ్దము నుండి ఇంతవరకు జరిగిన భౌతికశాస్త్రప్రగతి కిది ఒక ముఖ్య కారణము.

డెకార్ట్ ఫ్రాన్సుకు వచ్చుట: కొన్ని జీవిత సంఘటనలు:

1621 లో బవేరియా సైన్యముతో సంబంధమువాను కొని, ఇతర దేశములు చూచుకొనుచు 1622 లో స్వదేశ మగు ఫ్రాన్సుకు చేరెను. తన కుటుంబమునుచూచి, పొయి టోలోగల ఆస్తులనమ్ముకొని, దానినికూడ తన మూలధనము నకు కలుపుకొనెను. దానిపై వచ్చు ఆదాయ మాయన స్వతం త్రముగ జీవించుటకు, శాస్త్రకృషిని జీవనోపాయముగ చేసి కొనకుండ ఉండగలుగుటకు ఉపయోగించెను. ఆయనకుటుంబము ఇక ఆయన వివాహితుడై అక్కడే ఉండునని ఆశించెను గాని వివాహచింతనమాత్రము ఆయనకు లేదాయెను. సత్యమున కున్న సౌందర్యముతో సమానమైన సౌందర్యము ఎక్కడను తనకు కానరాలేదని ఒకసారి ఆయన ఒకసౌందర్యవతితో ననెను. అవివాహితుడయ్యును, ఆయనకొక కుమార్తె కలుగు టయు, ఆపిల్ల ౬ వ ఏటనే గతించుటయు అదియే తన జీవిత

ములోకెల్ల గొప్ప విషాదకరమగు సంఘటన యని ఆయన భావించుటయు సంభవించెను. పూర్ణముగా బుద్ధిని అభివృద్ధి చేసికొని విజ్ఞానమును విస్తరించుటకు జీవితమును వినియోగించు స్వాతంత్ర్యమునకు వివాహ మడ్డంకి యని ఆయన విశ్వసించెను.

ఇటలీపర్యటన: తీర్థయాత్ర: పునరాగమనము:

1623 లో తిరిగి దేశాటనమునకై బయలుదేరి స్విట్జర్లాండులో కొంతకాలముండి అక్కడ కొంతవాతావరణాధ్యయనము (Meteoglcroical Studies) చేసెను. పెద్దమంచుగడ్డల స్వరూపమును పరిశోధించెను. పర్వతముల ఎత్తులను గుణించెను. తర్వాత ఇటలీ వెళ్ళి అక్కడ కొంతకాలముండెను. అప్పుడే తన లారెటో (మొక్కు తీర్చెను. ఆ దినములలో ఇటలీ, శాస్త్రజ్ఞుల కాటపట్టుగను, శాస్త్రకృషికి విశేషాదరణనిచ్చు దేశముగను ఉండుట చూచి డెకార్ట్ అక్కడే స్థిరనివాస మేర్పరచుకొన దలచెను. గాని, ఇటలీలోని ఉష్ణవాతావరణము ఆరోగ్యము నకును, దేశములోని ప్రభుత్వముయొక్క అవ్యవస్థ శాంతికిని, ప్రాణమునకును భంగకరములని ఎంచి 1625 లో స్వదేశమునకు వచ్చి ప్యారీ నగరమందు నివసింపసాగెను. అక్కడ కార్డినల్ (క్రైస్తవ మహాధికారి) బెరుల్‌తోడను, మెర్సేన్ అను క్రైస్తవ సన్యాసి తోడను, ఖగోళ శాస్త్రజ్ఞులతోడను, యంత్ర శాస్త్రజ్ఞులతోడను (Engineers) సన్నిహితుడుగా ఉండుటయే గాక, సంగీతము, నవలలు, జూదము, కవిత్వము—వీని గోష్ఠిలో కాల

యాపనముచేయు చంచలమనస్కులతో గూడ ఎక్కువ వాలము గడపుచుండెను.

డెకార్ట్ తన ఊహలను బహిరంగ పరచుట:

నవంబరు 1628 లో డెకార్ట్ ప్యారీ నగరమందుండగా, అచటి పోపురాజదూత (Papain uncio) ఇంటనొక సమావేశమున కాహ్వానింపబడెను. ఛాండో అను నాతడు అరిస్టోటిల్ మున్నగు గ్రీకుల, ఎక్వినాస్ మొదలగు మధ్యయుగపు క్రైస్తవచింతకుల దర్శనములను వదిలివేసి ఒకక్రొత్త దర్శనమును నిర్మించితి నని చెప్పుచుండుటచే, దాని ప్రధాన సూత్రము లేవియో తెలిసికొను కుతూహలముతో రాజదూత ఆసమావేశము నేర్పరచి, తానెఱిగిన పండితులను, దార్శనికుల నందరిని దాని కాహ్వానించెను. అందు ఛాండో తత్కాలమందు ప్రాధాన్యము నొంది యుండిన దార్శనిక వాదముల నన్నిటిని ఖండించి, తాను క్రొత్తగా నిర్మించుచున్నాడ నని చెప్పుచున్న దర్శనమును విపులముగా వివరించుటకును దాని నూతనత్వమును స్థాపించుటకును ప్రయత్నించెను. డెకార్ట్ తప్ప సమావేశమునకు వచ్చిన ప్రతివాడు దానిని విని ఛాండోను ఎంతగనో ప్రశంసించిరి; ఆనూతన వాదము వారినందరిని ఆకర్షించెను. డెకార్ట్ యొక్క తాటస్థ్యమును, ప్రశంసా విముఖత్వమును చూచి, ఆ సమావేశమున కాహ్వానితుడై వచ్చిన కార్డినల్ బెరుల్ డెకార్ట్ను గూడ ఆ దర్శనమునుగూర్చి తన

అభిప్రాయము తెలుపుమని అడిగెను. తనకంటె పండితులైన అంతమంది పెద్దలచే ప్రశంసింపబడిన ఆవాదమును గూర్చి తాను చెప్పవలసిన దేమియు లేదని డెకార్ట్ తప్పించుకొన దలచెనుగాని, కార్డినల్, రాజదూత, తదితరులుగూడ బల వంతపెట్టగా డెకార్ట్ ప్రసంగింపవలసివచ్చెను. ఆయన ఛాండో వాక్చాతుర్యమును అనర్గళధారను ప్రశంసించి, గ్రీకుల, మధ్య కాలీనుల భావపారతంత్ర్యమునుండి తప్పించుకొనుటకు అతడు చేసిన ప్రయత్నమునుగూడ కొనియాడి,సత్యమునకు సత్యాభాస మునకు (Verisimilitude) గల భేదమును గ్రహించిననేతప్ప స్పష్టమైన నిశ్చితజ్ఞాన మేర్పడదనియు,అట్టివివేకము లేనందుననే సత్యాభాసము నంతమంది విద్వాంసు లాదినమున సత్యమని గ్రహించిరనియు చెప్పెను. సత్యమనినమ్మబడిన దేనినైనను అనేకవిధములుగ తర్కములతో ఖండింపవచ్చుననియు, అట్లే అసత్యముగా ఎంచబడినదానినికూడ తర్కములతో ఋజువు చేసి సత్యముగా తోపింపచేయవచ్చుననియు దృష్టాంతములతో ఆయన చూపెను. గణితశాస్త్రమం దుపయోగింపబడు పద్ధతి ననుసరించి తక్కిన విషయములందుగూడ స్పష్టము నిశ్చితము నగు జ్ఞానము సంపాదింపగల్గి సందేహామున కేమాత్రము తావులేని జ్ఞానమును సంపాదింపగల్గి సందేహామున కేమాత్రము తావులేని దర్శనమును నిర్మించగలిగినతప్ప, ప్రాచీనదర్శనముల ననిశ్చితములుగా నిరాధారజల్పములుగా త్రోసివేసి తాదృశ మైనదే మరొక ఊహాబోధితమగు అనిశ్చితవాదమును నిలువ

దీయుటలో ప్రయోజనములేదని డెకార్ట్ అక్కడనున్న అందరికిని తెలుపగల్గెను. ఎల్లరు డెకార్టుయొక్క తార్కికపటిమను, ప్రతిభను వాగ్ధోరణిని చూచి ముగ్ధులై ఆయన అభిప్రాయముల వైపునకే మ్రొగ్గిరి. అందులో ముఖ్యముగా కార్డినల్ బెరుల్‌కు డెకార్ట్ చెప్పినదంతయు బాగుగా నచ్చుటచే మరొకమారు ఏకాంతమందు విపులముగా ఇదంతయు వినుటకు అవకాశ మీయమని ఆయన డెకార్ట్‌ను కోరెను.

కార్డినల్ బెరుల్ ఆదేశము:—

తర్వాత కొన్ని దినములకు డెకార్ట్ కార్డినల్ బెరుల్ సన్నిధికి వెళ్ళి, అంతవరకు దర్శనశాస్త్రమం దుపయోగింపబడుచున్న పద్ధతులు తన కెట్లు అసంతృప్తికరములుగా నున్నదియు, గణితశాస్త్రమం దుపయోగింపబడు పద్ధతినే ఇందుకూడ ఉపయోగించిన ఎట్లు లాభకరమైనదియుచెప్పి, తద్వారా పొందనగు కొన్ని సిద్ధాంతములనుచూపి, వీటిని విస్తరించి వైద్యశాస్త్రమునకు, యంత్రశాస్త్రమునకు (Mechanics) కూడ నన్వయించుటవలన ఆశాస్త్రములు అపారవృద్ధి నొందుననియు, తన్మూలముగా మానవలోకము నిరామయముగా ఆరోగ్యముగా నుండుటకును, శ్రమలేకుండ సుఖజీవితము గడపుటకును వీలగుననియు చెప్పెను. కార్డినల్ బెరుల్ డెకార్ట్ కనిపెట్టిన ప్రమాణపద్ధతి ప్రాముఖ్యమును, దాని ఉపయోగమును గ్రహించి, డెకార్ట్ సర్వవిధముల సమర్థుడని ఎంచి, ఈ మహా

కృషిని నిర్వహించుట ఆతని విధియనియు, ఈశ్వరు డంతటి బుద్ధిసూక్ష్మత, ప్రతిభ ప్రసాదింపగా, వాని నుపయోగింపక మానవలోకమునకు వాని ఫలితముల నందీయకపోయినచో, అది భగవదపరాధమే అగుననియు డెకార్ట్‌కు నచ్చచెప్పి, అంతఃకరణసాక్షిగా ఈవిధి నిర్వహించుకొనుమని డెకార్ట్‌కు బోధించెను.

బెరుల్ : భక్తిసంప్రదాయము:అగష్టీన్ ప్రభావము:

కార్డినల్ బెరుల్ మహాభక్తుడు. ఆయన 1611 లో ఆరోటోరియను క్రైస్తవ సన్న్యాసుల సంఘమును స్థాపించి, క్రైస్తవ గురువులలో భక్తిప్రచారమును తదనుగుణజీవితమును పెంపొందింపసాగెను. తన్నుతాను మరచి కేవలము ఈశ్వర ప్రత్యర్థమే కర్మలను చేయుట భక్తికి తాత్పర్య మనియు, మనము బ్రతుకుచున్నది భగవదర్థముగాని మనకొరకు గాదనియు, జీవితాదర్శము, గమ్యము భగవంతుడే అని బెరుల్ బోధించెడివాడు. జ్ఞానముకంటె భక్తికి ప్రాధాన్యము, తార్కిక వాదములకంటె అంతర్వీక్షణమునకు ప్రాముఖ్యము, నరుని నీచత్వమును భగవంతుని మహామహిమత్వములు సర్వ శక్తిమత్త్వమును ప్రబోధించు సిద్ధాంతములు కల్గిన బెరుల్, ఆయన అనుచరుడు జిబియుఫ్‌లు ప్రచారముచేసిన సంప్రదాయము ప్లేటో, అగష్టీనుల సిద్ధాంతములకు సన్నిహితముగను, అరిష్టాటిల్ థామస్ ఎక్వైనస్‌ల సిద్ధాంతములకు కొంత వ్యతి

లేకముగ ఉండుటచే, అరిస్టోటిల్ ఎక్వినస్‌ల వాదములు ప్రచారములోనున్న ఆ దినములలో ఈ భక్తి సంప్రదాయ-స్థాపన పలువురకు కొంచెము క్రొత్తగను అనిష్టముగనుఉండెను. ఈ సంప్రదాయ స్థాపకుడగు బెరుల్‌తో అతి సన్నిహితసంబంధము, జిబియుఫ్‌తో స్నేహము, డెకార్ట్‌పై అగస్టీను ప్రభావమునకు కారణమాయెను. మానవుడు నిర్ణయమునకు వచ్చుటలో అతనిలోని ఇచ్ఛ, లేదా, సంకల్పము (Will) వహించు ప్రముఖపాత్ర, జ్ఞానోపార్జనలో మనస్సు కేవలము నిష్క్రియమగు స్థాణువుకాదనియు, దానిలో క్రియాశక్తి గలదనియు చెప్పెను. "చింతించుచున్నాను కాబట్టి నేనున్నాను" అను నిర్ణయమునకు వచ్చుటలోను డెకార్ట్ దర్శనమందలి అగస్టీను ప్రభావము కన్పడుచున్నది.

మహాభక్తుడును, పుణ్యాత్ముడును అగు బెరుల్ ఆదేశమును శిరసావహించి, నూతనదర్శన స్థాపనచేసి, తన్మూలముగా శాస్త్రవిజ్ఞాన విస్తరణము గావించి లోకహితమునకు పాటుబడుటయే తన జీవితలక్ష్యముగను, విధిగాను, డెకార్ట్ నిశ్చయించుకొనెను. స్వప్నములద్వారా క్రిందట తనకువచ్చిన ఆదేశమును, నేడు బెరుల్‌ద్వారా ఈయబడిన ఆదేశమును కూడ ఈశ్వరాజ్ఞలుగా డెకార్ట్ తలచెను. భగవంతుని తర్వాత బెరుల్ అన్ననే డెకార్ట్‌నకు గౌరవము. 1626–8 లలో బెరుల్, జిబియుఫ్‌లతో అత్యంత సన్నిహితుడుగా

నుండి, 1628 లో ఈ ఆదేశమును పొందెను. ఆసంవత్సరము లోనే డెకార్ట్ ఈశ్వరుని గూర్చిన తన భావములను పరిపక్వము చేసికొనెను.

ప్రమాణపద్ధతి కాధారమేది?

1620 నుండి డెకార్ట్ సర్వశాస్త్రములలోను నిశ్చిత జ్ఞానము నీయగల ప్రమాణపద్ధతి (Method) ని వెదకుచు కొన్ని నిర్ణయములకు వచ్చినాడని, వానిని గూర్చియే ఆలోచించుచు ఉండెనని చెప్పియున్నాము. 1628—29 సంవత్సరపు శీతాకాలమందు ఈమీమాంసాఫలితమంతయు డెకార్ట్ (Regulae) "నిబంధనలు" అను గ్రంథరూపముగా చాల వరకు వ్రాసెను, కాని దానిని ఆయన పూర్తిచేయుటగాని తన జీవితకాలమందు ప్రచురించుటగాని జరుగలేదు. కాని దాని లిఖితప్రతిని పలువురు విద్వాంసులు చూచుటయు, హాలండులో దానికి విస్తారప్రచారము జరుగుటయు సంభవించెను. సుప్రసిద్ధ బ్రిటిష్ దార్శనికుడు, ఉదారరాజకీయ తత్త్వము (Liberal Political Philosophy) నకు, ప్రజాతంత్రము (Democracy) నకు పునాదులు వేసిన లాక్ కూడ దానిని చదివెననుట కాధారముగా దాని ప్రభావము ఆయన వ్రాసిన వ్యాసమందు (Essay) చాలచోట్ల సుస్పష్టముగా కనబడుచున్నది. జ్ఞానముయొక్క స్వభావమెట్టిది? దానికిని జ్ఞేయపు స్వభావమునకును గలసంబంధమెట్టిది? అను

సమస్యను గూర్చియు అంతర్దృష్టి (Intuition) ని గూర్చియు డెకార్ట్‌కు 32 వ ఏడు వచ్చునప్పటికి గల ఊహాలు "నిబంధనలు" అను గ్రంథమందు పొందుపరచబడినవి. అందరిచేత నిరభ్యంతరముగా అంగీకరింపబడు సుగమములైన స్వయంసిద్ధ విషయములందే నిశ్చయత్వ ముండుననియు, కాబట్టి ఆవిషయములు అందరు ఎఱిగిన సనాతన సత్యములనియు, వీటినుండి క్లిష్టవిషయములకు పోవునప్పుడు మనము వేయు ప్రతి ముందడుగు సందేహరహితముగా నుండవలెనని డెకార్ట్ అందు సిద్ధాంతీకరించెను. అయితే, స్పష్టము, విశదము అయినదే సత్యము అను సూత్రముపై ప్రమాణపద్ధతి ఆధారపడిననే శాస్త్రములలో సద్యఃపురోగతి యుండునని చూపించిన డెకార్ట్‌కు, క్రొత్తసమస్య ఒకటి ఉదయించెను. ఈ సూత్రము ఋజువుచేయుట ఎటుల? ఇది కేవలము ఊహామాత్రమయినచో, ఆయన ప్రమాణపద్ధతికి గట్టిపునాది యుండదు. కాక, అంతకు కొంచెము పూర్వమే మోన్‌టేన్, చార్రోన్‌లు నిశ్చితజ్ఞానము అసలు అసంభవమను వాదమును లేవదీసి యుండిరి. ఇట్టి పరిస్థితిలో డెకార్ట్ సూత్రమేయాధారముపై నిలువబడగలదు? ఆయన కనిపెట్టిన ప్రమాణపద్ధతిని తద్ద్వారమునసే ధృవపరచబూనుట అనవస్థాదోషమగును. కాబట్టి, డెకార్ట్ దీనిని గురించి ఇంకను ఆలోచించవలసి వచ్చెను. ఆయన అన్వేషణకు పరిసమాప్తి లేదాయెను.

ఈపాటికే ఆయన "ఒలింపికా", "స్వీయఆలోచనలు" అను రచనలుకూడ చేసెను; వీటియందు ఆయన సత్యాన్వేషణ చరిత్ర, అప్పుడప్పుడు తోచిన భావములు, చేసిన సిద్ధాంతములు ఉండెను. ఇప్పుడవి ఖిలమైపోయినవి, వాని ఖండములు మాత్రము బెయిలెట్ వ్రాసిన డెకార్ట్స్ జీవిత చరిత్రలో ఫ్రెంచి అనువాదములుగను, లైబ్నిజ్ అను సుప్రసిద్ధ జర్మన్ తత్త్వవేత్త చూచి వ్రాసికొనిన లాటిన్ మూలప్రతులలోను అవశిష్టములు.

## డెకార్ట్స్ లక్ష్యము :

శాస్త్రములందు పరిశోధనలు, నూతనదర్శనస్థాపన, తన్మూలముగా మానవులు ఐహికసుఖములన్నిటిని విశేషశ్రమ లేకుండ అనుభవింపవలెననునదే తన జీవిత పరమాశయముగా డెకార్ట్స్ భావించెను. పైగా ఇది భగవంతుడు తనపై వేసిన బాధ్యతయని నమ్మెను. శారీరక, మానసిక రోగరహితులై, వీలైన జరామరణరహితులై, సర్వవిధములగు సౌఖ్యములతో మానవు లుండగల్గుటకు మార్గమేది? ప్రకృతినిజయించి దానికి యజమానుడై మానవు డెట్లు శ్రమ రహితముగా జీవించనగును? ఇవియే డెకార్ట్స్‌కు పరమలక్ష్యములు. అందుచేతనే ఆయన వైద్యశాస్త్రమందు విశేష పరిశోధనలుచేసెను. అయితే, ఆయనదృష్టిలో చికిత్సాశాస్త్రము మాత్రమే వైద్యశాస్త్రము కాదు. మనుష్యులను ఎక్కువ

జ్ఞానవంతులుగా, సమర్థులనుగా చేయగల్గునదియే వైద్య శాస్త్రము. మానసికాభివృద్ధి దేహారోగ్యముపైన, దార్ఢ్యముపైన ఆధారపడియున్నది. శరీరనిర్మాణశాస్త్రము, గర్భశాస్త్రము ఈసమస్యల పరిష్కరించుట కవసరము. పూర్ణ మానవుడే నైతికపథమందగ్రగనుడు కాగల్గును; రోగరహితుడు సంతోషచిత్తుడు అయిన మానవుడే పూర్ణమానవుడు. ఇవి జ్ఞానవంతునికే సాధ్యము. అప్పుడు ప్రకృతిని జయించి రోగములను, ఈతిబాధలను, కష్టములను నివృత్తిచేసికొనగలైదము. ప్రకృతిని జయించుటకును, సునాయాసజీవితము గడపుటకును యంత్రశాస్త్రము ఆవశ్యకము. ఈవిధముగా, వైద్య, యంత్ర నీతిశాస్త్రములు (Medicine, Mechanics, Morals) సమన్వితములగును. ఇది ఆయనను పురిగొల్పిన ఆదర్శము.

సంగపరిత్యాగము: హాలెండుకు వెళ్ళుట:

ఈ శాస్త్రీయకృషి, దార్శనిక చింతన నిరాబాధముగా అహర్నిశలు చేసికొనవలెనన్న ప్యారీయందుండినచో అక్కడ తనమిత్రులయు, పరిచితులయు, రాకపోకలు, వారితో సరససల్లాపములు, ఇతర కార్యక్రమములు అడ్డంకులగునని ఎంచి, ఏవిధమైన ఉద్యోగములుగాని, పెండ్లిసంబంధములుగాని అపేక్షింపక, సత్యాన్వేషణార్థము, ప్రచారార్థము దేవుడు తనను సృష్టించినాడని నమ్మి, డెకార్ట్ 1628 సంవత్సరపు చివరలో ఫ్రాన్సును వీడి హాలండు దేశమునకు వెళ్ళి అక్కడ

స్థిరనివాస మేర్పరచుకొనెను. హాలెండు వేడి దేశము కానందున దాని శీతోష్ణస్థితి మానసిక వ్యాపారమున కనుకూలతను, తగు ఉత్తేజమును ఈయగలదనియు, ఆకాలమందు రాజకీయశాంతి, సుస్థిరప్రభుత్వము కలిగి మతసహనమునకు ఆటపట్టగుటచే, హాలండులో విచారస్వాతంత్ర్య ముండుననియు, ఈకారణ ములచేతనే పలుదేశములనుండి అచటికి చేరిన విద్వాంసుల తోను, శాస్త్రపరిశోధకులతోను సహవాసప్రాప్తి, సంభాష ణల కవకాశము దొఱకుననియు డెకార్ట్ హాలండుకువెళ్ళి, అచట సౌఖ్యముగా ఆధ్యాత్మిక అనాసక్తితో నుండసాగెను. 1628 చివరలో వెళ్ళి 1649 వరకు అచటనే ఉండెను.

డెకార్ట్ శాస్త్రీయ ప్రయోగములు: ఫలితములు:

హాలండులోనున్న 20 ఏండ్లు ఆయనకొక ప్రయోగ శాల, ఒకతోట ఉండెడివి. అద్దముల, రంగులు, ప్రకాశము లను గూర్చి; శరీర నిర్మాణము, గర్భనిర్మాణాభివృద్ధులను గూర్చి; వనస్పతి జీవశాస్త్రము (Science of plant-life) ను గూర్చి పరిశోధనచేయుటకు వలయు సౌకర్యము లీప్రయోగ శాలయందును, తోటయందును ఉండెడివి. ఆవుల పిండములు, పొదగబడుచున్న కోడిగ్రుడ్లు ఆయన గర్భజీవాభివృద్ధి పరిశో ధనల కెక్కువగా ఉపయోగపడెడివి. జంతుశరీరములను మూల్యమునకుకొని, శస్త్రపరీక్ష చేసెడివాడు. కన్ను, మెదడు, ఊపిరితిత్తులు, గుండె — వీనిపై ఆయన హెచ్చుగా పరిశోధ

నముచేసి చూచెను. జీవితపు చివరి ఆరేండ్లలో ఆయన పరిశోధనలు మరింత హెచ్చుగా చేసెను. "జంతువుల ఉత్పత్తి" "మానవ శరీరవర్ణన", "గర్భ నిర్మాణ విధానము" మొదలగు జీవశాస్త్ర విషయిక గ్రంథముల వ్రాసెను.

డెకార్ట్ పనిచేసిన విధము:

ఆయనకు నిత్యము ప్రాతఃకాలముననే మేల్కొని, దాదాపు మధ్యాహ్నమువరకు శయ్యపైనుండి లేవక పరుండియే దార్శనిక విషయములను గూర్చి ఏకాగ్రతతో చింతన చేయుటయు, అనుదినము కొన్నిగంటలు మాత్రమే విశేషముగా మానసిక పరిశ్రమచేసి తరువాత కాలమంతయు విశ్రాంతితోను, వినోదములందు గడపుటయు, పరిపాటి. ఏకాగ్రతతో నిట్లు ఆలోచించు సమయములందే ఆయనకు సృజనాత్మకశక్తిగల అనేక నూతన సత్యములు, ఊహాలు హఠాత్తుగా స్ఫురించుచుండెను. తరువాత ఎన్నో నెలలు, సంవత్సరములు వానిని పరిపరి విధముల పరీక్షించి విస్తరించి దార్శనిక సిద్ధాంతములుగనో, శాస్త్రీయసిద్ధాంతములుగనో ప్రవచించుట ఆయనపద్ధతి. ఆ చింతన ప్రగాఢము ఏకాగ్రము కావుననే, ఆయన కొన్నిగంటలసేపు మాత్రమే చింతింపగల్గెడివాడు. నూతన సత్యస్ఫురణము కాబోవునప్పుడును ఆయన కొన్నిదినముల వరకును ఒకానొక ఆవేశస్థితిలో నుండెడివాడు.

"విశ్వ" మను గ్రంథరచన:

హాలెండుకు వెళ్ళిన మొదటి ఒకటిరెండేండ్లు దార్శనిక విషయములను గూర్చి, తాను కనిపెట్టిన ప్రమాణపద్ధతికి సంశయరహిత ఆధారమునుగూర్చి ఎక్కువగా మననముచేసి కొన్ని నిర్ణయములకు వచ్చుట, నాటిని కొంతవరకు గ్రంథస్థముచేయుట జరిగెను, గాని త్వరలోనే ఆ పని నాపి ఆయన మరొక విషయముపై దృష్టిమరల్చెను. తాను కనిపెట్టిన ప్రమాణపద్ధతి నుపయోగించి భౌతికశాస్త్రనిర్మాణము జరుపు ప్రయత్నమే ఇది. ఈ పద్ధతిని ఇంద్రియ విషయములన్నిటికిని వర్తింపచేసి, విశ్వస్వరూపమెట్టిదో కనుగొని దానిని వివరించుటే కృషిగా పెట్టుకొని, 1633 నాటికి "విశ్వము"(Monde) అను గ్రంథరచన పూర్తిచేసి దానిని ప్రకటింప నాతడు ప్రయత్నింపసాగెను.

అందలి భౌతికశాస్త్రవాదము:

ఈ గ్రంథమందలి వాదమిది: విశ్వమంతయు నిరపవాద నైసర్గిక సూత్రముల ననుసరించి నడచుచున్నది. ప్రకృతిలోని క్రియాశక్తియంతయు గతి (Motion) యే, అది నిర్ధారితనియమములను బట్టియే సాగుచుండును. అదితప్ప ఏకార్యమునకు వేరు కారణములేదు. పదార్థముల చలనముగాని, జంతువులయందలి చరత్వముగాని అంతయు గతివిధానములే. జంతువులన్నియు వేదన (Feeling) గాని, చైతన్య

ముగాని లేనియంత్రములు. మనస్సునకు తనకుదానుగా భావములను సృజించు శక్తిలేదు. దానికి అభివ్యక్తమైన జ్ఞాన "విషయముల" ("Objects" of Knowledge) నది నిష్క్రియమై గ్రహించును. భావనాశక్తియు, స్మృతియుగూడ దీని కపవాదములు కావు. విశ్వమందు ప్రతివస్తువుయొక్క స్థానము, చలనము - అది గ్రహములు, వాని గతులు కానిండు, స్థిరనక్షత్రములు కానిండు, చీమనడక కానిండు— నియంత్రితములే. ఈ విధముగా విశ్వస్వరూపమును సాంగోపాంగముగా విపులరీతిన వర్ణించి, డెకార్ట్ ఆగ్రంథమున కోపర్నికస్ వాదమును — అనగా భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్నది, భూమి విశ్వమునకు కేంద్రము కాదు అనుదానిని — బలపరచెను. స్థావరజంగమ సేంద్రియ నిరింద్రియమగు యావద్విశ్వము — మనుష్యుని ఆత్మతప్ప — యంత్రము వంటిదనియు, గతిసూత్రములను బట్టియే (Laws of motion) విశ్వోత్పత్తిని విశ్వప్రక్రియను — జంతువులయు మానవదేహములయు ఉత్పత్తి, అభివృద్ధి ప్రక్రియలనుకూడ — అర్థముచేసికొనవచ్చుననియు, అందు డెకార్ట్ చూపించెను. ఈశ్వరుడు మన మనస్సుచే గ్రాహ్యుడయ్యు, దానిచే సర్వదా అగ్రాహ్యుడు ; మనుష్యునిగూర్చి మనకు తెలిసిన దానినుండి ఈశ్వరునిగూర్చినసాదృశ్యజ్ఞానము (Analogical knowledge) అసంభవము; తత్కాలమందు ప్రచారములోనున్న దర్శనములందు 'శాశ్వత సత్యము' (Eternal truths) లనబడునవి

(రెండు రెండ్లు నాలుగు ఇత్యాదులు) మనకు నిస్సంశయము లైనను స్వతఃప్రమాణములు కావు; — అను సిద్ధాంతములను గూడ డెకార్ట్ ఆ గ్రంథమందు ప్రతిపాదించెను.

గెలీలియోకు పట్టిన దురవస్థ:

ఈ ఉద్గ్రంథమును ప్రకాశకులకుపంపు సమయముననే తన స్నేహితుడగు మెర్సీన్ ద్వారా, గెలీలియో వాదములను క్రైస్తవమతసంస్థ సత్యవిరుద్ధములుగా ఘోషించి, ఆయనను శిక్షించినదనియు, ఆయన పుస్తకమును బహిరంగముగా తగుల పెట్టినదనియు డెకార్ట్ వినెను. భూమి విశ్వమునకు కేంద్ర మను ప్రాచీన ఖగోళశాస్త్రీయవాదమును ఖండించి, దాని నుండి అనేక నిగమనములు చేయుటవలన గెలీలియో కీ దురవస్థ ప్రాప్తించెను. ఇట్టి నూతనవాదనలు క్రైస్తవ వేదప్రమాణమునకు విరుద్ధములగుటచే సత్యములు కాజాలవు; అరిస్టాటిల్ చేసినట్టి, మధ్యకాలీన విద్వాంసులచే సమాదరింప బడినట్టి, వాదములకు విరుద్ధములగుటచే గెలీలియో ఇత్యాదుల వాదములు కేవలము మానవబుద్ధిపై నాధారపడిన తర్కము నకుకూడ విరుద్ధములు, అసత్యములు—అని క్రైస్తవధర్మసంస్థ (True Church) తీర్మానించెను.

నాటి మతావేశములు:

డెకార్ట్ ఇది విని ఆశ్చర్యచకితుడాయెను. తానుకూడ ఇట్టి వాదమునే సమర్థించెను కదా; తన పుస్తక ప్రచురణము

జరిగినచో దాని కీగతియే పట్టునని ఆయన తలచెను. గెలీలియో పుస్తకమును బీక్‌మెన్‌వద్ద సంపాదించి చదివి చూచి, తాను చేసిన అనేక నిర్ణయములను గెలీలియోకూడ స్వతంత్రముగా చేసి యున్నాడనికూడ గ్రహించెను. డెకార్ట్ నాల్గేండ్లవాడై యుండ, బ్రూనో యను తత్త్వవేత్త తన ఈశ్వరవాదములోనికి కోపర్నికస్ చేసిన సిద్ధాంతముల నిమిడ్చినందులకు, బైబిలులోవర్ణింపబడిన సృష్టిక్రమగాథ పౌరాణిక కల్పన యని సూచించినందులకు, బ్రతికియుండగనే రోములో కాల్చివేయబడెను. 20 ఏండ్ల పిదప ఒకానొక విధమగు సహజవాదము (Naturalism) ను ప్రతిపాదించినందులకు ఫ్రాన్సులోని టోలోస్ ప్రాంతమున వీనిని తగులబెట్టబడెను. తరువాత సంవత్సరము మోంట్‌పిల్లియర్‌లో ఫొంటేనియర్‌కు ఈగతియే పట్టెను. నాస్తికులు, అపసిద్ధాంతకర్తలు, ప్రచారకులు అను నెపముతో నెందరో ఇంగ్లాండులో ఎలిజబత్ రాణి, ఒకటవ జేమ్సుల పరిపాలనలో కారాగారబద్ధులైరి.

పుస్తకప్రకటన మానుకొనుటకు కారణములు:

గెలీలియోపై చేయబడినవిర్ణయము క్రైస్తవులెల్లరు అవశ్యము విశ్వసింపవలసిన విషయము (article of faith) కాకపోవుటచే, దానిని నమ్మనివారికి చిత్రవధ శిక్షగా విధింపరని తెలిసియు హాలండులోనున్న తన్ను కెతోలిక్ చర్చివేమియు చేయజాలదని తెలిసియు, ఈక్రిందికారణములచే డెకార్ట్ తన

పుస్తక ప్రచురణప్రయత్నము నాపెను : ( 1 ) క్రైస్తవ ధర్మ సంస్థకు విధేయుడుగా నుండుట ధర్మము. ( 2 ) గెలీలియో సంఘటనకు వెనువెంటనే తనపుస్తకము ప్రచురించినచో దాని వలన తనకు అనవసరముగా విపరీతమగు అపఖ్యాతివచ్చుట తనకుఅనిష్టము. ( 3 ) మందబుద్ధులగు జనసామాన్యమునకు సంభ్రాంతి కలిగించుటచే సత్యము చెప్పినను గ్రహింపరు. ( 4 ) విరుద్ధపరిస్థితులకు ఎదురీత ఈదుట తనస్వభావముకాదు. ( 5 ) తత్కాలమున, తనపుస్తకము వెలువడుటచే రేగు తర్కవితర్కములు, ఖండనమండనము తన మనశ్శాంతికిని నిష్పాక్షికమగు సత్యాన్వేషణకును భంగకరములు - ఇదికాక, ( 6 ) ఆయన "మానసిక వికారములు" (Passions) అను గ్రంథములో (Ecxi) చెప్పినట్లు, అగౌరవమునకు పాల్పడకుండ తన్నుతాను రక్షించుకొనుటకు వీలున్నప్పుడు జీవితము పోగొట్టుకొనుట తెలివితక్కువ. పరిస్థితులుఅడ్డము తిరిగినప్పుడు నిశ్చయమరణమును వరించుటకంటె గౌరవముగా వెను దీయుటయో, కొంతవరకు సమాధానమునకు వచ్చుటగాని మంచిది. ఇట్లాలోచించి ఆయనదానిప్రచురణ నాపికొనెను.

బైబిల్ సృష్టిగాథనుగూర్చి నఆయన అభిప్రాయము :

డెకార్ట్ భావ్యాప్రవర్తన ఇట్లున్నను ఆయనసన్నిహితు లలో రోసిక్రూసియన్ సంప్రదాయమునకు చెందినవారు, నిరీశ్వరవాదులుకూడ నుండిరి. బైబిల్ చెప్పినదంతయు అక్షరశ

నిజముకాదనియు, అందులోని సృష్టిక్రమగాథ నిజము కానేర దనియు, ఆయనతలచెనని తనస్నేహితులకు ఆయనవ్రాసిన ఉత్తరములు తెల్పును. సత్యమునపిహితము చేయవలెను, నేనొక ముసుగుధరించినానుఅని ఆయన చెప్పుచుండెడివాడు.

సత్యము నెట్లు ప్రకటింపవలెనను యోజన:

ఒక్క మారుగా విశ్వమునుగూర్చిన సాంగోపాంగమగు వాదమును ప్రజల ఎదుటఉంచి మతాధికారులకును, జనసామా న్యమునకును బుద్ధిభేదమును కల్గించుటకంటె, ముందు తన ప్రమాణ పద్ధతి నుపయోగించుటవలన వచ్చిన, భిన్నాభిప్రాయ ములకు తావులేని, ఫలితములను ప్రదర్శించి, తన్మూలముగా తన భౌతికశాస్త్రవాదపు ప్రధానసూత్రముల నెల్లరికి అంగీకారము లుగ చేసినచో, తనవాదమంతయు పరస్పరానుబద్ధమగు సిద్ధాం తము కావున, అందలి ఒకభాగ మామోదించి మరొకభాగ మును త్యజించుట అసంగతమగును గావున, క్రమముగా తన వాదమంతయు సర్వాంగీణముగ అంగీకరింప బడునుఅని ఆయన యోజించెను. ఈ నిర్ణయము ననుసరించితాను కనుగొనిన కొన్ని శాస్త్రీయ ఫలితములను వెలువరింపదలచెను.

శాస్త్రీయ ప్రయోగముల ఫలితములను ప్రకటింప నిర్ణయించుట:

1629 లో డెకార్ట్ కొన్ని వాతావరణ విషయిక పరిశోధనలు ప్రారంభించి, ఇంద్రధనస్సులోని వర్ణములు,

ద్వినక్షత్రభ్రాంతి (double suns), సూర్యాభాస (Parhelion) అను ఐహాలౌకిక (Sublunar) సంఘటనలను వివరించు పుస్తకమును వ్రాయ మొదలిడెను. దానినే "ఉల్కలు" (Meteors) అను పేరుతో, 1635 లో సవరించి వ్రాసి, కొన్ని నూతనవిషయములనుకూడ అందు చేర్చెను. 1630 లో ఆయన వర్ణమునుగూర్చియు, ప్రకాశమునుగూర్చియు ఒక పుస్తకమును ప్రారంభించి, 1635 లో దానిని సవరించి, అందు కాంతికటకములను నిర్మించుటలో తాను కనుగొనిన విషయములనుకూడ చేర్చెను. దీనికాయన "ప్రకాశశాస్త్రము" (Dioptric) అను పేరుంచెను. 1635 లో 'విశ్వ' మను పుస్తక ప్రకటనము ఆపినంతనే, ఈ రెండు గ్రంథములను ఒక ఉపోద్ఘాతముతోకూడ ప్రకటింపవలెననియు, ఉపోద్ఘాతమందు శాస్త్రీయ పరిశోధనలలో తాను ఉపయోగించిన ప్రమాణ పద్ధతిని వివరింపవలెననియు నిశ్చయించెను.

ఉపోద్ఘాత సహితముగా వానిని ప్రకటించుట:

దీని ఫలితముగా 1636 లో "ఉల్కలు" అను పుస్తకము ముద్రణలో నుండగా, రేఖాగణితముపై డెకార్ట్ ఒక గ్రంథమును వ్రాసెను. అందు కొన్ని గణితశాస్త్రీయ విషయములపై తాను 20 ఏండ్లుగ చేసిన కృషి ఫలితమును వ్యక్తముచేసెను. తన ప్రమాణ పద్ధతి నిజస్వరూపము ఇంకను బాగుగ తెలియుటకు, దీనినికూడ పై రెండు పుస్తకములతో

గలిపి ప్రకటింపవలెనని అప్పటికప్పుడు నిశ్చయించి, అటుల చేసెను. ఆమూడు పుస్తకములను, వీటి కుపోద్ఘాతరూపముగా తాను 1636 – 37 లో వ్రాసిన "ప్రమాణపద్ధతిపై ప్రసంగము" తో గలిపి ఆయన 1637 లో లౌడెన్‌లో ప్రకటించెను. ఇది ఆయన ఫ్రెంచి భాషలో వ్రాసెను. దీని లాటిన్ అనువాదము 1644 లో ఎటియన్ డికోర్సెల్ అను ప్రొటెస్టాంటు క్రైస్తవమతస్థుడు చేసి ప్రకటించెను. ప్రస్తుతము మేము అనువదించిన దీ ఉపోద్ఘాతము మాత్రమే.

### "రేఖాగణిత" మను గ్రంథము : గణిత శాస్త్రమందు దానికి గల స్థానము :

ఇందు డెకార్ట్ వ్రాసిన "ప్రకాశశాస్త్రము" నందలి సిద్ధాంతములను న్యూటన్ కృషియు' డెకార్ట్ "ఉల్కలు" లో చేసిన సిద్ధాంతములను, తర్వాత శాస్త్రీయప్రయోగపద్ధతుల ద్వారా కనుగొనబడిన ఫలితములును మూలకు త్రోసినవి. కాని రేఖాగణితముపై వ్రాసిన గ్రంథము మాత్రము గణిత శాస్త్రమందు చిరస్థాయియగు అభివృద్ధిని విప్లవమును తెచ్చుట వలన, శాశ్వతోపాదేయ గ్రంథముగ నున్నది. గణిత శాస్త్రము కేవలము విషయాకృతులను మాత్రమే అధ్యయనము చేయు శాస్త్రము (formal science). అందు అధ్యయనము చేయబడునది "సమానత" (equal), "అనుపాతికము" (Proportional to) మొదలగు సంబంధములకున్న గుణముల

పర్యవసానమేగాని, ఆసంబంధములచే వ్యాప్తములగు రాసుల యొక్క విశేషముల పర్యవసానముకాదు. కాబట్టి, గణిత శాస్త్రమునకు సంబంధితములగు రాసులు (terms) రేఖలైనను, రూపములైనను (figures) సంఖ్యలైనను, పరిమాణములైనను ఒకటియే. అందలిసామాన్యసిద్ధాంతములు(theorems) వీని అన్నిటికి సమానముగ వర్తింపచేయవచ్చును. సంబంధిత పదార్థముల ప్రత్యేక విభిన్న విశేషములపై ఉపపత్తి (Proof) ఆధారపడదనియు, ఒక రకపు సంబంధిత పదార్థముల గూర్చి నిర్ధారితమైన ఫలితములను, మరొక రకపు సంబంధిత పదార్థముల సంబంధమును గూర్చిన ప్రతిపాదనలుగా పరివర్తనము చేయవచ్చుననియు దీనినిబట్టి తేలుచున్నది. ఉదాహరణకు బీజగణితమందలి, సంఖ్యాగణితమందలి సంబంధములను రేఖాగణితములో వ్యక్తీకరింపవచ్చును. ఇది డెకార్ట్ తన రేఖాగణితముపై వ్రాసిన గ్రంథములో చేసిన సిద్ధాంతముల ఫలితము.

జనభాషలో దార్శనిక శాస్త్రీయ ప్రశ్నలు చేయుట: వ్రాసి ఫలితము:

ఈమూడు గ్రంథములకు ఉపోద్ఘాతములుగా డెకార్ట్ వ్రాసిన "ప్రమాణపద్ధతిపై ప్రసంగము" నేటికిని దార్శనిక సాహిత్యమందు అమూల్యమగు సంప్రదాయ గ్రంథము (Classic) గా నున్నది. అదివరకు తత్త్వశాస్త్రగ్రంథము

లన్నియు లాటిన్‌లోనే వ్రాయబడుచుండెడివి. బరిస్మే, రౌముస్ ఇరువురుదప్ప డెకార్ట్ ముందువారెవరు ఫ్రెంచిలో తాత్త్విక, శాస్త్రీయ వివేచనలు చేయలేదు. పూర్వసంప్రదాయమును, ప్రాచీన మధ్య కాలీన దర్శన శాస్త్రములను తెలిసినవారే దార్శనిక సమాలోచనలు చేయనక్కరలేదు. బుద్ధిమంతు డెవడైనను తనకుతానై ఏది సత్యము? దాని నెట్లు పొందనగును? అదిఏది? అను సమస్యలను గురించి చింతించవచ్చును. అట్టి చింతనలను వ్యక్తముచేయు గ్రంథములను చదివి అర్థము చేసికొనవచ్చును, అని నమ్మియే డెకార్ట్ తాత్త్విక సమాలోచనలను ప్రజలభాషలో చేసెను. ఫ్రెంచిభాష సూక్ష్మవిషయములను గూర్చి, శాస్త్రీయ విషయములను గురించి చర్చించుటకు మంచి సాధనమగుటకు, ఫ్రాన్సు దేశమందు నేటికిని గల దర్శన శాస్త్రమన్న గల ప్రేమకును, తత్త్వశాస్త్ర ప్రచారమునకును, డెకార్ట్ వేసిన ఈ బీజమే కారణము.

"ప్రమాణ పద్ధతి పై ప్రసంగము" లోని విషయములు:

"ప్రమాణపద్ధతిపై ప్రసంగము" ఆరు భాగములుగా విభక్తము. మొదటిదానిలో డెకార్ట్ తన విద్యాభ్యాసమును, తాను ఆర్జించిన పాండిత్యమును, యౌవనకాలమందలి తన భావములను సమీక్షించినాడు. రెండు, మూడు భాగములలో తర్క, నీతిశాస్త్రములతో సంబంధించిన విషయములును, ఆతను 23 వ ఏట, 1619 లో Poele లో ఉన్ననాడు కలి

గిన ఆలోచనలును ఇముడ్చబడినవి. 1628 - 29 లో హాలెండుకు తానువచ్చిన క్రొత్తలో, తన ప్రమాణ పద్ధతి కాధారయోగ్యమగు తత్త్వశాస్త్రముకొరకు తాను చేసిన మనన ఫలితము నాల్గవభాగమందు కలదు. శారీరిక ప్రక్రియలను, రక్తప్రసరణను, యంత్రశాస్త్రసూత్రానుసారముగా ఐదవ భాగమందు వివరించినాడు. 'విశ్వ' మను గ్రంథములో విపులీకరించిన ప్రకృతిని గూర్చిన భౌతికశాస్త్రవాదము కొంతవరకీభాగమున సంగ్రహింపబడినది. ఆరవభాగము పై విషయాలను సమీక్షించి ఈ పుస్తకమును ప్రకటించుటలోని తన ఉద్దేశ్యమును, తన భవిష్యత్కార్యక్రమమును, మానవ శ్రేయస్సునకును శాస్త్రముల అభివృద్ధికిని చేయవలసిన ప్రణాళికను చెప్పుచున్నది.

క్రీస్తుసభతో వివాదము :

1640 లో ఏసుక్రీస్తు సంఘ సభ్యుడగు బోర్డిన్ క్లేర్ మోంట్ కళాశాలలో తానిచ్చు ఉపన్యాసములో డెకార్ట్ భౌతికశాస్త్రవాదమును ఖండింప ప్రయత్నించెను. దీనివలన డెకార్ట్‌కు కోపోద్రేకము కలిగెను. ఏసుక్రీస్తు సంఘమునంతను రంగమున కీడ్చి ఆతడు తీవ్రవాదోపవాదములలోనికి దిగెను. అరిస్టాటిల్ దర్శనానుయాయులు, డెకార్ట్ అనుచరులు — ఇట్లు రెండుపక్షములేర్పడి ఖండనమండనములు బయలుదేరెను.

స్వపక్షబలముకై ప్రయత్నము :

అరిష్టోటిల్ ప్రమాణమును గ్రహించువారితో తనకు సిద్ధాంతవైరుధ్యము వచ్చుటచే, ప్లేటోనుఅగష్టీనును అనుసరించువారితో తాను సన్నిహితుడైనచో, తనపక్షమునకు బలము చేకూరుననని, డెకార్టు వారిసిద్ధాంతములవైపు మ్రొగ్గుటయు, వానిలో కొన్నిటిని స్వీకరించుటయు ప్రారంభించెను. దీనికి ఆయనకు చిరకాలమునుండి స్నేహితులైన బెరుల్, జిబియుఫ్ లుకూడా చాలవరకుకారణము. వారిది ప్లేటోఅగష్టీనుల సంప్రదాయమే కదా !

"మననముల" గ్రంథావిర్భావము :

1628 - 9 లోనే, తనప్రమాణపద్ధతికి ఒక సుదృఢమైన ఆధారముండవలెననియు, అది తత్త్వశాస్త్రమువలననే దొరకుననియు, తెలిసికొని స్పష్టము నిశ్చితము అయినదే ఏలసత్యము ? అను సమస్యపై నాలోచించుచు డెకార్ట్ ఒక దార్శనికవాదమును రూపొందించుకొనెను. దానిని కొంతవరకు గ్రంథస్థము చేసెను కాని, 'విశ్వ' మను గ్రంథరచనాకార్యమున మగ్నుడై దానినాపెనని చెప్పినాము. దాని నిప్పుడు బయటికితీసి, అందలి దార్శనిక వాదమును వివరించి వ్రాసి ప్రకటించినచో, బోర్డిన్ మొదలగువారి సంశయములకు, విమర్శలకు తావుండదనియు, తన దర్శనము ఈశ్వర, ఆత్మల అస్తిత్వస్థాపకమగుటచే దాని

నెవ్వరును ఆక్షేపింపజాలరని తలచి, డెకార్ట్ తన తత్త్వశాస్త్రమును "మననములు" (Meditations) అనుపేరుతో వ్రాసి, దాని తొలిప్రతులను పలువురుతత్త్వశాస్త్రవేత్తలకుచూపి వారి విమర్శలను గ్రహించి, వానిని తన సమాధానములతోకూడా ప్రకటింప నిశ్చయించెను. ఈగ్రంథము సోర్‌బోన్ విశ్వవిద్యాలయమందలి ఈశ్వరమీమాంసా శాస్త్రజ్ఞులకుచూపి వారి అనుమతితో వారికి కృతి నిచ్చిన, వారు అందలి సిద్ధాంతములను బలపరుచుటకు ప్రచారముచేయుటకు ఉత్సాహపడెదరనియు, పసు సంఘసభ్యుల వైముఖ్యమున కిది విరుగుడుమందుగ నుండునని యు ఎంచి అటులచేసెను. విద్వాంసులకొరకును, విశ్వవిద్యాలయములలో పఠన పాఠనార్థమును వ్రాయ సంకల్పించి ఈగ్రంథము లాటిన్‌లోవ్రాసి 1641లోను, దానిపై విమర్శలను సేకరించి వానికి సమాధానములు వ్రాసి, ఈ విమర్శలతోడను సమాధానములతోడనుగలిపి దానిని 1642లోను ప్రకటించెను. మొదటిముద్రణ ప్యారీయందును,పరిష్కృతగ్రంథము ఆమ్‌స్టర్డంలోను ప్రచురింపబడెను. 1642 లో లుయెన్స్ ప్రభువు దీనిని ఫ్రెంచిభాషలోనికి మార్చగా, డెకార్ట్ అది చాలబాగున్నదని ఎంచి తరువాత కొన్నిపండ్లకు ప్రకటించెను; తరువాత విమర్శలు సమాధానములు కూడా ఫ్రెంచిలోనికి పరివర్తన చేయబడి డెకార్ట్‌చే సంస్కరింపబడి ప్రకటింపబడెను.

"మనసములు" లోని దార్శనిక సిద్ధాంతములు :

ఏది శంకించుటకు వీలున్నను స్వాత్మాస్తిత్వమును శంకించుట అసంభవము, అసంగతము కాన, అదియే సమస్త జ్ఞానమునకు ప్రథమసోపానము కావలయును. ఆత్మవేదనము అసంశయము, సంశయప్రక్రియయందే ఆత్మాస్తిత్వము ద్యోతిత మగుచున్నది. ఈ ఆత్మ — నేను — ఎవరు? అసంపూర్ణము, పరిసీమితశక్తి జ్ఞానవంతము, నిరతానంద రహితము. కాని ఆత్మకు సంపూర్ణసత్త్వమును(Perfect being) గూర్చిన భావము (Idea) నైసర్గికము. తుచ్ఛుడు, అల్పజ్ఞుడు, అసంపూర్ణుడు, పాపి అయిన ఆత్మవిశుద్ధసంపూర్ణసత్త్వమును గూర్చి చింతింపగల్గినాడన్నచో ఎక్కడినుండి ఈ భావోదయ మైనది? అట్టి పదార్థము నూహింప అట్టి ఆత్మకు అవకాశ మెక్కడిది, శక్తి ఎక్కడిది? అట్టిభావము ఆత్మాంతస్థమైన, అది నిజముగానే విశుద్ధసంపూర్ణసత్త్వముచే ప్రసాదితము కావలసి నదే. అసంపూర్ణుడు, పశుసమానుడు నగు ఆత్మ ఇట్టి సుమహత్ సంపూర్ణసత్త్వమునుగూర్చి ఆలోచింపగలునట్లు మార్చగలిగిన కారణమే ఈశ్వరుడు. ఆత్మ అపరిపూర్ణుడు, మందశక్తి, అల్పజ్ఞుడు, ఈశ్వరుడో సంపూర్ణుడు, సర్వశక్తి, సర్వజ్ఞుడు, అచింత్యైశ్వర్యవంతుడు, సర్వకల్యాణగుణాస్పదుడు. అట్టి భగవంతుని, తమ్ముతాము తెలిసుకొనుటే ఈశ్వరప్రసాదిత మగు బుద్ధికి పరమావధియనియు, తన పరిశోధనలన్నిటిని అట్లే ప్రారంభించితిననియు, ఈవిధముగ చేయనిచో తన భౌతిక

శాస్త్రమున కాధారము దొఱకెడిది కాదనియు డెకార్ట్ మెర్సీన్‌కు ఒకలేఖలో వ్రాసినాడు. తాదృశుడగు ఈశ్వరుడు మనలను సృజించియుండ, తన్నిర్మితమగు మన ఇంద్రియాదులు సక్రమముగా నడువవలసినదే యనియు, ప్రత్యక్షానుభవము అందుచేత గ్రాహ్యమగు ప్రమాణమే అనియు, అట్లే తదను గ్రహీతమగు మనస్సు చేయు సుసంగతమగు చింతలన్నియు సత్యములు కావలసినదే అనియు డెకార్ట్ సిద్ధాంతీకరించెను. సాధారణులగు శిల్పులు చేసిన యంత్రాదులే మరల ఎప్పుడు వారిసహాయ్య మపేక్షింపక నిర్ణీతక్రమమార్గమున నడచుచుండ, సంపూర్ణుడు, సర్వశక్తిసర్వజ్ఞుడు అగు ఈశ్వరునిచే నిర్మితమగు ఈవిశ్వము ఒకపరి సృజింపబడినతరువాత స్వతంత్రముగా నిర్ణీత విధానమున ఒకమహాయంత్రమువలె తనవ్యాపారము నెందుకు చేసికొనిపోజాలదు? దానిప్రక్రియాప్రభావముల తెలిసి కొనుటకు, అర్థముచేసికొనుటకు ప్రతివిషయములోను ఈశ్వర శక్తినిగాని ఈశ్వరేచ్ఛనుగాని వెదుకనక్కరలేదు. గడియా రపు ప్రక్రియను నిర్మాణవిధానమును అధ్యయనము చేసి కొనుటకు, దాని నిర్మాతనుగూర్చిన వివరములుగాని, ఉద్దేశ్య ములుగాని అనవసరము. భౌతికశాస్త్రవాదముల ప్రామా ణ్యము సర్వశాస్త్రములలోను ఉపయోగింపవలసిన ప్రమాణ పద్ధతియొక్క ప్రామాణ్యము ఈశ్వరాస్తిత్వముపై ఆధారపడి యున్నది; అయితే ప్రమాణ మీమాంసతత్త్వశాస్త్ర విచికిత్స జరుగునప్పుడు తప్ప, అతీంద్రియ అబుద్ధిగోచర పదార్థములను

ప్రతిపాదించుట గాని, వానిద్వారా భౌతికప్రక్రియలను అర్థము చేసికోబూనుటగాని అసమంజసము. అట్టితత్త్వశాస్త్రచింతనలలోగూడ సందేహించుటకు అసాధ్యమైన ఈశ్వరాత్మల అస్తిత్త్వముగాక వేరేదియు ఉన్నట్లు భావించుట అసంగతమే. ఆత్మసంవేదనమే సంవిత్ — (self-consciousness) సర్వజ్ఞానమునకు మూలకందము. మరి ఆత్మాంతర్వీక్షణము అందు అంతర్నిహితమగు ఈశ్వర జ్ఞానమును ప్రదర్శించుచున్నది. ఈశ్వరుడు-సంపూర్ణసత్త్వము-లేకుండుట అసంగతము కాన, అట్టి సత్త్వము లేనిదే తాదృశభావోదయ మసంభవము గాన ఈశ్వరాస్తిత్వ మశంకనీయమే. ఈశ్వరాస్తిత్వము ప్రత్యక్షానుమాన జ్ఞానములకు ప్రామాణ్యము నిచ్చుచున్నది. ఒకపరి ఈనిర్ణయము చేసినపిమ్మట, ప్రత్యక్షానుమానములద్వారా జ్ఞానాభివృద్ధి చేసికొని, ప్రకృతికి యజమానులమై వ్యాధిజరామృత్యువులనుగూడ జయించుటకు శ్రమరహితమగు సుఖమయ జీవితము గడుపుటకు మనము యత్నింపవలెను.

క్రీస్తుసభతోను, ఆరెటోరియన్లతోను భిన్నాభిప్రాయములు:

"మననములు" ప్రకటింపబడిన సంవత్సరములోపలనే దానిని సోర్బోన్ విశ్వవిద్యాలయము పరిగ్రహింపదనియు, విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథముగా అది ఉండగల్గునని డెకార్ట్ కనినకల వ్యర్థమనియు తేలెను. అందుతో క్రైస్తవ సంఘమువా

రిచే పరిగృహీతములగు ఒకటి రెండు సిద్ధాంతముల తీవ్రఖండన ఉండుటచే ఆసభవారు డెకార్ట్‌పట్ల ఎప్పటివలెనే ఉండిరి. పైగా మెర్సీన్‌కు వ్రాసిన ఒకఉత్తరములో బోర్డన్ డెకార్ట్ పని పట్టెదమని భయపెట్టెను. మెర్సీన్ క్రీస్తుసంఘముతో వైరమునూని సంధి చేసికొనుమని డెకార్ట్‌ను బ్రతిమాలనాగెను. ఇంతలో జిబియుఫ్ వ్రాసిన గ్రంథమొకటి ప్రకటింపబడుటయు, డెకార్ట్ అది చదివి తనకును వారికిని ఎన్నో ప్రధాన సిద్ధాంత బేధములున్నవని గ్రహించెను. కాగా, క్రీస్తుసంఘ సిద్ధాంతముల నింకనుబాగుగ అధ్యయనము చేయగా అవి యన్నియు తనకనిష్టములు కావనియు, అందుకొన్ని తనకంగీ కార్యములనియు గ్రహించెను. పైగా, ఆరెటోరియన్లకు క్రీస్తు సంఘమునకుగల సిద్ధాంత వైరుధ్యమునకు తనదార్శనిక సిద్ధాంతమునకు ఎట్టిఅవసర సంబంధము లేదనియు అందొక పక్షమును సమర్థించుటవలన తనకువచ్చులాభము లేదనియు నిర్ణయించుకొనెను.

క్రీస్తుసభ ప్రాపకమునకై ప్రయత్నము:

నూతనదర్శన నిర్మాణముచేసి దానిని ప్రచారము చేయుటే తనలక్ష్యముగాను, భగవంతుడు తనకిచ్చిన ఆశా సనముగాను భావించిన డెకార్ట్, యూరపు నందాకాలమున విద్యాబోధనా కార్యమంతయు ఏసుక్రీస్తుసభ హస్తగతమై యుండుటయు, మంచికళాశాలలు, విశ్వవిద్యాలయము

లన్నియు, వారి యాజమాన్యమున ఉండుటయు, వారికి ప్రతి పక్షులెవరు కార్యరంగమున లేకుండుటయు చూచి, డెకార్ట్ ఆరిస్టాటిల్ దర్శనముకు బదులు తన దర్శనము కళాశాలలోను, విశ్వవిద్యాలయములలోను బోధింపబడవలెనన్న, తనదర్శ నము క్రీస్తుసభా సిద్ధాంతములకు విరుద్ధముగా నుండరాదనియు, అది తత్కాలమందు ప్రచలిత బోధనాపద్ధతి ననురూపముగ అరిస్టాటిల్ కనిపెట్టిన న్యాయరూపముగా (Syllogistically) ప్రతిపాదింప బడవలెననియు నిర్ణయించుకొనెను. 1640 నుండి 1644 వరకు 'విశ్వ' మను పుస్తకములో తాను ప్రవచించిన భౌతికశాస్త్రవాదమును లాటిన్‌లో న్యాయరూపముగ వ్రాసి, తత్త్వశాస్త్రవిచారణను కొంచెముగా దాని ప్రారంభమందు మాత్రమే చేసి, 'మననము' లో క్రీస్తుసభ సిద్ధాంతములకు వ్యతిరిక్తముగ చెప్పిన విషయములను వదిలి, ఆసభకు చెందిన కొందరు శాస్త్రజ్ఞులను పొగిడి "తత్త్వశాస్త్ర సూత్రములు" (Principles of Philosophy) అను పేరుతో 1644 లో ఒక గ్రంథమును హాలండ్‌లో ప్రకటించెను. ఇందు క్రీస్తుసభకు మాన్యులగు మధ్యయుగపు దార్శనికుల గ్రంథములనుచదివి, వారి భావములను, పరిభాషను కొంతవరకు స్వీకరించి, వారి శైలిలోనే పూర్వపక్ష సిద్ధాంతరూపముగను, అరిస్టాటిల్ న్యాయముల పద్ధతిలోను దీనిని వ్రాసెను. క్రీస్తు సభవారి ఆమోదము లేకున్న తన దర్శనమునకు తన జీవితకాలములో విజయముండదనియు, విశ్వవిద్యాలయములలో దాని ప్రచా

రము వారి ద్వారానే జరుగగలదనియు డెకార్ట్ తలచుటచే ఇట్లు చేసెను. ఫ్రాన్సులోని ఆ సంఘనాయకునికి సహకారియు తనకుబంధువునగు ఛార్లెట్ ద్వారా ఆసంఘముతో కొంతరాయ బారముజరిపి, వారు తనకు సుముఖులగునట్లుచేయ ప్రయత్నించెను. కాని 1645 సంవత్సరాంతమునకు ఈ యుద్దేశ్యము నెరవేరదని ధృవపడెను. క్లాడ్ పికోట్ "సూత్రముల" ను ఫ్రెంచిలోకి అనువదించగా డెకార్ట్ దానిని చదివి ఆమోదించి 1647 లో ప్రకటింపచేసెను. ఈఫ్రెంచి అనువాదమునకు తొలి పలుకులుగా డెకార్ట్ పికోట్ కు వ్రాసిన ఒకదీర్ఘలేఖ ప్రకటింపబడెను. ఇందులో "ప్రమాణపద్ధతిపై ప్రసంగము" లో వలెనే తన లక్ష్యమేమిటో, తాను చేసిన కృషి ఏమిటో, తానిక ముందేమి చేయనున్నది, మున్నగు విషయముల చర్చించెను. ఇందులో తిరిగి దర్శన సంప్రదాయములపట్ల తదనుయాయుల పట్ల అసంతృప్తి వెల్లడించెను. క్రీస్తుసంఘమునుండిగాని ఆరెటోరి సభ్యులనుండిగాని తానపేక్షింపవలసినది లేదని ఈపాటికి తెలియవచ్చెను. దాదాపీకాలమందే వ్రాయబడి ఆయన జీవితకాలమందముద్రితముగా నుండిన "సత్యాన్వేషణము" (Research) లో కూడ ఈ దృష్టికోణమే కానవగును.

## ఎలిజబెత్ తో మైత్రి: "మానసిక వికారములు" (Passions) అను గ్రంథరచన:

పెలాటిన్ ప్రభువగు ఐదవ ఫ్రెడరిక్ కూతురగు ఎలిజబెత్ రాకుమారి 1640 లో తనతల్లితో కూడి హేగ్ లో

నివసించుచుండెను. సౌందర్యము, మేధాశక్తి, స్వతంత్రాలో చనాశక్తి ఈమెలోని సుగుణములు. 1637 లో గ్రంథప్రచుర ణానంతరము యూరప్ అంతటా విఖ్యాతినొందిన డెకార్ట్సను చూడవలెనని ఆమె చాల ఉత్సాహపడెను. డెకార్ట్సకు హాలెండులో నివాసస్థానమగు లేడెన్ నగరప్రాంతమందు ఎండెజీస్ట్ అను చిన్నకోట హేగ్ నగరానికి కూడ దగ్గరే కావున, డెకార్ట్స్ వెళ్ళి ఆమెను, ఆమెతల్లిని కలసికొనెను. డెకార్ట్సను గురువుగను, స్నేహితునిగను ఎలిజబెత్ సమాదరించి, నాటి నుండి ఆయనపద్ధతి నవలంబించియే సత్యాన్వేషణము చేయ సాగెను. ఆమె తల్లిదండ్రులయు, బంధువులయు కష్టములు, దేశాంతరవాసము చేయవలసిన గతి ఆమె ఆరోగ్యమునకు భంగకరములుగను, మనస్సునకు అశాంతికరములుగను ఉండెను. దర్శనశాస్త్రము మనుష్యుల కష్టముల కేమియు పరిష్కారము చూపలేదా? అని ఆమె డెకార్ట్సను అడిగెను. డెకార్ట్స్ మాన సికోద్రేకములను, ఇచ్ఛాశక్తిని, దేహేంద్రియ ప్రక్రియలను గూర్చి విచారణలు జరిపి నీతిశాస్త్ర సమాలోచనలుచేసి ఏది కర్తవ్యము ఏది అకర్తవ్యము, మానవుడు సంతోషముతోడ నెట్లు జీవింపనగును, అను సమస్యలను 1645-6 శీతకాలమందు వ్రాసి "మానసిక వికారములు" (Passions) అని ఆగ్రంథ మునకు నామకరణముచేసి ఏప్రిల్ 1646 లో రాకుమారికి పంపెను. ఆమె దానిని చదివి కొన్ని మార్పులను సూచించెను. 1649 లో అది అమ్స్టర్డంలో ప్రకటింపబడెను. 1667 నుండి

ఎలిజబెత్ వెస్ట్‌ఫేలియాలోని హెర్ఫోర్డ్‌లో ఒక లూథరన్ మఠమున కధికారిణిగా నుండి, దానిని జాతిమతభేదములను పాటింపకుండ దర్శనశాస్త్ర పరిశోధకులందరికి స్థావరమగు స్వతంత్ర పరిషత్తుగా మార్చెను.

"మానసికవికారముల" లోని నీతివాదము:

మనుష్యుడు దేవతకాడు; అతడు శరీరాత్మల సమష్టి రూపము; కాన శరీరముతోకూడ అవినాభావముగ తాదాత్మ్యము చెందియున్నాడు. కాబట్టి నైతికజీవితపు మహాకార్యముల సాధించుటకు, ఆతడు వికారోద్రేకములను బుద్ధితో అనుశాసించుకొని సక్రమముగా వానిని వ్యక్తీకరించుకొనవలెను. కాని, వానిని సంపూర్ణముగా త్రొక్కిపట్టుటగాని, తొలగింప ప్రయత్నించుటకాని వ్యర్థము; అనవసరము; వికారోద్రేకములన్నియు వస్తుతః మంచివే; అన్నియు మనకుశక్తి నిచ్చునవియే. అయితే బుద్ధిని వానికి సూత్రధారిగా చేయవలెను. — ఇదిడెకార్ట్ ఆగ్రంథములో సూచించిన నీతివాదము.

ప్రొటెస్టెంటులతో వైరుధ్యము:

హాలెండులోని ఉట్రెక్ట్ విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగానుండిన రీజియస్ అనునాతడు డెకార్ట్‌కు శిష్యుడై, ఆయన దర్శన సిద్ధాంతానుసారముగా వైద్యశాస్త్రమును, తత్త్వశాస్త్రమును వ్యాఖ్యానించి బోధింపసాగెను. 1641 లో రీజియస్ తన విద్యార్థిచే వ్రాయబడిన ఒకగ్రంథములో అరిష్టో

టిల్ తత్త్వశాస్త్రమును, భౌతిక శాస్త్రమును పరిహసింప చేసెను. దీనితో అరిస్టోటిల్ దర్శనానుయాయులు కొందరికి విశేష సంక్షోభముకల్గెను. విశ్వవిద్యాలయ అధ్యక్షుడుగా నుండిన వొయెట్ అను కాల్విన్ శాఖకుచెందిన ప్రొటెస్టెంటు మతస్థుడు డెకార్ట్‌కు విరుద్ధముగా కక్షకట్టి, ఒకవైపున ఆయన నిరీశ్వరవాది యనియు, మరొకవైపున ఆయన క్రీస్తుసంఘ శిష్యుడు, వారిగూఢచారి యనియు ప్రచారము చేయసాగెను. 1642 లో ఉట్రెక్ట్ విశ్వవిద్యాలయ సెనేట్ డెకార్ట్‌దర్శనము సత్యవిరుద్ధము అనుపాదేయము అని ఘోషించి, దాని పఠన పాఠములు ఆపవలెనని శాసించెను. దానికి మూడుకారణములు చెప్పబడెను :—(1) డెకార్ట్ దర్శనము ప్రాచీనదర్శన శాస్త్రమునకు విరుద్ధము. (2) అది విద్యార్థులకు ప్రాచీనదర్శనముపై అభిరుచి తగ్గించి, దానిని చదువనీయకుండచేసి వారిఅభివృద్ధికి అడ్డుగా నుండును. (3) డెకార్ట్ దర్శనమునుండి అసత్యములు అనుపన్నములునగు నిర్ణయములు బయల్వెడలును.

ఇంతేకాక, డెకార్ట్ పుస్తకములను గెలీలియో పుస్తకములనువలె బహిరంగముగా కాల్పింపవలెనని కూడ వొయెట్ ప్రయత్నించెను, గాని డెకార్ట్ హాలెండులోని ఫ్రెంచి రాజదూత సహాయముతోడను, ఆరంజి రాజకుమారుని (Prince of Orange) ఆజ్ఞతోడను ఆ ప్రయత్నములు మాన్పించెను.

డెకార్ట్ దర్శన వ్యాప్తి :

గ్రోనింజెన్, బ్రెడా విశ్వవిద్యాలయములలో డెకార్ట్ సిద్ధాంతములు ఆస్వాదింపబడి బోధింపబడసాగెను. లేడెన్, లావేన్ విశ్వవిద్యాలయములలో ఉట్రెక్ట్‌లో వలెనే డెకార్ట్ పక్షీయులు, అరిస్టాటిల్ పక్షీయులు ఇట్లు ఇరుతెగ లేర్పడెను. జర్మనీలోని హెర్‌బోరన్, డూయిస్‌బర్గ్, ఫ్రాంక్‌ఫోర్ట్, హాల్, లైప్‌జిగ్, మొదలగు విశ్వవిద్యాలయములలో డెకార్ట్ అనుయాయులు ఆచార్యులై ఆయన దర్శన ప్రచారము చేయ సాగిరి. నేపుల్సులో, ఫ్రాన్సులోని ఆరేటరీ సంఘీయులలో, పోర్ట్‌రాయల్ సంఘములో ఆయన సిద్ధాంతములు మాన్యము లాయెను. డెకార్ట్ సమకాలికుడగు పియర్‌బోరెల్, ఆయన మరణించునప్పటికి సముద్రతీరమందలి ఇసుకరేణువులకు, ఆకాశమందలి నక్షత్రములకు డెకార్ట్ శిష్యులు సంఖ్యలో తీసిపోరని చెప్పెను.

హాలెండ్ వాసముపై విసుగు :

యూరప్‌లోని అన్ని దేశములలోనున్న ఏసుక్రీస్తు సంఘసభ్యులు డెకార్ట్ దర్శనముపట్ల చూపుచున్న వైముఖ్యము, ప్రాచీన సంప్రదాయమే సర్వస్వమని నమ్ము వొయిట్ మొదలగు ప్రొటెస్టెంటు మతస్థులు చేసెడి ఆరోపణలు, తన్ను గురువుగా ఎంచి తన దర్శనములే ప్రచారము చేయుచున్నామని చెప్పియు తనను అపార్థముచేసికొనిన రీజియస్

మున్నగువారి వ్యాఖ్యానములు డెకార్ట్సును సంక్షోభపెట్టెను. వ్రాయుట మాని, స్వీయాభివృద్ధికొరకు మాత్రమే సత్యాన్వేషణ చేసికొనుట ఉత్తమమేమో అని ఆయనకు అనిపించసాగెను. హాలెండులో మతసహన ముండునని ఆ దేశములో తావర మేర్పరచుకొనినను, అక్కడ ప్రొటెస్టెంటుల నిందారోపణలు తప్పలేదాయెను. దేశమును వదలి ఫ్రాన్సుకు వెళ్ళిన బాగుండునని ఆయనకు తోచసాగెను.

సహకార పరిశోధన (Co-operative research) ను గూర్చిన ఆలోచనలు:

ఒక శాస్త్రీయ పరిశోధనా పరిషత్తు నెలకొల్పబడి దానికి తానధ్యక్షుడుగానుండి, వివిధశాస్త్రములలో కృషి చేయు అనేక సహాయకులును, ఈ పరిశోధనల కవసరములగు పరికరములను నిర్మించు శిల్పులును, వీరికి క్రొత్తపరికరములను చేయు పద్ధతులను గూర్చి ఆలోచనలు జరిపి సూచనలు చేయువారును, సమకూడిన శాస్త్రీయ ప్రగతి ఎంతో జరిపింపగల్గెదనని ఆయన నమ్మకము. "వికారము" ల, "సూత్రము" ల ఫ్రెంచి అనువాదమునకు వ్రాసిన తొలి పలుకులలోను, స్నేహితులకు వ్రాసిన ఉత్తరములలోను ఈ ఆశయమును వ్యక్తీకరించెను. ఈ విషయమున ఏమైన జరుగునేమో చూచుటకు ఆయన 1648 లో ఫ్రాన్సుకు వెళ్ళెను. అక్కడ ఆయనకు ప్రభుత్వము సహాయము చేయునట్లు కన్పడలేదు.

ఒక ఉపకారవేతనము మాత్రము ఆయన కిచ్చిరి. ఒక స్నేహితుడు తన ధనముతో అట్టి సంస్థను నెలకొల్పెదనని చెప్పెను గాని, ఫ్రాన్సులోని అస్వస్థమగు రాజకీయ పరిస్థితిచే అది సాధ్యపడలేదు. కాన ఆయన రిక్తహస్తములతో హాలెండుకు తిరిగి వచ్చెను.

స్వీడన్ రాణితో పరిచయము: స్వీడన్‌కు ఆహ్వానము:

ఆ దినములందు స్వీడన్‌కు క్రిష్టినా రాణిగా నుండెడిది. ఈమెకు విద్యావ్యాసంగము, శాస్త్రీయ దార్శనిక విషయములందు జిజ్ఞాస హెచ్చు. స్వీడన్‌కు ఫ్రెంచిరాజదూతగా నుండిన చానట్ డెకార్ట్‌కు స్నేహితుడు, శిష్యుడు. డెకార్ట్ కీర్తిని వినిన క్రిష్టినారాణి చానట్ ద్వారా డెకార్ట్‌కు "ప్రేమ యన నేమి?" "భౌతిక జగత్తు మనలను ఈశ్వరుని ప్రేమింపమని బోధించుచున్నదా?", "ప్రేమ ద్వేషములలో ఏమానసిక వైకల్యము ఎక్కువ చెడ్డది?" ఇత్యాది ప్రశ్నలు పంపుచుండెడిది. డెకార్ట్ విపులముగా నిర్ణీత తర్కపద్ధతిలో సమాధానములు వ్రాసి పంపుచుండెడివాడు. ఆయన సమాధానములు రాణికెంతో సమ్మోదమును కల్గించి, ఆమెకాయనపై గురుభావము జనించుటయు ఆయన వ్రాసిన "సూత్రములు" అధ్యయనము చేయగోరుటయు సాక్షాత్తుగా ఆయనవద్ద దర్శన శాస్త్రము చదువ నారాటపడుటయు కారణముగ ఆయనను 1648 – 9 ప్రాంతమున చాలాసారులు స్వీడన్‌వచ్చి నివసించుడని ఆమె

ఆహ్వానింపసాగెను. అతి శీతలమగు ఆ నూతన విదేశమునకు పోవుటకెంతగానో వెరచియు, అక్కడ కొంతకాలముండి రాజమన్నన లందిన యూరప్‌లోని తనకీర్తి ఇంకను వృద్ధి యగునని, కనీస మప్పుడైనను ఫ్రెంచిప్రభుత్వము తాను కోరిన శాస్త్రీయ పరిశోధనా సంస్థను నెలకొల్పునని ఎలిజబెత్ రాకుమారి, క్రిష్టినా రాణి రాజదూత యగు చానెట్, లుయెన్స్ ప్రభువు మొదలైనవారి ఇతోధిక ప్రాపకమున్న అచిరకాలముననే తన దర్శనము ఇంకను బాగుగా వ్యాపించు నని డెకార్ట్ స్వీడన్‌రాణి ఆహ్వానమును స్వీకరించి 1649 లో ఆమె పంపిన యుద్ధనౌకలో పయనమై వెళ్ళెను.

స్వీడన్‌లో నివాసము : మరణము :

స్వీడన్‌లో ఆయనకు రాజమర్యాదలు జరిగెను. ఆయనను సామంతునిగా కూడ చేయవలెనని రాణి నిశ్చయించెను. గాని, ఆయన వలదనెను. ఆయనతో సంప్రదించి ఆమె స్వీడన్ రాజ్య విద్వత్పరిషత్తును ఆయన ఏర్పరచిన నియమముల ననుసరించి స్థాపించెను. దాని కాయనను అధ్యక్షునిగా నియమింపదలచెను. గాని ఆయన వలదనెను. ఇన్ని మర్యాదలు జరుగుచున్నను రాజాస్థాన జీవితములోని అస్వాతంత్ర్య మాయనకు పెద్దగా రుచింపలేదని, ఆయన మిత్రులకు వ్రాసిన ఉత్తరములు చెప్పుచున్నవి. పైగా రాణి ఆయనవద్ద దర్శనశాస్త్రమును ప్రాతఃకాలమున 5 గంటల వేళకు చదువుచుండెను. ఆ అత్యంత

శీతల దేశములో ప్రాతఃకాలమున నెప్పుడును లేచుట కలవాటు లేని డెకార్ట్ అంత ప్రొద్దుటివేళ లేవవలసి వచ్చుటచేతను, ఆ అసంకర్భపువేళ రాజమందిరమునకు పోయి సిద్ధము కావలసి యుండుటచేతను ఆయన ఆరోగ్యము శిథిలము కాజొచ్చెను. ఒకసారి అట్లు వెళ్ళి వచ్చునప్పుడు శైత్యముచేసి కోలుకొన లేక, తన 54 వ ఏట, 1650 ఫిబ్రవరి 11 వ తేదీన మరణించెను.

డెకార్ట్ భౌతికశాస్త్ర కృషి:

డెకార్ట్ శాస్త్రీయ కృషిలోనికెల్ల ఆయన గణిత శాస్త్రములో కనుగొనిన విషయములే అతిముఖ్యములు. రేఖాగణిత బీజగణిత సమానత్వమును కొంతవరకు చాలా కాలమునాడే ఒమార్ ఖయ్యామ్ కనుగొనినప్పటికిని, సహ నిర్దేశక రేఖాగణితముయొక్క ప్రారంభదశ కొంతవరకు ఒరెస్మెకు అర్థమైనప్పటికిని దానిని పరిణతమైన శాస్త్రముగా చేసినది డెకార్ట్. ఇదికాక భౌతికశాస్త్రమందుకూడ కొన్ని క్రొత్త విషయములను కనిపెట్టుటయు, భౌతికశాస్త్ర విషయములకు వ్యవస్థీకృతరూపమును ఇచ్చి అరిస్టాటిల్ వ్యవస్థకు బదులుగా యూరప్ ఖండమందు దీనిని ఇంచుమించు అర్థ శతాబ్దమువరకు ప్రచలితముగా చేయుటయు కూడ డెకార్ట్ ప్రతిభకు నిదర్శనములు.

భౌతిక సంఘటనల ఆదిమకారణమును పరిగణించక యాదృచ్ఛికమైన కొన్ని సంఘటనలను మాత్రమే తీసికొని

వాటిని గణిత శాస్త్రీయముగా వర్ణించుటయే గెలీలియో చేసినాడనియు, గెలీలియోయొక్క పృథక్కరణ పద్ధతి (abstraction) సమంజసమైనదికాదనియు, డెకార్ట్ అభిప్రాయము. 1604 లో గెలీలియో కాలము, వేగము, దూరములకు మధ్య గల సంబంధములను గణిత శాస్త్రీయముగా వ్యక్తీకరించిన విధముగానే 1618 లో డెకార్ట్ స్వతంత్రమార్గమున వ్యక్తీకరించగలిగెను. డెకార్ట్ నిర్మించిన భౌతికశాస్త్రమందు కూడ గతిని గురించిన నియమములు జడత్వము గురించిన ధర్మములు ఉన్నప్పటికిని శూన్యముయొక్క ఉనికినిగురించిగాని, దూరము నుంచి తన ప్రభావమును కనపరచగల ఆకర్షణశక్తియొక్క ఉనికిని గురించిగాని డెకార్ట్‌కు విశ్వాసము లేదాయెను. ఈ అంశమందు డెకార్ట్ గెలీలియో మతమును ఎన్నడును అంగీకరించలేదు. స్థూలప్రకృతి లేనిచోటనెల్ల సూక్ష్మప్రకృతి యొకటి గలదని డెకార్ట్ ప్రతిపాదించెను. తరువాత శూన్యము యొక్క అభావమును బోధపరచుటకై అవకాశమంతటను ఈథర్ అను సూక్ష్మద్రవ్యము వ్యాప్తమై యున్నదను న్యూటన్ ప్రతిపాదన డెకార్ట్ ప్రభావమును చూపుచున్నది. 17 వ శతాబ్దములోని ప్రసిద్ధభౌతికశాస్త్రజ్ఞుడగు క్రిస్టియన్ హ్యూజెన్స్ కృషిలో ఎక్కువ భాగము డెకార్ట్ భావముల చేతనే ప్రేరేపింపబడెను.

కెప్లర్ వలెనే డెకార్ట్‌కూడ సూర్యమండలమందు శక్తికొక ఉద్భవస్థాన ముండవలెననియు లేనిచో కక్ష్యలయొక్క

తలములు సూర్యునిగుండా పోజాలవనియు, గ్రహగతులలోని మార్పులు అర్థముకావనియు అభిప్రాయపడెను.

తగువిధమగు దీర్ఘమైన పృథక్కరణముద్వారా సమస్త నైసర్గిక సంఘటనలను ఒకేవిధమైన పరిణామరూపమున, అనగా ప్రకృతిగతిరూపమున, నిరూపించవచ్చునను ప్రతిపాదన డెకార్ట్ భౌతికశాస్త్రమునకు పునాది. 17 వ శతాబ్దపు శాస్త్రజ్ఞులందరు ఈ విశ్వాసమును కలిగియుండిరి. డెకార్ట్ అందుచేతనే చలనశాస్త్రమును ప్రధానశాస్త్రముగా చేసెను. 19 వ శతాబ్దములో బయల్వెడలిన గతివాదము డెకార్ట్ భావములనే దృఢపరచుచున్నది. శుద్ధగతిశాస్త్ర ప్రధాన సూత్రములను, అనగా, మూలభావముల నిర్మాణము, దాని కనువైన గణితశాస్త్రీయ పద్ధతులను ప్రసాదించినది గెలీలియో. ఇవియే డెకార్ట్ యొక్క సహనిర్దేశక రేఖాగణిత మందు విస్తరింపబడి గతియందున్న ప్రకృతి గుణములను నిర్వచించుటకు ఉపయోగపడెను. గెలీలియో చేసిన గతియొక్క వర్ణనాత్మక విశ్లేషణ నుపయోగించి భౌతికవిశ్వమును డెకార్ట్ యంత్రశాస్త్రీయభావములద్వారా అర్థము చేసికొనుట ఎట్లను నదే ప్రధానసమస్యగా ఏర్పడెను.

గురుత్వాకర్షణము, అయస్కాంత శక్తి ఇత్యాది రహస్యశక్తుల ప్రతిపాదనను విడనాడి విశ్వమంతయు ప్రకృతిచే పరివ్యాప్తమై, ప్రకృతికణములు అనంతముగా విభావ

యోగ్యములని ప్రతిపాదించి ఒక నిర్దిష్టమగు కణసిద్ధాంతమును లేవదీసి, ప్రకాశము, అయిస్కాంత ప్రక్రియలను, పీనిద్వారా వివరించుటయే డెకార్ట్ తత్త్వశాస్త్రసూత్రములు అను గ్రంథమున చేసెను.

ప్రకాశము ఒక యానకము (Medium) నుండి ఇంకొక యానకమునకుపోవు విధమును గూర్చి డెకార్ట్ చేసిన పరిశ్రమల ద్వారా డెకార్ట్ కిరణ వక్రీభవన సూత్రమును కనిపెట్టెను. రాబర్ట్‌హుకె ఈ కృషిని కొనసాగించెను.

కేంబ్రిడ్జ్‌లో చదువుకొను దినములందు న్యూటన్ డెకార్ట్‌ను అధ్యయనము చేసెను. న్యూటన్‌కు డెకార్ట్‌కు విశ్వమునుగురించి ఒకేవిధమైన భావన కలదనియు, న్యూటన్ యొక్క సూత్రములు అను గ్రంథమునందు అవలంబింపబడిన పద్ధతి, డెకార్ట్ సూత్రములు అను గ్రంథమునందు అవలంబింపబడిన పద్ధతియు ఒకటియే అనియు, అయితే న్యూటన్ యొక్క వాదములు డెకార్ట్ వాదములకంటె అధికమగు గణితశాస్త్రీయ పటిమయు, ప్రత్యవేక్షణపైనను, ప్రయోగముపైనను హెచ్చుగా ఆధారపడియుండుటయు కలిగియున్నవి. ఒకవిశిష్ట సమస్యనో సంఘటననో అర్థముచేసికొనుటకు ఒక విశిష్టమైన ప్రతిపాదన చేయుటకంటె యావద్భౌతిక సంఘటనలకు వర్తించగల వాదమును స్థాపించి దాని ద్వారా ప్రత్యేక విషయములను అర్థము చేసికొనుటయే డెకార్టు

న్యూటనుల పద్ధతి. ఇది గెలీలియో పద్ధతికి భిన్నము. ఇంద్రియానుభూతులపై ఆధారపడి విశ్లేషము చేయబడిన ఇంద్రియ ప్రత్యక్షములన్నిటిని సమన్వయపరచగల జ్ఞానమే సరియగు భౌతికశాస్త్రముగ గెలీలియో అభిప్రాయపడెను. ఇంద్రియానుభూతుల ప్రామాణ్యమును నిర్ధారణచేయుట ఎట్లు? బుద్ధి నిశ్చయముగ నిర్ణయించని భూతార్థములను ఎట్లు అవగాహన చేసికొనగలము? — అను ప్రశ్నలకు మనము ముందు ప్రధానములైన సాధారణ సూత్రములను స్థాపించుకొని వానిని యదార్థవస్తువులన్నిటికి వర్తింపచేయవలె ననునదియే డెకార్ట్ సమాధానము. అందుచేతనే డెకార్ట్ భౌతికశాస్త్రము గెలీలియో భౌతికశాస్త్రముకంటె ఎక్కువ క్రమబద్ధమై ఒక పరిణతిలేని శాస్త్రనిర్మాణముగా నుండెను. ఇక ఈ నిర్మాణమునకు, ప్రత్యేకసంఘటనలకు గల సంబంధమును కనుగొనుట మాత్రమే పరిశోధనకు అవశిష్టమైన కార్యముగ నుండును.

ఒక నిగమనపద్ధతిలో అంతర్భాగముగ నుండని ఏవో యాదృచ్ఛిక ప్రయోగములచే సూచింపబడిన నిర్ణయములను డెకార్ట్ ఆమోదించలేదు. అందుచేతనే అతడు గెలీలియో కృషిని సమాదరించకపోయెను.

డెకార్ట్ యొక్క <u>సూత్రములను</u> గ్రంథము అతని అనుయాయులకు ఇంచుమించు ఒక శతాబ్దమువరకు అధ్యయన గ్రంథముగానుండి, ముఖ్యముగా 17 వ శతాబ్దము మధ్యకాల

మందు ఫ్రాన్స్, బ్రిటన్, వాయువ్యయూరప్‌లలో గెలీలియో భౌతికవాదమునకంటె అధికోపాదేయములుగా ఎంచబడెను. ఈ కారణముచేతను యూరప్‌నందు ఆనాటికి బేకన్ పేరు అజ్ఞాతముగా నుండుటచేతను, డెకార్ట్ సిద్ధాంతము ఆరిస్టాటిల్ సిద్ధాంతమునకు ప్రత్యామ్నాయమాయెను. డెకార్ట్ వాదమును పరిగ్రహించుటయే ప్రగతికి సూచకముగా కూడ నుండెను. ఉదాహరణమునకు 1650 ప్రాంతమున డెకార్ట్ వాదమును పరిగ్రహించుటచే కేంబ్రిడ్జ్‌కంటె ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయము అభ్యుదయగామిగా ఎంచబడెను. 1630 నుండి 1670 వరకు పారిస్ యూరప్‌యొక్క విజ్ఞానకేంద్రముగా ఉండుటకు డెకార్ట్‌యొక్క ప్రజ్ఞయే కారణము. బోయిల్, న్యూటన్‌లు డెకార్ట్ భావములను కృషిని ప్రాతిపదికగా తీసికొనుటయు, ఆయన కృషిని విభిన్నమార్గములలో అభివృద్ధి చేయుటయు జరిగెను.

డెకార్ట్ జీవశాస్త్ర కృషి:

హార్వే కనుగొనిన రక్తప్రసరణ సిద్ధాంతములోని అంతర్భావములను ప్రథమమున విస్తృతపరచినది డెకార్ట్. హృదయ కోశము యాంత్రిక ప్రక్రియను యావన్మానవ దేహపు భౌతికత్వమును దానినుండి నిగమనముచేసి ఆలోచనలు తప్ప తక్కిన మానవకార్యములన్నిటిని ఈ భౌతిక దేహమే కొనసాగించుచున్నదని డెకార్ట్ వివరించెను. కిణ్వప్రక్రియ

(Fermentation) లోని ఉష్ణతతో పోల్చదగు స్వాభావిక ఉష్ణత హృదయకోశమం దున్నదనియు, ఇది హృదయకోశ గతి వలన రుజువగుచున్నదనియు, హృదయకోశము అంత ర్జ్వలన యంత్రము (Internal Combustion engine) తో పోల్చదగు ననియు డెకార్ట్ అభిప్రాయపడెను. దేహ కార్య ములలో ఎక్కువ భాగము అప్రయత్న చాలన, ప్రతిక్రియల వలన జరుగుచున్నవనియు, ఇవి నాడీ వ్యవస్థ ద్వారా జరుగు బాహ్య ప్రేరణలకు స్వయం ప్రేరక ప్రతిక్రియలు అనియు డెకార్ట్ అభిప్రాయము. ఇచ్ఛా శక్తికి మానవ కార్యములలో గల స్థానము బహు స్వల్పమనియు, జంతువులలో దానికి అసలే స్థానము లేదనియు డెకార్ట్ వాదము. 19 వ శతా బ్దపు శరీరనిర్మాణ శాస్త్రము ఈవాదము వైపునకే ఎక్కువగా మొగ్గెను. శరీము సజీవముగా నుండి పని సాగింపగలుగుటకు కారణములు ఒకటిగాని ఎక్కువగాని జీవశక్తులు లేక ఆత్మలు కావనియు, దానికి, ఒక పెద్ద గడియారమందలి విభిన్న భాగముల పరస్పర యాంత్రిక సంబంధములవలెనే, విభిన్న దేహభాగముల యాంత్రిక సంబంధములే కారణములనియు, ఈ భాగములలో సంభవించు లోపములవలన కలుగు దేహ కార్యక్రమముల ఆపుదలయే మృతియనియు డెకార్ట్ జీవ శాస్త్ర సిద్ధాంతము. పరిస్థితులు మారనప్పుడెల్ల, ఒకేరకపు కారణము ఎల్లపుడును ఒకేరకపు కార్యమును సంభవింపచేయు నను సూత్రము శారీరక ప్రక్రియలకు కూడ అన్వయింపనగు ననియు, శరీరమును ఒక యంత్రముగా నెంచి దాని నిర్మాణ

మును ప్రక్రియలను అందు మూలముగా అర్థము చేసికొనవచ్చు ననియు, డెకార్ట్ చెప్పిన ఈ జీవశాస్త్రవాదము 17 వ శతాబ్దపు తరువాతి భాగములో వెలువడిన శరీరశాస్త్ర, శరీర నిర్మాణ శాస్త్రములపై ప్రభావము చూపెను.

శాస్త్రీయ కృషి కాధారము, లక్ష్యము :

డెకార్ట్ దర్శనములో మరిరెండు ముఖ్యమైన భావములు కూడా ఇచ్చట పేర్కొనబడదగియున్నవి.

I. శాస్త్రీయ ప్రగతి ఎవరికివారుగా విడివిడిగా పని చేయు శాస్త్రజ్ఞుల కృషిపై నాధారపడక నానాదేశములకు చెందిన శాస్త్రజ్ఞుల పరస్పర అవిచ్ఛిన్న సహకారకృషిపై ఆధారపడి యుండుననుభావము డెకార్ట్ యొక్క ఈ పుస్తక మందును, లేఖలయందును కానవగును. ఈ భావమును మొదటగా వ్యక్తీకరించి దీనికి ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినవాడు డెకార్ట్. పండితుల, శాస్త్రజ్ఞుల పరిషత్తులు ప్లేటో, అరిస్టాటిల్ కాలమునుండి ఉన్నప్పటికి అవి ఒక వ్యక్తియొక్క దార్శనిక వాదమును బోధించుటకు, ప్రచారము చేయుటకు లేదా ఒక సంప్రదాయమును ఇతోధికముగా అధ్యయనముచేసి దానిని అవగాహన చేసికొనుటకు, లేదా దానిపై వ్యాఖ్యానము రచించుటకు మాత్రమే ఉపయోగపడుచుండెడివి. డెకార్ట్ ఊహించిన శాస్త్రజ్ఞుల సహకార కార్యక్రమము అట్లుగాక

మానసిక, భౌతిక జగత్తులలో ఇంతవరకు తెలియని విషయములను తెలిసికొనుటకును, విజ్ఞానాభివృద్ధికొరకును యోజింపబడెను. ప్రాచీనకాలమునందు కనుగొనబడిన సత్యములను పదిలపరచుట, ప్రచారము చేయుటయేగాక పూర్వమునుండి సత్యములు అని నమ్మబడుచున్న విషయములు ఎంతవరకు సత్యములని పరిశోధన చేయుటకు, ఇంతవరకు మానవకోటికి తెలియరాని నూతనసత్యములను కనుగొనుటకుకూడ శాస్త్రీయకృషి ఆదర్శముగ నుండవలెనని డెకార్ట్ అభిప్రాయము.

II. గ్రీకు రోమను యుగమందు, మధ్యయుగమందు, శాస్త్రీయకృషి విశ్వమందు సమన్వయాత్మక సామరస్యమును చూడవలెనను కోర్కెతోడనో, లేక ఈశ్వర సంబంధమైన ఊహలను బలపరచుటకో, అర్థముచేసికొనుటకో, తరచు ఉపయోగపడుచుండెను. కాని, డెకార్ట్ శాస్త్రీయ కృషికి నూతన ధ్యేయము నేర్పరచెను. మానవులు ప్రకృతిని స్వాయత్తము చేసికొనినవారుగను, దానికి యజమానులుగను, ("Comme maîtres et possesseurs de la nature") అగునట్లు చేయుటయే శాస్త్రీయ కృషికి పరమ ప్రయోజనమని డెకార్ట్ అభిప్రాయము.

సాంఖ్యాది భారతీయ దర్శనములలోవలె ప్రకృతినుండి దూరముగా పోవుటవలన, వ్యవహారమునుండి విరమించుకొనుటవలన, ప్రకృతినుండి వేరుపడుట (కైవల్యము) సిద్ధించునేగాని

ప్రకృతిపై జయముగాని, ఆధిపత్యముగాని, దానిని మన ప్రయోజనమునకు ఉపయోగించుటగాని సాధ్యపడదు. ప్రకృతియు తత్కార్యములగు భౌతిక పదార్థములును దోషభూయిష్ఠములు, మన స్వాతంత్ర్యమును సంకుచితముచేయు హేతువులు అని ఎంచినప్పటికిని, వానిలోని దోషములను నిర్మూలనము చేయుటయు, వానిని మనస్వాతంత్ర్యాభివృద్ధికి సాధనములుగా మారునట్లు చేయుటయు పురుషోచిత కార్యముగా నుండునుగాని, వానికి భయపడి దూరముగ తొలగి పోవుట యుక్తమగు పురుషార్థము కానేరదు.

పరమ పురుషార్థము:

రోగరహితముగా, శ్రమరహితముగా ఆనందముతో వీలైనంతకాలము ఈ లోకమందు జీవించుటయే పరమ పురుషార్థమని డెకార్ట్ అభిప్రాయము. జీవశాస్త్ర, వైద్యశాస్త్రములు, అందలి పరిశోధనలు మనము రోగరహితులుగా నుండు విధానమును సూచించగలవు. భౌతికశాస్త్ర, గణితశాస్త్రములును వాటిపై ఆధారపడిన యంత్రశాస్త్ర, సాంకేతికశాస్త్రములును మానవులు శారీరక శ్రమను వీలైనంతవరకు తగ్గించుకొను విధానమును, ఈలోకమును తమ కిష్టమైన రీతిగా మార్చుకొను విధానమును తెలుపును. ఈ కారణములచేతనే డెకార్ట్ శాస్త్రీయ కృషికి ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చెను. ఇటువంటి శాస్త్రీయ కృషికి పునాదిగాను, మార్గనిర్దిష్టకము

గాను ఉండగల్గునది కాబట్టియే దర్శనశాస్త్రమునకు విలువ గలదుగాని, మానవ పరమప్రయోజన సిద్ధికి అనుపయుక్తమగు శుష్కవాదములతో నిండిన దర్శనములు అప్రయోజకములని డెకార్ట్ అభిప్రాయము.

డెకార్ట్ యొక్క ఈ అభిప్రాయములు డిడెరో, లమెట్రి బఫాఁ, దోల్‌బాఖ్ మొదలైన వారి వ్రాతలవలన హెచ్చుగా ప్రచారము చేయబడి ఒకవిధమైన స్వాభావిక వాదమునకు త్రోవదీసెను. దీనివలన మానవుని గురించియు, విశ్వమును గురించియు చేయబడు పరిశోధనలు పూర్వసంప్రదాయము నకుగాని, మతమునకుగాని లొంగకుండ స్వతంత్రముగా సాగ గలుగుటకు వీలగు వాతావరణ మేర్పడెను. ఇదిట్లుండ, శాస్త్రీయ కృషి, మానవుని పరమలక్ష్యములను గూర్చిన డెకార్ట్ అభిప్రాయములను సరకుచేయక ఆయన ఈశ్వరా త్మలను గురించి చేసిన సిద్ధాంతములకే ప్రాముఖ్యము నిచ్చి తద్వారా ఈశ్వరవాదమునకు, క్రైస్తవమతమునకు, భక్తిజీవ నమునకు విశేషబలము చేకూర్చిన చింతకులుకూడ యూరప్ నందు చాలమంది ఉద్భవించిరి. మాలెబ్రాంష్, బోసుయే, ఫెనెలాఁ, ఇత్యాదులిందు ముఖ్యులు.

కె. సచ్చిదానందమూర్తి

ఒకేపరి చదువుటకీ ప్రకరణము సుదీర్ఘముగా తోచినచో దీని నారు భాగములుగా విభజింపవచ్చును. అందు మొదటిదానిలో శాస్త్రములను గూర్చిన వివిధపర్యాలోచనలు గలవు. రెండవదానిలో గ్రంథకర్త కనిపెట్టిన ప్రమాణ పద్ధతియొక్క ముఖ్యసూత్రములును, మూడవ దానిలో ఈ పద్ధతినుండి ఆతడు నిగమనము చేసిన కొన్ని నైతికసూత్రలును, నాల్గవదానిలో ఆతని తత్త్వశాస్త్రమున కాధారములగు నీశ్వర జీవాస్తిత్వములను ఋజువు చేయు హేతువులును, అయిదవ దానిలో ఆతడు పరిశోధన చేసినకొన్ని భౌతిక ప్రశ్నలును – ప్రధానముగా హృదయ గతి, వైద్యశాస్త్రము వీనిలోని మరికొన్ని క్లిష్ట సమస్యలు, మానవులయు, జంతువులయు ఆత్మలకున్న భేదములును గలవు; చివరి భాగములో ప్రకృతి పరిశోధనయందు ఇతోధిక గురుతరాభివృద్ధి జరుగుట కేది యావశ్యకమని గ్రంథకర్త నమ్ముచున్నాడో, దానిని వ్రాయుట కాతని ప్రోత్సహించిన కారణములును గన్పట్టును.

# ప్రథమ భాగము

మానవులయందన్నిటికంటె సద్బుద్ధి అత్యంతము సమాసముగ విభక్తమై యున్నది. ఎందుకనగా: ప్రతిమానవుడును తనకది సర్వసమృద్ధిగా కలదనియే తలంచును. కొందరే విషయమునందును సంతృప్తిపడుట కష్టసాధ్యము. అట్టివారు కూడ సాధారణముగా తమకున్న దానికంటె నధికముగ నీ గుణమును కోరరు. ఈవిషయమున నందరు పొరపడియుండుట సంభావ్యము కాదు. సరిగా నిర్ధారణ చేయగల శక్తియు, సత్యాసత్యవివేచన చేయగల శక్తియు నై సర్గికముగ మనుష్యులందరియందును సమానముగా నున్నదని యీ విశ్వాసము సూచించును. ఇదియే సద్బుద్ధి లేక వివేకము అని సముచితముగా పిలువబడుచున్నది. కావున, మన అభిప్రాయభేదములకు కారణము మనకున్న వివేకమునందలి తరతమభేదముగాక, మన ఆలోచనలను కేవలము భిన్న మార్గములందు పోనిచ్చుటయు, అందువలననే మనశ్రద్ధ ఒకే వస్తువుపై కేంద్రీకృతము కాకపోవుటయు నై యున్నది. ఏలయన శక్తిమంతమగు మనస్సు కలిగియుండుట చాలదు. ముఖ్యముగా కావలసినది దానిని సరిగా వినియోగించుట. మహామనీషులు అత్యుత్తమ గుణముల సాధింపగలరు. అట్లే అత్యధికలోపములకు లోనగుచుందురు. సరియైన మార్గమును వదలకుండ మెల్ల

మెల్లగ నడచువారు, దారివదలి పరుగెత్తువారికంటె నిజముగా ముందు పోవచ్చును.

సామాన్యుని మనస్సుకంటె నామనస్సు ఎక్కువ పరిపూర్ణమైనదని నేనెన్నడును తలంచుటలేదు. పైగా మరి కొందరివలె వేగముగా నాలోచింపగల్గియు సరిగా, విశదముగా భావింపగల్గియు, లేదా సంపూర్ణముగా, సద్యముగా (Readily) స్మరింపగల్గియు నేనుండవలెనని తరచుగా అభిలషింతును. మనస్సునకు పరిపూర్ణత్వమును గలిగించు నితరగుణములు, ఇవిగాక నేనెరిగినవి లేవు. ఎందుకనగా, మనలను మనుష్యులుగా చేసి, పశువులనుండి వేరుపరచునది వివేకము, లేక బుద్ధియే కావున అది ప్రతివ్యక్తియందును పరిపూర్ణముగా నున్నదనియే నేను విశ్వసించుచున్నాను. ఈవిషయమున తరతమ భేదము అసహాజములందే కాని, ఒకేవర్గమునకు చెందిన వ్యక్తుల నైసర్గిక రూపస్వభావములపై నాధారపడి యుండదనులే దను దార్శనికుల సామాన్యాభిప్రాయమును నే ననుసరించుచున్నాను.

ఎటులైనను, నాజీవితమున నతి ప్రారంభదశయందే విశిష్టములగు కొన్ని మార్గములవెంబడి నేను పోవుట నా ప్రత్యేక భాగ్యమని నా విశ్వాసము. ఆ మార్గముల ననుసరించుటవలన కొన్ని విచారణరీతులను, సామాన్యసత్యములను నేను తెలిసికొంటిని. వాని విషయమున నేనొక ప్రమాణ

పద్ధతి నేర్పరచుకొంటిని. తద్ద్వారమున, నాకు తోచిన విధమున నా జ్ఞానమును క్రమక్రమముగా అభివృద్ధిపరచుకొని, కొంచెము కొంచెముగా దానిని విపులీకరించుకొనుచు, సామాన్యమగు నాశక్తికిని, నాస్వల్పజీవితమునకును, అనువగు ఉచ్చస్థాయిని దానిని పొందించితిని. అతిసాహసిగానుండుట కంటె నన్ను నేను సదా పరీక్షించుకొనుటకే యత్నింతును. స్వవిషయమున నిదియే నా నిశ్చితాభిప్రాయము. మానవుల యొక్క వివిధములగు పనులను, సాహస కృత్యములను, దార్శనిక దృష్టితో పర్యవేక్షించునప్పుడు, నిరుపయోగము, వ్యర్థముకాని దేద్దియు గన్పట్టదు. అయినను, అందువలన నేను నిరుత్సాహపడలేదు. కారణము : సత్యాన్వేషణమున, నా ప్రమాణపద్ధతివలన నాకు సమృద్ధమగు ఫలము లభించి నది. నే నింతవరకు సాధించిన ప్రగతివలన నాకు సంపూర్ణ మగు తృప్తికలిగినది. కావున భావిపట్ల నాశాపూర్ణుడనై యుండుట నాకు తప్పనిసరి యగుచున్నది. అట్లే, అన్ని వృత్తులయందును మానవులకు కేవలము మానవులుగా, ఉచి తమును, నిజముగా మంచిదియు, ముఖ్యమును అగు వృత్తి యేదైన నున్నచో, అది నేను గైకొనినదే అని విశ్వసింప సాహసించుచున్నాడను.

ఇంతకు నేను పొరపడియుండుట కవకాశము కలదు. నేను బంగారముగను, వజ్రముగను గ్రహించుచున్నది బహుశః

ఒక చిన్న రాగిముక్కయో, గాజుముక్కయో కావచ్చును. స్వవిషయములందు మనమెంతగా భ్రమకు లోనగుదుమో నే నెరుగుదును. మన మిత్రులు మన పక్షమున మన కిచ్చు నిశ్చయాభిప్రాయము లెంతగా సందేహింపవలసినవో కూడ నే నెరుగుదును. కాని ప్రతివ్యక్తియు తనకుతానే నిశ్చయించు కొనగల్గుటకై చిత్తరువునందువలె నాజీవితమును చిత్రించుచు నే ననుసరించు మార్గములనుగూర్చి వివరించుటకును ఈప్రకరణ గ్రంథమునందు ప్రయత్నింతును. ఈ వివరణవలని మరొక ప్రయోజనము: ఈ మార్గములయెడ కొన్నియభిప్రాయము లేర్పడియుండును. అవి ప్రస్తుత వార్తలవలన తెలియును. నేను మామూలుగా ఉపయోగించు పద్ధతులకు అవి చేర్పులగును. అందువలన ఆత్మోపదేశ విషయమున నాకు క్రొత్తమార్గమును లభించును.

తన వివేకమును సక్రమముగా నడిపింప ప్రతివ్యక్తియు అనుసరింపవలసిన పద్ధతిని బోధించుట నాప్రస్తుతోద్దేశము కాదు. మరేమన, నావివేకమును నేనెట్లునడిపించుటకు ప్రయత్నించితినో, వివరించుట మాత్రమే. ఒరుల కుపదేశింప సంసిద్ధులగువారు తమ కొరులకంటె నధికమగు మేధ కలదని తలంపవలసినదే. బహు స్వల్పవిషయమునందు వారు పొరపడినను, నిందకు లోనగుదురు. కాని, ఈ చిన్నగ్రంథము కేవల మొక యితిహాసముగానో, కాకున్న, ఒక నీతిబోధకమగు

కథగానో మాత్రమే పరిగణింపనగును. ఇందు అనుసరణ యోగ్యములగు ఉదాహరణములు కొన్నియు, అనుసరణ యోగ్యములుగాని యుదాహరణములు మరికొన్నియు లభింపగలవు. కావున, ఇది ఎవ్వరికిని కష్టదాయకముకాదు, కొందరికైన నుపయోగకరము. నాస్పష్టవాదిత్వ మందరికిని నామోదకరమే యగును.

శైశవమునుండియు నేను విద్యాభ్యాసమును గావించుచుంటిని. అక్షర సాహాయ్యమున, జీవితోపయోగి సమస్త విషయములను గూర్చియు, స్పష్టము, నిశ్చితమునగు జ్ఞానము గలుగును అను నమ్మకము నాకు కల్గినది. అందువలన నాకు తీవ్రముగా విద్యాజిజ్ఞాస గల్గినది. నావిద్యాభ్యాస మంతయు పూర్తియైనది. సంప్రదాయానుసారముగ నేను పండితసమాజమున చేరవలసియుండెను; అట్టితరి సంపూర్ణముగా నాయభిప్రాయమును నేనుమార్చుకొంటిని. కారణము; నే ననేకములగు సందేహములందును, తప్పులయందును చిక్కుకొని యున్నట్లు తెలిసికొంటిని. పాండిత్యసంపాదన ప్రయత్నమున అడుగడుగునకు నాఅజ్ఞానమును కనుగొనుటతప్ప మరెట్టి పురోగమనమును నేను చేయలేకపోతిని. అయినను, నేను చదువుచున్నది ఐరోపాఖండమునందలి సుప్రసిద్ధ విద్యాపీఠము. పండితులనువారెచ్చటనైన నున్నచో అందుగలరని నాతలంపు. ఇతరులచట నేర్చిన దంతయు నాకుగూడ బోధింపబడెను. అక్కడ బోధింప

బహు శాస్త్రములతో నేను తృప్తిపడక, మిక్కిలి అరుదైనవి, కుతూహల జనకములైనవి అని ప్రశంసింపబడు శాస్త్రశాఖల గూర్చి రచింపబడిన గ్రంథముల నన్నిటిని, నాకు లభించినంత వరకు, చదివితిని. నావిషయమున నితరు లేర్పరచుకొనిన నిశ్చితాభిప్రాయముల నేనెరుగుదును. నా సహపాఠులలో కొందరు మాయుపాధ్యాయుల స్థానముల నాక్రమింప నిర్దిష్టులై యున్నను, వారితో సరిసమానముగ నేనును భావింప బడుచుంటిని. మనీషాగరిష్ఠుల నుత్పాదించుట యందును పెంపొందించుటయందును, మనయుగము, గతించిన యే యుగమునకైన సమానముగనే నాకు గన్పట్టినది. ఈవిధముగ, నాయంతట నేనే యితరులందరినిగూర్చి విచారించు స్వాతంత్ర్యమును తీసికొంటిని. శాస్త్రస్వభావమును గూర్చి పూర్వము నా కొక నమ్మకము కలుగునట్లు చేసిరి. అట్టి స్వభావముగల శాస్త్ర మెద్దియును లేదని నిర్ధారణ చేయు స్వాతంత్ర్యమును తీసికొంటిని.

ఎట్లైనను, విద్యాపీఠములందలి చదువులను గౌరవించు చునే యుంటిని. అందు బోధింపబడు భాషలు ప్రాచీనుల రచనల నర్థము చేసికొనుట కావశ్యకములనియు; నీతికథలు మనస్సును రంజింపజేసి ఉత్తేజపరచుననియు; అవిస్మరణీయములగు నైతిహాసిక కార్యకలాపములు మనస్సు నున్నతస్థితికి గొనిపోవుననియు; వివేకముతోడ వానిని చదివినచో

నయ్యావి యొక్క నిశ్చయాభిప్రాయమునకు దోడ్పడుననియు; ఉత్తమగ్రంథపఠనము, పూర్వయుగ మహామనీషులగు తద్రచయితలతోడి సంభాషణవంటిది — అందును శ్రేష్ఠములు మిక్కిలి వరణీయములు అగు వారి భావములను మాత్రమే వ్యక్తము సేయునట్లు నేర్పుగా సాధింపబడిన సంభాషణవంటిది, అనియు-వాగ్మిత్వమునకు అసదృశమైన శక్తియు అందము గలవనియు; కవిత్వమున హృదయంగమమగు ఆకర్షణయు, ఆనందమును గలవనియు; గణితశాస్త్రమునందు మిక్కిలి సూక్ష్మములగు విషయములను కనుగొనిరి; జిజ్ఞాసులను తృప్తిపరచుటకు అవి మిక్కిలి తోడ్పడుచున్నవి; సమస్త మనుష్యశ్రమను తగ్గించుచున్నవి; అనియు; అత్యుపయోగకరములగు పెక్కు-బోధలు, ఉపదేశములు నీతిశాస్త్రగ్రంథములలో గలవనియు; ఈశ్వరవిజ్ఞానశాస్త్రము స్వర్గ (మోక్ష) మార్గదర్శకమనియు, సత్యభ్రాంతిని గలిగించురీతిగా, సమస్త విషయములను గూర్చియు ప్రసంగించుశక్తిని మనకు దర్శనశాస్త్రమిచ్చి అపండితుల మెప్పును సంపాదించుననియు, ధర్మశాస్త్రము, వైద్యశాస్త్రము మొదలగునవి తత్సాధకులగు గౌరవసంపదలను లభింపజేయుననియు, నాకు తెలియును.

వాని యన్నిటితోడి పరిచయమును మన కుపయోగకరమే, అంధ విశ్వాసపూర్ణములు, దోషజుష్టములు అయిన వానితోగూడ: అందువలన వాని నిజమైన విలువను మనము

గ్రహింపగలము; అవి మనలను మోసగింపకుండ, మనలను మనము రక్షించుకొనగలము.

భాషల నభ్యసించుటకును, ప్రాచీనుల గ్రంథములను, వారి చరిత్రలను, పురాణములను చదువుటకును, తగుకాల మును ఇదివరకే వినియోగించితినని నానమ్మకము. ఏలన, ఇతర యుగముల వారితో సంభాషించుటయు, వారితో పర్య టన గావించుటయు నించుమించుగా నొక్కటే. విభిన్న దేశముల పద్ధతులనుగూర్చి కొంత తెలిసికొనుట ఉపయోగ కరము. మన పద్ధతులను గూర్చిన సరియగు నిశ్చితాభిప్రా యము నేర్పరచు కొనగలుగుటకును, మన ఆచార వ్యవహార ములకు విరుద్ధమైన ప్రతివిషయమును హాస్యాస్పదము, అయు క్తము అని తలంపకుండుటకును,-తమ దేశమునుగూర్చిమాత్రమే అనుభవమున్నవారికి సాధారణముగా తోచు పర్యవసానమే యిది—భిన్న దేశజ్ఞాన మవసరము. అది యట్లుండ, పర్యటన యందే హెచ్చుకాలము గడపినచో మన మాతృదేశమునకే మన మపరిచితులు మయ్యెదము. మరియు పూర్వాచారముల విషయమున అతికుతూహలము గలవారమైనచో ఇక్కడ, ఇప్పుడు జరుగుచున్నదాని విషయమున సాధారణముగ నజ్ఞు లమై యుందుము. పైగా అసంభావ్యములగు ననేక సంఘటన లను సంభావ్యములుగా పురాణగాథలు వ్యక్తము చేయును. ఇతిహాసము లెంత యథార్థములైన గావచ్చును; విషయమును

పూర్ణముగా అస్తవ్యస్తము గావింపకపోవచ్చును; తమ్మెక్కువ పఠనయోగ్యములుగా చేసికొనులకై తమ ప్రాముఖ్యము నతిశయముగా చెప్పకపోవచ్చును. అట్లయ్యు, అవి ఇంచుమించుగా నెల్లప్పుడు, కవిసము, సామాన్యములును ఆకర్షణ శూన్యములును అగు పరిస్థితులనైన విడిచిపెట్టును. కాబట్టి ఆ మిగిలినది సత్యము చెప్పదు. ఇక వీనినుండి ఉదాహరణములగైకొని, వానిబట్టి తమ ఆచరణమును సంయతము చేసికొనువారు, కల్పిత కథలలోని సాహసిక సైనికులవలె 'అతి' లో పడినవారై తమ శక్తులకు మించిన ప్రణాళికలను వేయుదురు.

వాగ్మిత్వమును నే నెక్కువగా సంభావించితిని. కవితాస్వాదనమున నానందోద్రిక్తుడ నైతిని. కాని అవి రెండును సహజముగా వచ్చు ప్రకృతి ప్రసాదములుగాని అధ్యయనఫలములు కావని తలంచితిని. బుద్ధిబల మధికముగా గలిగియుండి తమ ఆలోచనలను స్పష్టములు సుగమములు అగునట్లేర్పరచుకొనగ నేర్పుగలవారు. 'లోయరు బ్రిటానీ' భాషలో మాటలాడినను సంవాదశాస్త్ర సూత్రములతో అపరిచితులైనను తాము ప్రతిపాదించునది సత్యమని యితరు లంగీకరించునట్లు చేయ నెప్పుడును కడు సమర్థులు. అత్యంతము, సంతోషదాయకములైన కల్పనాశక్తులు గలిగి మిక్కిలి ఆకర్షణీయముగా వానిని వ్యక్తీకరింపగలవారు కవితాకళ నభ్యసింపకున్నను ఉత్తమ కవులే.

గణితశాస్త్రమందలి హేతువుల యథార్థత్వ ప్రామాణికత్వములవలన, తచ్ఛాస్త్రముపట్ల నేను విశేషముగా సంతుష్టుడ నైతిని. కాని దాని వాస్తవోపయోగము నాకప్పటికి అవగతము కాలేదు. కేవలము యాంత్రిక కళాభివృద్ధికే గణితశాస్త్రము తోడ్పడునని తలంచి, అంతటి బలీయములు సుదృఢములు నగు పునాదులపై ఇంతకంటె నున్నతతరమగు నుపరినిర్మాణము లేకుండుట కాశ్చర్యపడితిని. ఇంకొకవంక ప్రాచీననీతిశాస్త్రజ్ఞుల గ్రంథములను, ఇసుక, బురద తోడి పునాదులకంటె మంచిపునాదులులేని మహోన్నతవైభవోపేతములగు సౌధములతో పోల్చితిని. వారు సద్గుణముల నత్యధికముగ ప్రశంసింతురు. పృథ్విపై గల యేవస్తువుకంటె నవ్వానిని ప్రశస్తతరములుగా ప్రదర్శింతురు; కాని అవి యెట్టివో తెలిసికొను మార్గమును బోధింపజాలరు. మరియు వారు చక్కని పేరు పెట్టినది తరచుగా వ్యర్థతాటస్థ్యమో, గర్వమో, నిస్పృహయో, పితృహత్యయో అయి యుండును.

మన ఈశ్వరమీమాంసను నేను గౌరవించితిని. ఇతరులకువలెనే నేనును స్వర్లోకమును చేరగోరితిని. మరియు ఆ మార్గము మహావిద్వాంసునకును, అత్యంతము, అజ్ఞునకును సమానముగనే అందుబాటులో నుండుననియు, స్వర్గదములగు భగవత్ప్రసాదిత సత్యములు మనబుద్ధి కతీతములనియు, నిశ్చయముగా తెలిసికొని నాబుద్ధ్యశక్తికి వానిని గురిచేయ సాహ

సింపలేకపోయితిని. మరియు సమర్థతతో తత్పరీక్షను కొనసాగించుటకు ప్రత్యేకమగు భగవత్సాహాయ్యమును అతిమానవత్వమును ఆవశ్యకములని తలంచితిని.

సుప్రసిద్ధులగువారు తరముల తరబడి దర్శనశాస్త్రమున కృషిచేయుచున్నారు. అయినను తచ్ఛాస్త్రమున వాదగ్రస్తము కానట్టి—కావుననే సంశయాతీతమైనట్టి—విషయమొక్కటియైన లేదు. ఇది చూచిన తరువాత, అందితరులకంటె నాకెక్కువ విజయము కలుగునని సంభావింప సాహసింపలేకపోయితిని. ఈయొక్క మాటయే దర్శనశాస్త్రవిషయమున నేను చెప్పగలను. మరియు నేవిషయమును గూర్చియైనను సత్యమగు నభిప్రాయ మొక్కటియే యుండుట సాధ్యమైయుండ, విద్వాంసులలో ఒకే విషయమును గూర్చి పరస్పరవిరుద్ధములగు నానాభిప్రాయము లుండుట గమనించి, సంభావ్యమాత్ర మైనదంతయు నించుమించుగా నసత్యమనియే నేను లెక్కించితిని.

ఇక ఇతర శాస్త్రములు : దర్శనశాస్త్రమునుండియే వాని సూత్రములు గైకొనబడినందున, అంతటి బలహీనములగు పునాదులపై లేచిన బహిర్నిర్మాణమెద్దియు దృఢముగా నుండదని నిశ్చయించితిని. వానిలో నేను కృషిచేయ నిశ్చయించుటకు వానివలన కలుగు గౌరవము కాని, లాభముగాని చాలినవికావు. ఎందుకన, నాభాగ్యాభివృద్ధికై శాస్త్రము నొక

విపణివస్తువుగా చేయవలసిన పరిస్థితిలో నేను లేనందులకు భగవంతునకు వందనములు. సమస్తమును హేళనపూర్వకముగ తూలనాడు కొందరు తాత్త్వికులవలె ఖ్యాతిని నే నేవగించునట్లు నటింపకపోయినను, కల్పితములగు బిరుదుల ద్వారా మాత్రమే సంపాదింపనగు గౌరవమును మిక్కిలి చులకనగా చూచితిని. ఇక అసచ్ఛాస్త్రములు : రసవాదుల బూటకమునుండి, ఐంద్రజాలకుని తంత్రములనుండి, తెలియని వస్తువులను గూర్చి తమకు తెలిసినట్లు నటించువారి వంచనాప్రగల్భములనుండి, మోసపోకుండ తప్పించుకొనుటకు వలసినంతవరకు, మిథ్యాశాస్త్రముల విలువను తెలిసికొనియుంటినని నాతలంపు.

ఈకారణములచే, వయసువచ్చి బోధకుల అదుపునుండి బయటపడినంతనే, నేను సంపూర్ణముగా విద్యాధ్యయనమును మానివేసితిని. మరియు, నాయొక్కయు, జగత్తను మహాగ్రంథముయొక్కయు జ్ఞానమును తప్ప మరేశాస్త్రమును ఇక అన్వేషింపనని నిశ్చయించుకొంటిని. మిగిలిన నా యౌవ్వనమంతయు పర్యటనయందును రాజసభలను సైన్యములను సందర్శించుట యందును, విభిన్నప్రకృతులు, అధికారములుగల మనుష్యులతో సంభాషించుటయందును, విభిన్నానుభవములను గడించుటయందును, విధివశమున విభిన్నపరిస్థితులలో పడిన నన్ను నేనే పరీక్షించుకొనుటయందును, అన్నిటికంటె మిన్నగా నాయభివృద్ధిని స్థిరపరచుకొనుటకై, అనుభూత విషయములను

మననము చేయుటయందును గడపితిని. కారణము : ఊహా చోదిత విషయములనుగూర్చి తన అధ్యయనకక్ష్యలో పండితుం డొకడు హేతువాదములను జరుపును. వ్యావహారికముగ నా హేతువాదములు కొరగానివి. వ్యవహారజ్ఞానమున కెంతదూరము లైన నంత అధికముగా అవి యాతని వ్యర్థగర్వమును పెంపొందించును. అంతకుతప్ప నితరమగు సంబంధమెద్దియు వానితో ఆతనికిలేదు. అట్టిసమయమున వానిని సంభావ్యములుగా చేయుటకు అధికకళాకౌశల మావశ్యకము. ఇట్టి పండితుని హేతువాదములందుకంటె, ప్రతివ్యక్తియు గావించు హేతువాదములలో, ఎక్కువ సత్యమును కనుగొనగలనని నాకు తోచినది. కారణము : ఈ హేతువాదములలో ఆ వ్యక్తి స్వయముగా నాసక్తుడై యుండును. తప్పు నిర్ణయమును గావించుచో తత్ఫలితముగ తద్ క్షణమే ఆతడు శిక్షింపబడుట కవకాశము గలదు. పైగా జీవితమున సన్మార్గమేదో స్పష్టముగా విచక్షణచేసి, విశ్వాసముతో దానియం దగ్రసరుడను అగుటకై, సత్యమును అసత్యమునుండి వేరుపరచుట యెట్లో తెలిసికొనవలె నను సత్యోత్కటమగు జిజ్ఞాస నా కెల్లప్పుడు నుండెను.

ఇతరమనుష్యుల పద్ధతులను, ఆచారములను గమనించుటయందు మాత్రమే, నిమగ్నుడనై యున్నప్పుడు నిశ్చితాభిప్రాయమున కిచ్చుటకూడ నెట్టియాధారమును మృగ్య

మని నేను కనుగొంటిని. మరియు ఇందలి వైరుధ్యము, దార్శ నికాభిప్రాయములందలి వైరుధ్యమున కేమాత్రమును తక్కువ కాదని గుర్తించితిని. కాబట్టి, మనమనస్సున కెంతయు విపరీత ముగను, పరిహాసాస్పదముగను గన్పట్టు విషయము లనేకములు ఇతరములగు పెద్దజాతులచే పరిగ్రహింపబడుటయు అంగీకరింప బడుటయు గమనించి, కేవలము ఉదాహరణమూలమున గాని, ఆచారమూలమున గాని సత్యములుగాతోచు నెద్దానినిగూర్చి యు సునిశ్చితాభిప్రాయము కలిగియుండరాదని నేర్చుకొంటిని. అదియే నే నీయధ్యయనమువలన పొందిన మహాలాభము. ఈ విధముగ స్వాభావికమగు తన తెలివిని మలీమసముగావింప శక్తి గల్గినవియు, చాలదనుక బుద్ధ్యుపదేశము నాలింప శక్తి లేకుండ మనలను చేయగలిగినవియు అగు తప్పులనుండి మెల్లమెల్లగా తప్పించుకొంటిని. కాని, అనేక సంవత్సరములు ఇట్లు ప్రపంచ మను గ్రంథమును అధ్యయనము చేయుటయందును, కొంత అనుభవమును సంపాదింప యత్నించుటయందును, గడపిన పిమ్మట, చిట్టచివరకు నన్నే అధ్యయన విషయముగా చేయ కృతనిశ్చయుడ నైతిని. మరియు నే ననుసరింపవలసిన మార్గ ముల నెన్నుకొనుటయందే నామనశ్శక్తులనన్నిటిని వినియోగింప నిశ్చయించితిని. నా దేశమును నా పుస్తకములను నే నెన్నడును వదలకుండ నున్నచో కలిగియుండెడి విజయముకంటె అధికతర మగు విజయమునే నేను సాధించితిని.

---

## ద్వితీయ భాగము

అప్పటి కింకను జర్మను దేశమునందలి యుద్ధము లంతము కాలేదు. ఆయుద్ధములు నన్నాకర్షింపగా నే నా దేశము నందుంటిని. చక్రవర్తియొక్క పట్టాభిషేకమునుండి సైన్యము నకు తిరిగి వచ్చుచుండగా, హేమంతర్తు ప్రవేశము నన్నొక ప్రదేశమున నరికట్టినది. అందు నన్నాకర్షింపగల సమాజ ములు లేవు. అదియుగాక, అదృష్టవశమున ఎట్టి చింతలు గాని రోగములుగాని నన్ను బాధింపలేదు. అందువలన దినమంతయు నే నేకాంతమునందే గడపితిని. నా యాలోచనల యందే నా శ్రద్ధను కేంద్రీకరించుట కది పరిపూర్ణమగు నవకాశము. అందు నాకు తట్టిన ఆలోచనలలో మొట్టమొదటి దిది. సిద్ధహస్తుడగు నొక్కనిచే పూర్తికావింపబడిన పనుల యందుండు పరిపూర్ణత భిన్నజనకృతములును, వివిధ భాగ నిర్మితములునుఅగు పనులయందుండదు. ప్రారంభమందు ఏవో ప్రయోజనములకై కొందరు గోడలుకట్టిరి. ఆప్రయోజనము లను విస్మరించి మరికొందరు ఆ ప్రాత గోడలను గైకొని, మరి కొన్ని ప్రయోజనాంతరములతో కట్టడములు కట్టిరి. ఈ కట్టడ ములకంటె ఒకేస్థపతి యోజనచేసి నిర్మించిన కట్టడములు సామాన్యముగ ఎక్కువ సుందరములు విశాలములు అయి ఉండుట కానవగును. మొట్టమొదట పల్లెలుగానుండి కాల క్రమమున పెద్దపట్టణములుగా మారిన ప్రాచీననగరముల

విషయముగూడ నట్టిదే. స్థాపత్యమే వృత్తిగా గలవాడు, సువిశాలమగు మైదానమున యోజించి సక్రమముగా కట్టిన పట్టణములతో పోల్చినచో అవి సామాన్యముగా అసంబద్ధములై యుండును. దీని పర్యవసానము: ప్రాచీననగరములందలి వివిధసౌధములు దేనికది ప్రత్యేకముగ చూచినచో, అందమున, నవీననగరసౌధములతో సరిగా వచ్చును; వానిని మించియు నుండవచ్చును. అట్లయ్యు, ఆసౌధము లొక పద్ధతిలోలేక గుమిగూడి యుండుటయు, ఒకచో పెద్దసౌధమును ఇంకొకచో చిన్నయిల్లును ఉండుటయు, తత్కారణముగ వీధులన్నియు వంకరటింకరగను, క్రమతాహీనముగను ఉండుటయు చూచినచో బుద్ధిచోదితమైన మానవసంకల్పముగాక అసహజమగునది ఏద్దియో అట్టి నిర్మాణమునకు దారితీసి యుండునని చెప్పనగును. అయినను, స్వాంతకట్టడములు, నగరాలంకరణ పరిపోషకముగ నుండునట్లు చూచుటకై, ప్రతికాలమునందును కొందరధికారు లుండెడివారను విషయమును మనము గమనించినచో, ఇతరుల కష్టముపై నాధారపడుచు నిజముగా సంపూర్ణమైనదానిని పొందుట ఎంత కష్టసాధ్యమో తప్పక మనము గ్రహింపగలము. ఇట్టి యభిప్రాయములే నాకు కొన్ని జాతులయెడ గలవు. అవి ప్రారంభమున ఇంచుమించుగా బర్బరస్థితియందుండి, మెల్లమెల్లగా పురోగమించుచు నాగరకము లగును: వారి శాసనములు, ప్రత్యేకములగు కొన్ని నేరములకు, తగవులకు సంబంధించిన

బాహ్యఫలవలన మాత్రమే క్రమక్రమముగా నిర్ణీతములై బలా త్కారముగ వారిపై ప్రయుక్తము లాయెనా అనుకల్పింపను.

సంఘములుగా నేర్పడుటకు ప్రారంభించిన నాటినుం డియు కొన్నిజాతులు బుద్ధిశాలియగు నొక ధర్మప్రవర్తకుని కట్టడల ననుసరించి యుండును. ఇందు, మొదట చెప్పబడిన జాతులయందలి సంస్థలు, రెండవవానియందలి సంస్థలకంటె అసంపూర్ణములై యుండునని, నేనూహించితిని. ఈవిధముగ, ఈశ్వరునినుండి శాసనములు పొందిన సత్యధర్మస్వరూపము శక్కిన యే ధర్మముకంటె అనూనాతిశయము కలిగియుండు ననుట నిశ్చితమే. ఇక మానవసంబంధి విషయములగూర్చి విచారింతము. స్పార్టాయొక్క పూర్వాధిక్యమునకు, ప్రత్యేక ముగా తద్దేశమునందలి ప్రతి శాసనమును మంచిదిగానుండుట కారణము గాక, తచ్ఛాసనములన్నియు నేకవ్యక్తికృతములై యేకైకలక్ష్యప్రవణము లగుటయే కారణమని నా నమ్మ కము. ఏలన, ఆశాసనములలో ననేకములు చాల వింతగను, అతి విరుద్ధముగ నుండును. అదే విధముగ, అనేకవ్యక్తుల అభిప్రాయములను ప్రోగుచేయుటవలన నేర్పడిన గ్రంథము లందలి శాస్త్రములు (నిరూపణ రహితములగు సంభావ్య తర్కములతో నిర్మింపబడినవి కనీసము) సద్బుద్ధి గల మనుష్యుడు, స్వాభావిక నిష్పాక్షికవివేచన నుపయోగించి, స్వానుభవములను గూర్చి చేయు సరళానుమానములకంటె ఎక్కువగా సత్యదూరములని నేను తలంచితిని. మనమందర

మును బాల్యస్థితినుండి ప్రౌఢత్వమును పొందవలసినదే కావు నను, అనివార్యముగా కొంతకాలము ఇంద్రియోద్రేకముల చేతను గురువులచేతను (గురూపదేశములు తరచుగా పరస్పర విరుద్ధములు; బహుశః వారెల్లప్పుడు మన మంచికొరకే ఉపదేశించువారుకారు) పరిపాలింపబడినవారము కావునను, జన్మాదినుండియే మనబుద్ధి పరిపక్వమైయుండి, ఆ బుద్ధి సాహాయ్యమున నే మనము పోయినచో, మన నిశ్చయాభిప్రాయము లెంత సుదృఢములుగా నుండెడివో, అంత సుదృఢములుగా ఇప్పు డుండుట దాదాపు అసంభవమనియు నేను తలంచితిని.

వీధు లందముగా నుండునట్లు వేరువిధమున కట్టుటయే ప్రయోజనముగా, ఒక పట్టణమునందలి యిండ్ల నన్నిటిని పడ గొట్టుట ఆచారముకాదు. ఇది సత్యము. కాని ప్రత్యేకవ్యక్తి యొకడు, తనయింటిని సరిక్రొత్తగా కట్టుకొనుటకై దానిని పడగొట్టుట తరచుగా జరుగుచుండును. మరియు, ఇండ్లు ప్రాత బడి కూలు నపాయస్థితియందు న్నప్పుడును, పునాదులు సురక్షితమగు స్థితియందు లేనప్పుడును జనులప్పుడప్పుడు ఇట్లు చేయుట తప్పనిసరియగును. దీనిని ఉదాహరణముగ గైకొని ఒకరాష్ట్రమును సంస్కరింపదలంచి, ఒకప్రత్యేకవ్యక్తి అందున్న వన్నియును మార్చి, దానిని తిరిగి స్థాపించుటకై ఆద్యంతము పడగొట్టుట అసంగతమని ఒప్పుకొంటిని. మరియు శాస్త్ర స్వరూపమును, లేదా, విద్యాపీఠములలో ప్రతిష్ఠితమైయున్న

బోధనా పద్ధతిని, సంస్కరించుట సంభావ్యము గాదని తలంచి తిని. ఇక అప్పటివరకు నేను గ్రహించియున్న అభిప్రాయ ముల విషయము: వానిని సంపూర్ణముగా పరిత్యజించుటయే సర్వోత్తమమని నేనుతలంచితిని. అందువలన, నాకు పూర్వాభి ప్రాయములకంటె సరియగు అభిప్రాయములను గ్రహింప నవ కాశముండును, లేదా, వివేకకృత నిశిత పరీక్ష గడచిన తరు వాత పూర్వాభిప్రాయములనే గ్రహింపవచ్చును. ప్రాతపునా దులపై ఇండ్లను నిర్మించునట్లు, సత్యమును విచారింపక, యౌవన మున, కేవలము నమ్మకముపై గ్రహించిన సూత్రములపై నాధారపడుటకంటె, ఈవిధముగ నా జీవితమును నడుపుకొను టలో అత్యధిక విజయమును పొందగలనని నేను గట్టిగా నమ్మి తిని. ఎందుకనగా, ఈప్రయత్నములోనున్న వివిధకష్టములను నేను గుర్తించితిని. కాని ఇవి అతిక్రమింప నశక్యములుగావు; కాక ప్రజలతో ప్రత్యక్ష సంబంధము గలవానిని, మిక్కిలి సామాన్యముగనైనను, సంస్కరించునపుడు మనకెదురగు కష్ట ములతో పోల్చదగినవికూడ కావు. ఒకసారి కూల్చబడెనేని, మహాసంస్థలను మరల నిలుపుట అతికష్టము. ఒకసారి ఉద్రూత లూగింపబడినచో వానిని నిలువుగా ఎత్తియుంచుటయు మిక్కిలి కష్టమే. మరియు నట్టివాని పతనము సర్వదా విపత్క రము. ఇక వాని లోపము లేవైన నున్న వేని (అట్టి లోపము లనేకములు గలవని మనలను గట్టిగా నమ్మింప వాని బహుత్వ మొక్కటియే చాలును) వానిని నిస్సందేహముగా ఆచారము

మిక్కిలి సరిచేసియే యున్నది. ఇచ్ఛాపూర్వకమగు భావనతో నిశితముగా ఎదుర్కొన నెన్నడును శక్యముగాని అనేకము లగు లోపములను సంపూర్ణముగా తుడిచివేసినది; కొన్నిటిని మనకు తెలియకుండగనే సరిదిద్దినది. గండశిలలపై కెక్కుచు, నిట్రాతిలోతునకు దిగుచు, తిన్నని మార్గము నన్వేషించుట కంటె నిరంతరోపయోగమువలన క్రమముగ స్నిగ్ధములును, విశాలములును అగు పర్వతమార్గముల ననుసరించుట నయమైనట్లు, పర్యవసానమున, తల్లోపనిర్మూలనమున కవసరమగు మార్పుకంటె, ఇంచుమించుగా నెల్లప్పుడును ఆలోపములే సహింపదగినవి.

కావుననే, జన్మచేగాని అదృష్టముచేగాని ప్రజావ్యవహార నిర్వహణమున పాల్గొన నాహూతులుగాకయు, సదాసంస్కరణములకై అన్వేషించు నింపాదిలేని నిర్వ్యాపార వ్యాపారుల నెంతమాత్రము నే నామోదింపజాలను. మరియు నేనటువంటి పొరపాటు వాతబడితి నను సందేహమును దృఢపరచునది సుంతైనను ఈ వ్యాసమందు గలదని తలంచితినేని, నేనెవ్విధమునను ఇచ్ఛాపూర్వకముగ దానిప్రకటన కొప్పుకొనను. సంపూర్ణముగ మదీయములగు పునాదులపై నాధారపడియున్న నా స్వంత అభిప్రాయములను సంస్కరించుకొనుటయే నా ఉద్దేశ్యము. నా పరిశ్రమలవలన నాకు సంతృప్తి కలిగినది. వానినిగూర్చి మీకు నేను వివరించుటకు

ఆ సంతృప్తియే కారణము. అట్లయ్యు అట్టి ప్రయత్నములందు అందరును పాల్గొనవలెనని ఉపదేశించు నిచ్ఛ నాకులేదు. భగవదనుగ్రహము సమృద్ధిగా కలవారు బహుళః ఇంతకంటె అత్యుత్కృష్టములగు యోజనలు గావింతురు. కాని అధిక సంఖ్యాకులకు ఇక్కడ నేను ఉపపాదించునది కూడ ప్రమాదభరితమేమో అని నా భయము. ప్రాతవిశ్వాసములన్నింటి నుండి విముక్తి నందవలె నను సంకల్పము ప్రతివ్యక్తియు చేయదగినదికాదు. మనుష్యులలో అధిక సంఖ్యాకులు క్రింది రెండు వర్గములుగా నేర్పడియున్నారు. అందెవరికిని ఇది తగినసంకల్పము కానేరదు. మొదటివర్గము! వీరుతమశక్తులలో తగని విశ్వాసము కలిగియుందురు ; శీఘ్రముగా తమ నిర్ణయములకు వత్తురు ; తమ ఆలోచనలను క్రమబద్ధము గావించుటకు అవసరమగు నోర్పు వారికుండదు. కావుననే ఈవర్గమువారు పూర్వము వా రంగీకరించిన అభిప్రాయములను సందేహించు స్వాతంత్ర్యమును తీసికొని, క్షుణ్ణమగు రాజమార్గమును వీడినచో, త్వరగా గమ్యస్థానమునకు గొనిపోవు సరియగు త్రోవ కనుగొని అనుసరింపలేరు. ఉపరి అ మార్గమునబడి జీవితాంతము పరిభ్రమించుచు నె యుందురు. రెండవ వర్గము : సత్యాసత్యముల వివేచించు శక్తిలో తమ్మతిశయించువా రున్నారనియు, వారు తమకు బోధింపదగినవా రనియు, తెలిసికొనుటకు కావలసిన బుద్ధి, లేక వినయము వీరికి కలదు. అట్టి వీరు ఇతరుల అభిప్రాయములతోడనే తృప్తివహించుట

యుక్తము; స్వప్రయత్నములలో వానిని సరిచేయ యత్నింపరాదు. ఇక నా విషయము: కేవలము ఒకే ఉపాధ్యాయునివలన విద్య నేర్చుకొని యున్నను, లేక, అనాది కాలమునుండియు మహాపండితులలో నున్న అభిప్రాయభేదములను ఎన్నడు ఎరిగి యుండకపోయినను, నేను నిస్సందేహముగా రెండవవర్గమునకు చెంది యుండవలసినవాడనే, కాని, ఎంతటి అవిశ్వసనీయము, ఎంతటి అసంగతము అయిన అభిప్రాయము నూహించినను, అది ఎవరో ఒక దార్శనికునిచే ప్రతిపాదింపబడియే యున్నదని కళాశాలాజీవితమందుండు నాటికే నాకు తెలిసినది. మనకు జుగుప్సాకరములుగ కాన వచ్చు నభిప్రాయములు కలవా రందరు, తత్కారణమున బర్బరులును, అడవిమనుష్యులును కారనియు, పైగా, వారిలో అనేక జాతులవారు, మనకంటె ఎక్కువగా కాకపోయినను కనీసము సమానముగనైనను తమ బుద్ధి నుపయోగించుచునే యున్నారనియు, తరువాత నా పర్యటనలలో గమనించితిని. బాల్యమాదిగ ఫ్రాన్సుదేశమందో లేక, జర్మనీదేశమందో, పెరిగిన వ్యక్తి నడత ఒకతీరున నుండును. ఆ వ్యక్తియే, బాల్యమాదిగ చైనాదేశస్థుల మధ్యనో లేక మనుష్యాశను లగు అడవి మనుష్యుల మధ్యనో పెరిగినచో, అతని నడత మరొక తీరున నుండును. పదేండ్లక్రితము మనకు సంతోష జనకములైన దుస్తులవైఖరి ఈ క్షణమున సంతోషదాయకము కాకపోవచ్చును; విపరీతముగను, పరిహాసాస్పదము

గను, గన్పట్టవచ్చును. అట్టి పదేండ్లు గడువక ముందే ఆను కూల్యమును సంపాదింపగల దుస్తులు, ఇప్పుడు విపరీతములుగ పరిహాసజనకములుగ నుండవచ్చును. ఇట్లు మనలను ప్రోత్స హించుశక్తి నిశ్చితజ్ఞానమునందు కంటె ఎక్కువగా, ఆచా రమునందును, ఉదాహరణమునందును గలదని నేను గ్రహించి తిని. మరియు, మన అభిప్రాయముల కాధారము అట్టిది. అయినను, బహుజనసమ్మతియందు సత్యము తప్పక ఉండు నని అనరాదు. ఎందుకనగా: అట్టి సందర్భములయందు బహుజనులుగాక ఒక్కడే సత్యమును కనుగొనుట ఎక్కుడు సంభావ్యము. ఎటులైనను, గ్రాహ్యములగు నభిప్రాయములు గల వ్యక్తిని జనసమూహమునుండి గైకొనలేకపోయితిని. కావున, నా జీవితమును నడపుకొనుటలో నాబుద్ధినే ఉపయో గింప నావశ్యకమాయెను.

కాని, ఒంటరిగా చీకటిలో నడచుచున్నవానివలె, మెల్లగను ముందువెనుకలు చూచుకొనుచు, నడచుటకు నిశ్చ యించుకొంటిని. అందువలన, బహుదూరము పోలేకపోయి నను, కనీసము, పడకుండనైన నన్ను నేను రక్షించుకొనగలను. వివేకముచే ప్రవేశపెట్టబడక, నామనస్సులో స్థిరీకృతములై యున్న యభిప్రాయములలో నెద్దానినిగూడ వెంటనే వదలుట కైనను నే నిష్టపడలేదు. శిథిలగృహములలో నివసించువారు, దాని స్థానమున మరొక ఇంటికి ప్రణాళిక వేయువరకు, ఆ

మొదటి యింటిని పడగొట్టబోరు. అట్లే మొదట నేను ప్రారంభింపనున్న ప్రణాళికనుగూర్చి యోజించుటకును, నిజమైన పద్ధతిని, అనగా నామనస్సు గ్రహింపగలిగినంతదనుక సమస్త వస్తు జ్ఞానమునకును నాకు మార్గదర్శకము కాగలదని నేను విశ్వసింప దగినదానిని, అన్వేషించి నిశ్చయించుకొనుటకును నాకు కాలవ్యవధి కావలెను.

యౌవన ప్రారంభదశలో దర్శనశాస్త్రశాఖలయందు తర్కమును, గణితశాస్త్ర శాఖలలో రేఖాగణిత విశ్లేషణమును, బీజగణితమును కొంచమభ్యసించితిని; ఈమూడుకళలు, లేక, శాస్త్రములు నా ఉద్దేశ్యమునకు కొంత దోహదము చేయవలసినవే. కాని, విచారింపగా, తర్కశాస్త్ర న్యాయములు తదితర బహుళ బోధలు, అజ్ఞాత విషయ పరిశోధనమునందు కంటె, జ్ఞాతవిషయములను ఇతరులకు తెలియజేయుటయందును, లేదా 'లల్లీ' యొక్క కళవలె, మనకు తెలియని వస్తువులనుగూర్చి, నిర్ణయరహితముగా మాటలాడుటయందును ఎక్కువగా పనికివచ్చును. ఈశాస్త్రము సరియగు, మిక్కిలి చక్కని, బోధలు కలిగి యున్నదైనను, వానితోపాటు అనేకములైన అపాయకరములగు, లేదా అనావశ్యకములగు, బోధలను కలిగి ఉండుటచే, అసత్యవిషయములను సత్యవిషయములనుండి విడదీయుట, మోటయిన పాలరాతినుండి ఒక 'డయానానో' లేక 'మినర్వా' నో వెలికితీయునంతగా దాదాపు

కష్టము. ఈ ప్రాచీనుల విశ్లేషణయు, ఆధునికుల బీజగణిత మును: అవి అత్యున్నతములగు అమూర్తవిషయములను, ఉపయోగము లేనట్టి బాహిర విషయములను ఆకళించు కొనును. అంతేకాక, అందు మొదటిది ప్రత్యేకించి రేఖా చిత్రముల పర్యాలోచనకే సీమాబద్ధమగుటచే భావనాశక్తిని మిక్కిలి అలయింపక, అర్థగ్రహణాశక్తిని ప్రవర్తింపనీయదు. ఇక రెండవది: అయ్యది కొన్ని నిబంధనలకును, ఆవశ్యకతల కును సంపూర్ణముగా లోబడియుండును. అందువలన మనస్సును అభివృద్ధిపరచుటకు సహాకరించు శాస్త్రమునకు బదులుగా, మనోగతిని అడ్డగించునట్టి అస్పష్టమును, క్లిష్టమును అగు కళయే పర్యవసించుచున్నది. ఈ యోజనలచే, ఈమూడింటి లాభ ములును గలిగి, వానిదోషములనుండి విడివడిన పద్ధతిని మరొక దాని నన్వేషింప ప్రోత్సహింపబడితిని. శాసన బహుళత్వము తరచు న్యాయనిరోధకమగును. కావున, కొలది శాసనములు మాత్రమే కలిగి, వానిని కఠినముగా ఆచరణలోనికి తెచ్చిన రాష్ట్రము చక్కగా పరిపాలింపబడును. ఆ విధముగనే తర్క శాస్త్రనిర్మాణమునకు ఉపకరించిన అతిసంఖ్యాకములగు బోధ లకు బదులుగా, ఈక్రింది నాల్గునియమములును నాకుచాలునని నేను నమ్మితిని. దీని కొక నియమము: ఎప్పుడును, ఒక్క పర్యాయముకూడ వాని ననుసరించుటలో అశ్రద్ధచేయను అను దృఢమును అచంచలమును అగు నిశ్చయమును చేసికొనవలెను.

నాకు స్పష్టముగా సత్యమని తెలియని దానిని దేనిని సత్యముగా, నే నెన్నడు పరిగ్రహింపను, అనునది మొదటిది. అనగా తొందరపాటును, పక్షపాతమును కచ్చితముగా విడనాడుట; మరియు సందేహాస్పదమగున దంతయు త్రోసిపుచ్చి, నామనస్సునకు స్పష్టముగను, విశదముగను తట్టినవానిని తప్ప మరెద్దానిని నా నిశ్చితాభిప్రాయమునందు చేర్పకుండుట.

నేను పరీక్షించుచున్న చిక్కులలో ఒక్కొక్కదానిని, తత్సముచిత పరిష్కారమున కవసరమగు నన్ని భాగములుగ, విభజించుట అనునది రెండవది.

ఒకదానివెంట ఒకటిగా, మెట్లెక్కినట్లు కొంచెము కొంచెముగా, క్లిష్టతరవిషయములను గూర్చి తెలిసికొనుటకు, మిక్కిలి సులభములును, సరళములును అగువానితో ప్రారంభించి నా ఆలోచనలను ఒకక్రమములో నుంచుటయు, అట్లు చేయుటలో స్వభావమునందే, పూర్వాపరక్రమరహితములగు వస్తువులకుగూడ ఒక ఆలోచనాక్రమమును ఏర్పరచుటయు మూడవది.

మరియు: ఎద్దియు విడువబడలేదు అను ఆత్మవిశ్వాసము నాకు గల్గుటకుగాను, ప్రతి సందర్భమునందును పరిగణనము పూర్తిగా చేయుటయు, సమీక్షను సర్వాంకషముగా చేయుటయు అనునది చివరది.

రేఖాగణితజ్ఞులు బహుక్లిష్టములగు నిరూపణలందు గూడ సరళములు, సులభములు అగు దీర్ఘహేతువాదపరం పరలను ఉపయోగింతురు. మనుష్యయోగ్యములైన జ్ఞాన విషయములన్నియు పరస్పరసంబంధము కలిగియున్నవనియు, సత్యమునకు బదులు, మనము, అసత్యమును పరిగ్రహించుట మాత్రము మానివేసి, ఒక సత్యమును మరొకసత్యమునుండి అనుమానించుట కవసరమగు పద్ధతిలో మన ఆలోచనల నెల్లప్పుడు పదిలపరచుకొనినచో, మన అందుబాటునకు దూరముగను, మన మన్వేషణము చేయలేనంత ప్రచ్ఛన్నము గను ఏదియు లేదనియు నేను భావించునట్లుగా అవి చేసెను. మరియు, అత్యంతసరళములు, సులభములు అగు వానితో ప్రారంభింపవలెనను ఆలోచనకు ఈవరకే వచ్చినవాడ నగు టచే, ఎద్దానితో ప్రారంభించు టవసరము అను విషయమును నిర్ణయించుటలో నాకు స్వల్పకష్టమే కల్గెను. మరియు శాస్త్ర ములందు సత్యాన్వేషణము చేసిన వారందరిలో గణితశాస్త్ర జ్ఞులు మాత్రమే నిరూపణలను, అనగా నిశ్చితములును, స్పష్ట ములును అగు హేతువులను, కనుగొనగల్గిరని గమనింపగా, వారి పరిశోధనాపద్ధతియు ఇట్టిదే అయిఉండుననను విషయ మున నాకు సందేహము కలుగలేదు. కావున, అతిసాధారణ ములగు వస్తువుల పరీక్షతోడనే ప్రారంభించుటకు సంక ల్పించితిని. సత్యమును ప్రేమించుటయందును, పెంపొం

దించుటయందును, సరికాని హేతువుల నిరసించుటయందును, నా మనస్సు నలవాటు పరచుటకంటె ఇతరమగు లాభము నెట్టానిని ఇందు నే నాసింపలేదు. కాని, ఇందు నిమిత్తముగా గణితశాస్త్రము అను పేరిట సామాన్యముగా వ్యవహృత మగు ప్రత్యేక శాస్త్రము లన్నిటి సాధనకై ప్రయత్నించు నుద్దేశము నాకు లేదు. కాని, వాని విషయము లెంత భిన్నములై యున్నను, తద్విషయగత వివిధ సంబంధములను, లేదా, నిష్పత్తులను, గూర్చిమాత్రమే ఆలోచించునపుడు, అవి యన్నియు నేకమగుట చూచి, మిక్కిలి సామాన్యమగు రీతిని ఈనిష్పత్తులనుగూర్చి విచారించుట నాప్రయోజనమునకు చాల మంచిదని తలంచితిని. ఈ విచారణలో, సంబంధములయొక్క, లేదా నిష్పత్తులయొక్క జ్ఞానమునకు అత్యంతము సహకరించు వానిని తప్పించి, ప్రత్యేకముగా ఏ విషయములకును ఈ నిష్పత్తుల నన్వయింపను. అందును, అవి న్యాయముగా చెందుటకు వీలగు ప్రతివస్తువర్గమునకు వానిని చెందునట్లు బాగుగా తరువాత చేయగల్గుటకుగాను, వాని నీ వస్తువులకు మాత్రమే సీమాబద్ధము చేసికొను తలంపు నాకు లేదు. ఆపైని, ఈసంబంధముల నర్థముచేసికొనగల్గుటకు గాను, కొన్నిసారులు వాని నొకదాని తర్వాత నొకటిగా పర్యాలోచింపవలయు ననియు, కొన్నిసారులు వానిని మనస్సులో ధారణ మాత్రమే చేయవలెననియు, లేదా,

వానిని సమష్టిగా ఆకళింప చేసికొనవలెననియు తెలిసికొని, నైయక్తికముగా వానిని సమగ్రాలోచన చేయుటకు, అంత కంటె సాధారణ వస్తువులను నేను కనుగొనలేకపోవుట వల నను, అంతేకంటె నాభావనకును ఇంద్రియములకును విశద ముగా ఉపపన్నములైన విషయములు లేనందువలనను, సరళ రేఖలమధ్య మాత్రమే ఆ సంబంధము లున్నట్లుగా చూడవలె నని తలంచితిని; మరియు వేరొక్కపక్క వానిని స్మృతిలో నుంచుకొనగల్గుటకును, లేదా, పెక్కింటి సమష్టిని ఆకళించు కొన గల్గుటకును, వీలైనంత సంక్షిప్తములైన కొన్ని విశిష్ట చిహ్నములద్వారా, వానిని వ్యక్తము చేయవలెనని తలంచి తిని. ఈవిధముగ, రేఖాగణిత విశ్లేషణలోను, బీజగణితము లోను, ఉన్న శ్రేష్ఠమగు విషయమంతయు సంగ్రహింపగల్గెద ననియు, ఒకదానిలోని దోషములను రెండవదాని సాహాయ్య మున దిద్దగలననియు. నమ్మితిని.

మరియు, వస్తుతః, ఈ కొలదిబోధలను సరిగా అవలం బించుటవలన, వాని పరీక్షకై వినియోగించిన రెండుమూడు నెలలలో, అదివరకు అతికష్టములని తలంచిన ప్రశ్నలకు సమా ధానమును పొందుటయే కాక, అటుతరువాతకూడ నాకు. సమాధానము లభింపకుండ నుండెడి ప్రశ్నలకు కూడ సమా ధానములను నిర్ణయింపనగు సాధనములను కనుగొనగల్గితిని.

అతి సాధారణములును, అతిసామాన్యములును అగు సత్యము లతో నేను ప్రారంభించినందువలననే, కనుగొనిన ప్రతి సత్యమును తరువాతి వానిని కనుగొనుటలో ఒక నిబంధ నగా ఉపలబ్ధమైన దను సందర్భమునకే ఈ ఫలితముల నారో పింపవచ్చును.ఏ ప్రత్యేకాంశమునకు సంబంధించిన సత్యమైనను ఒకటియే యై యుండును. కావున, ఆ సత్యమును గ్రహిం చినవాడు, ఆ యంశముపై తెలిసికొనుటకు వీలైనదంతయు తెలిసికొనును అను నంశము గమనింపబడనిచో, ఇందులో నేనెక్కుడుగా అహంకారినైనట్లు బహుశః కన్పట్టును. ఇందుల కొక యుదాహరణము: సంఖ్యాగణిత మూలసూత్రములు బోధింపబడిన యొక బాలుడు, నిబంధన ప్రకారముగా ఒక ప్రత్యేకమగు కూడిక చేసెనేని, ఆ సంఖ్యల కూడికకు సంబం ధించినంతవరకు, ఈ దృష్టాంతములో మానవప్రతిభ కందు బాటులో నున్నదంతయు పొందినాడని నమ్మకముగా వానికి చెప్పవచ్చును. ఇక, పర్యవసానమున, సరియైన క్రమము నను వర్తించుటయును, అన్వేషిత వస్తువుయొక్క స్థితిగతుల నన్ని టిని తు.చ. తప్పకుండ పరిగణించుటయును బోధించుపద్ధతిలో సంఖ్యాగణిత నిబంధనలకు నిశ్చితవిశ్వాసము నిచ్చునదంతయు నంతర్గతమే.

కాని, నిర్విశేష పరిపూర్ణతతో కాకపోయినను, కనీసము నాకు లభించుటకు వీలగునంతటి సంపూర్ణతతో

నైనను, అన్ని విషయములందును నాబుద్ధిని ప్రవర్తింప జేయు గలను అను విశ్వాసమే ఈ పద్ధతివలన నాకు గలిగిన తృప్తికి ముఖ్యకారణము. పైగా, దాని యుపయోగముచే, నామనస్సు క్రమముగా, విషయములయొక్క స్పష్టతర విశదతర భావనలకు అలవాటుపడుచున్నదని తోచెను. మరియు, నేను ప్రత్యేకమగు నేవిషయమునకు ఈపద్ధతిని క్రమాబద్ధము చేయనందున దానిని, బీజగణితసఫలతకు తీసిపోని సఫలతతో, ఇతర శాస్త్ర క్లిష్టతలకు గూడ అనువర్తింప నాశించితిని. ఎట్లైనను, ఈనిమిత్తముగా, శాస్త్రములలో నన్నెదుర్కొనిన క్లిష్టతల నన్నిటిని తత్క్షణమే పరీక్షించుటకు సాహసింపరాదు కదా! ఎందుకనగా అది పద్ధతియందు నిర్ణయింపబడిన క్రమమునకు విరుద్ధ మగును. కాని, దర్శన శాస్త్రమునుండి గైకొనబడిన సూత్రములపైనే అట్టివాని జ్ఞాన మాధారపడి యుండునని గమనించి, ఆ దర్శన శాస్త్రమందు సునిశ్చితమైన దేదియు నాకు దొరకనందున ప్రప్రథమముగా తత్సూత్రముల నే స్థాపించుటకు ప్రయత్నింప నవసరమున్నదని తలంచితిని. అదియునుగాక, ఇతరములగు పనులన్నిటికంటె ఇట్టి గవేషణయే అత్యధికముగా ప్రస్తుతమనియు, తొందరపడి నిర్ణయములకు వచ్చుటయు, నిర్ణయములకొరకెదురు చూచుటయు నిందుభయజనకములనియు, గమనించితిని కావున పరిణత వయస్కుడ నగువరకు (అప్పటికి నా వయస్సు ఇరువదిమూడేం

డ్లగుటచే) దాని దరి కేగకూడదని తలంచితిని. మరియు, ఆ క్షణమువరకు పరిగ్రహించిన తప్పుడు అభిప్రాయముల నన్నిటిని నామనస్సునుండి నిర్మూలము చేయుటతోపాటు, నాయుక్తులకు విషయములను స్వీకరించుటకుగాను వివిధములగు అనుభవములను సంగ్రహించుటకును, దానిని అనువర్తింప జేయుటలో అధికతర సామర్థ్యమును దృష్టియందుంచుకొని, నేనెంచుకొనిన పద్ధతిలో నిర్విరామముగా నన్ను నేను ప్రవర్తింప జేసికొనుటకును, మొట్టమొదట నాకుగల కాలములో అధికభాగమును కార్యసన్నాహమున వినియోగించితిని.

---

# తృతీయ భాగము

మనము నివసించుచున్న గృహమును తిరిగి కట్టనారంభించుటకు ముందుగా, దానిని పడగొట్టుటయు, సామగ్రిని, కట్టువారిని సిద్ధముచేసికొనుటయు చాలదు; ముందుగా మనము జాగరూకతతో తయారు చేసికొనిన నమూనా ప్రకారము, మనమే స్వంతముగా పనిలో దిగుటయు చాలదు. ఈ వ్యవహారమంతయు జరుగుచుండగా మనము సావకాశముగా నుండ వేరొక యిల్లుండుటకూడ అవసరమే. అట్లే తాత్కాలికముగా నానిశ్చితాభిప్రాయములను ఆపుటకు నాబుద్ధి నన్ను నిర్బంధించియుండగా, నాపనులలో నేను అస్థిర సంకల్పుడనై యుండకుండుటకును, అటుపై నిగూడ సాధ్యమగునంతవరకు ఆనందమయమగు జీవితమును ఆతంకరహితముగా గడపగల్గుటకును, సామాన్యసత్యములు మూడు నాల్గింటిచే నిర్మింపబడిన తాత్కాలిక నైతిక నిబంధనలను ఏర్పరచుకొంటిని. వానిని మీకు పరిచయము చేయవలెనని నా కోరిక.

ఈశ్వరానుగ్రహమున బాల్యమునుండియు, నేను శిక్షితుడనైన ధర్మమును అచంచలముగా అవలంబించుచు, నా దేశముయొక్క శాసనములకును సంప్రదాయములకును విధేయుడనై యుండుట మొదటిది. మరియు, నాచుట్టు నివసించువారిలో మిక్కిలి మేధావులగువారి ఆచరణయందు

సామాన్యముగా ఉదాహరణ యోగ్యములగునట్టియు, 'అతి' నుండి సుదూరముగా వేరుచేయబడినట్టియు, అత్యంతము మితములగునట్టియు అభిప్రాయముల ప్రకారము నదితరవిషయములందు నాప్రవర్తనను క్రమబద్ధము చేసికొందును. ఎందుకనగా, నా అభిప్రాయములనన్నిటిని పరీక్షింపగోరితిని కావున, ఆ సమయమునుండియు వానిపై నే నాధారపడ నుద్దేశింపలేదు. కావున మిక్కిలి విశ్వసనీయులగు వారి అభిప్రాయముల ననుసరించుటకంటె శ్రేయసమగున దెద్దియు ఈలోగా నేను చేయలేనని విశ్వసించితిని; పరిషియా, చైనా దేశీయులలోగూడ బహుశః మనలో నున్నట్లుగనే ఇటువంటి విశ్వసనీయులున్నను, నే నెవరిమధ్య నివసింపవలయునో వారి యభిప్రాయముల కనుగుణముగానే నాఆచరణను నియంత్రితముచేసికొనుట యుక్తతరమని నాకు తోచెను. మరియు అట్టివారి వాస్తవికాభిప్రాయములను నిశ్చితముగా కనుగొనుటకు వారు చెప్పుచున్నదానిని గాక, వా రాచరించుచున్నదానినే నేను యోజనలోనికి తీసికోవలసినదిగా నాకు తోచెను. కారణము, మన మనఃకశ్మలమువలన తాము నమ్మిన దాని నంతటిని వ్యక్తముసేయుట కిష్టపడువారు కొలదిమంది ఉండుటయేకాక, వాస్తవముగా తా మేమి నమ్ముచున్నారో ఎరుకలేనివా రనేకులు గలరు. ఎందుకనగా: ఒక వస్తువును నమ్ముటలోనున్న మానసిక వ్యాపారము వేరు. మనము నమ్ముచున్నామని తెలిసికొనుటలోనున్న మానసికవ్యాపారము వేరు. ఈ రెండు

వ్యాపారములును భిన్నములు కావున ఒకటి లేకుండగనే, రెండవది తరచుగా ఉపలబ్ధమగుచున్నది. మరియు, సమానముగా గౌరవింపబడుచున్న వివిధాభిప్రాయముల నుండి నే నెల్లప్పుడును అత్యంతము మితముగా నుండువానినే యెన్నుకొంటిని. కారణము: ఆచరించుటకు కివి యెల్లప్పుడును అతి సుకరములు; బహుశః అత్యుత్తమములు; (అతిమాత్ర మంతయు సామాన్యముగ ప్రమాదకరమే కావున) ఇంతేకాదు. నేను పొరపడుట సంభవించినచో, అతిమాత్రములలో ఒకదాని నెన్నుకొని తరువాత నా ఎన్నికలో పొరపడితినని కనుగొనినప్పటికంటె అట్టి యెన్నికవలన సత్యమున కనతిదూరములో ఉండగలను. మన స్వాతంత్ర్యమును ఎవ్విధముననైనను సంకుచితపరచు ఒప్పందముల నన్నిటిని అతిమాత్రముల వర్గములోనే చేర్చితిని. ఇట్లనుటచే నాకు శాసనముల యెడ నిరసనభావము కలదని తలంపరాదు. మన దృక్పథము నందున్న విషయము మంచిదైనప్పుడు, దుర్బలమనస్కులను అస్థిరత్వమునుండి రక్షించుటకై కొన్ని శపథములను గాని, ఒడంబడికలను గాని అనుమతించు శాసనములపట్ల గాని, సదుద్దేశము అను ప్రశ్నయే జనింపని వాణిజ్యవ్యవహారములను సంరక్షించుటకై అట్టి ఒడంబడికల ననుమతించు చట్టముల పట్లగాని నాకు నిరసనభావములేదు. కాని మార్పునకు లోనుగానిదేదియు భూమిపై నేను చూడనందునను, నా నిశ్చితాభిప్రాయములను శిథిలములు గాకుండ, క్రమముగ, నిర్దోషము

లుగ చేసికొనుటయందు నిమగ్నుడనై యున్నందునను, ఏదైన ప్రత్యేకసమయమున నా సమ్మతిని బడసిన దను కారణముచే ఒక దానిని తరువాతకూడ – బహుశః శ్రేష్ఠత్వమును గోల్పోయిన తరువాత, లేదా, దానిని అట్లు నేను గణించుట మానిన తరువాత, కూడ – శ్రేష్ఠముగా నెంచుట సద్బుద్ధిపట్ల ఘోరమగు అపరాధమని నేను తలంచితిని.

నా కార్యములలో, శక్తి గలంతవరకు అచంచలుడుగను, దృఢసంకల్పుడుగను ఉండుటయు, ఒకసారి గ్రహింపబడిన పిమ్మట, సందేహాస్పదములైన అభిప్రాయములను కూడ, సునిశ్చితములవలెనే, సరియగు స్థైర్యముతో అవలంబించుటయు నా రెండవ సూత్రము. అడవిలో దారితప్పిన బాటసారులు – వారి ప్రప్రథమ వరణమును బహుశః నిర్ణయించినది కేవలము యాదృచ్ఛిక సన్నివేశమే అయినను – ఇటునటు తిరుగుటయు, ఒకచోట నిల్చియుండుటయు మాని, స్వల్ప కారణములకు తమ మార్గమును మార్చుకొనక, వీలగునంత తిన్నగా, ఎచటను ఆగకుండ పోవలయును. ఈ బాటసారుల యుదాహరణమే ఇట నాకు అనుసరణీయము. ఎందుకనగా, వారీమార్గము ననుసరించినచో, సరిగా తాముకోరిన ప్రదేశమునే చేరలేకపోయినను, అరణ్యమధ్యమున నుండుటకంటె, బహుశః మేలైన ప్రదేశము నేదో ఒకదానినైనను, కనీసము, చివరకు చేరగలరు. ఈ విధముగనే తరచు జీవితమునందలి

పనులలో ప్రత్యక్ష జీవితమందు కార్యావసరములపట్ల ఆలస్యము సమ్మతము కాదు. కావున, సర్వథా సత్యమెద్దియో మనము నిర్ణయింపలేనప్పుడు, అత్యంత సంభావ్యమైన దాని ప్రకారమే మన మాచరింపవలసియుండుట సునిశ్చితము; మఱియు ఒక అభిప్రాయములోకంటె మఱొక అభిప్రాయములో మనము హెచ్చు సంభావ్యతను గమనింపక పోయినను, ఏదియో ఒక దానిని మనము ఎంచుకొనవలసినదే. తరువాత, ఆచరణకు సంబంధించినంతవరకు దానిని నిస్సంశయముగ, స్పష్టముగ, సత్యము, నిశ్చితము అని పరిగణింపవలెను. ఎందుకనగా, ఈ వరణమును నిర్ణయించిన మనబుద్ధి ఈ గుణమును గలిగియున్నది. స్పష్టము, నిశ్చితము అగు వరణసూత్రములేక, ఒకనాడు ఒక మాదిరి కార్యాచరణము శ్రేష్ఠమని అవలంబించుటకును, మరునాడు దానినివీడి తద్విరుద్ధము శ్రేష్ఠమని అవలంబించుటకును, తమకుదామై పాల్పడు, బలహీనచంచల మనస్కులయొక్క ధర్మాధర్మవివేచనాబుద్ధిని మామూలుగా ఆందోళనపరచునట్టి పశ్చాత్తాపపరివేదన లన్నిటినుండియు నన్ను నేను విముక్తుని చేసికొనుటకు ఈ సూత్రము పర్యాప్తమాయెను.

మనకు బాహిరములగు వస్తువులపట్ల చేతనైనంత బాగుగా మనము వర్తించిన పిమ్మట, మనకు జయము లభింపనిచో అది మన లోపముకాదు అని తెలిసికొనుటకై అదృష్ట

మునుగాక నన్ను నేనే జయించుకొనుటకును; జగద్వ్యవస్థను గాక, నా ఇచ్ఛలనే నేను మార్పుచేసికొనుటకును, మన స్వంత ఆలోచనలుగాక మరేదియు సంపూర్ణముగా మనశక్తిలో లేవని విశ్వసింప నలవాటుపడుటకును, ఎల్లప్పుడు ప్రయత్నించుట నామూడవసూత్రము; నేను పొందజాలని దాని నెద్దానిని భవిష్యత్తులో నేను కోరకుండ నన్ను నిరోధించి, తనన్నాళ్లముగా నన్ను తృప్తుని గావించుటకు ఈయొక్క సూత్రమే పర్యాప్తమై కన్పట్టెను. ఎందుకన: ఏదో ఒక విధమున ఉపలబ్ధి సాధ్యములుగా మన యొరుకచే ప్రస్థాపితములైన విషయములను మాత్రమే మన ఇచ్ఛాశక్తి సహజముగా అన్వేషించును గావున, సమస్త బాహ్యవస్తువులును సమానముగనే మనశక్తి కతీతములని పరిగణించినచో, నైనా లేక మెక్కికో రాజ్యములు మన ఆధీనమున లేనందువలన మనమెట్లు విచారింపమో, అట్లే మన తప్పేమియు లేకయేపోయినచో మన జన్మస్వత్వములుగా చూపట్టు వస్తువుల లేమికికూడ ఎక్కువగా మనము విచారింపమనుట తెల్లము. మరియు, ఆవశ్యకతనే గుణముగా చేసికొని, వజ్రములవలె అచ్ఛేద్యములగు దేహములనుగాని, పక్షులవలె ఎగురుటకు రెక్కలనుగాని ఇప్పుడు కోరనియట్లే, రోగమం దారోగ్యమునుగాని, కారాబంధమునందు స్వాతంత్ర్యమునుగాని కోరము. అయినను ఈ భావమునే అన్ని పరిస్థితులందును దృఢముగా అవలంబించుటకు దీర్ఘమగు క్రమశిక్షణయు, తరచుగా, మననము చేయుటయు

అవసరమని ఒప్పుకొనుచున్నాడను. మరియు విధి ప్రభావమునుగూడ నధిగమింప శక్తులై, దుఃఖదారిద్ర్యములలో నున్నను, దేవతలతోకూడ పోటీపడదగిన ఆనందము ననుభవించిన ప్రాచీనదార్శనికుల శక్తిరహస్యము ముఖ్యముగా ఇందులోనే ఇమిడియున్నదని నమ్ముచున్నాడను. ఎందుకనగా: స్వభావముచే, తమశక్తికి నిర్ణయింపబడిన సీమలను గూర్చి నిర్విరామచింతనామగ్నులై యున్నవారు తమ స్వాధీనమందు తమ ఆలోచనలు తప్ప మరేమియు లేవని పూర్తిగా నమ్ముటవలన, ఈ విశ్వాసమే వారు మరే యితర విషయములను కోరకుండ ఆపుటకు చాలినదాయెను; మరియు, స్వభావముచేతను, విధిచేతను ఎంతగా అనుగ్రహింపబడినను, సమస్తేచ్ఛాపూర్తిని ఎన్నడును స్వాయత్తము చేసికొనలేని దర్శనరహితులగు తదితర మానవులకంటె, తమ ఆలోచనలపై అద్వితీయమగు నాధిపత్యమును సంపాదించుకొనిన దార్శనికులు, తమ్ము ఎక్కువ శక్తిమంతులుగ, ఎక్కువ స్వతంత్రులుగ, ఎక్కువ సౌఖ్యవంతులుగ భావించుకొనుట కొంతవరకు సహేతుకమే.

తుదకు, ఈనైతికచట్టమును పరిసమాప్తముచేయుటకై, జీవితమునందు మనుష్యులవలంబించు వివిధములగు వృత్తులయందుత్తమోత్తమమగు దానిని ఎంచుకొను దృష్టితో, వానిని సమీక్షింపదలచితిని. మరియు, ఇతరవృత్తులగూర్చి

యేమియు నభిలషింపకుండ నేను నిమగ్నుఁడనై యున్న దానినే కొనసాగించుటకంటె మేల్తరమగు దానిని చేయఁజాల నని తలంచితిని. అనగా: నాజీవితమంతయు నా వివేకము నభివృద్ధి పడుప వినియోగించుటకును, స్వయంనిర్ణీతమగు నాపద్ధతి కను గుణముగ, సాధ్యమగునంతదనుక సత్యమును తెలిసి కొనుటయందు పురోగమించుటకును అనుట. ఈపద్ధతి నుప యోగింప నారంభించినది మొదలు, నేనెంతో సంతృప్తి నను భవించితిని. అంతకంటె మధురతరము, పవిత్రతరముఅగు సంతృప్తి ఈ జీవితమున లభ్యమగునన నేను నమ్మను. ఆ పద్ధతి వలన ప్రతిదినము కొన్నిసత్యములను కనుగొనువాడను. ఇతరులు సామాన్యముగా వానిని గణింపకున్నను నా కవి చాలినంత ప్రధానములుగనే తోచెడివి. దానివలన గలిగిన సంతృప్తి నా మనసంతయు నాక్రమించినది. దానితో నుపమింప నన్యములెవ్వియు గణనీయములుగా తోపలేదు. పైగా, ముందుచెప్పఁబడిన బోధత్రయము ఆత్మశిక్షణ కార్యమును కొనసాగింపవలె నను కేవలోద్దేశ్యముపైనే స్థాపింపబడెను. అసత్యమునుండి సత్యమును వివేచించుటకు మనలోప్రతివానికిని ఈశ్వరుడుకొంత బుద్ధిప్రకాశమును ప్రసాదించినాడు కావున, ఇతరుల యభిప్రాయములతో తృప్తిపడుచు ఒక్కక్షణకాలము గూడ నే నుండవలెను అని నేను నమ్మలేకపోయితిని. తగు సమయమున, వారి యభిప్రాయములను పరీక్షించుటయందు నానిశ్చయక బుద్ధిని వినియోగించు దృష్టి నా కున్నప్పుడు

మాత్రము, ఇతరుల అభిప్రాయములతో తృప్తిపడుచుంటిని. వాని నట్లంగీకరించుటలో, అంతకంటె ప్రశస్తతరములగు నభిప్రాయములను – అట్టివి యున్నచో – కనుగొను నవకాశమును పోగొట్టుకొందునని నేను భావించినచో సందేహరహితుడనై నే నుండలేకపోయెడివాడను. ఎంతటిజ్ఞానసంపాదనకు నేను సమర్థుడనో, ప్రశస్తతరములగు వస్తువుల నెన్నిటిని పొందనాకు శక్తిగలదో, అంతటి జ్ఞానమును, అన్నివస్తువులను నేను పొందుట సునిశ్చితముగావించు మార్గమును నే ననుసరింపనిచో, నా యభిలాషను అరికట్టుకొనుటకుగాని, తృప్తుడనుగా నుండుటకుగాని, నేను సమర్థుడనుగాక పోయెడివాడనే. మన తెలివి, మంచిదనియో చెడ్డదనియో, వివరింపనంతవరకు, మన మే వస్తువును కోరుట గాని, వర్జించుట గాని చేయముగాన, ఉచితాచరణకు ఆవశ్యకమైనదంతయు ఉచితమగు నిశ్చాయకబుద్ధి మాత్రమే. మరియు, అత్యంతము ఉచితమగు నాచరణకు, మిక్కిలి సరియైన నిశ్చాయకబుద్ధి మాత్రమే అవసరము. నిజముగా విలువైనట్టియు, మన అందుబాటులో నున్నట్టియు, ఇతరవస్తువు లన్నిటితోపాటు, సర్వసుగుణ సముపలబ్ధికి ఇదియే చాలును. మరియు, అట్టి సముపలబ్ధి యున్నదను దృఢవిశ్వాసము మనలను తృప్తులను చేయక మానదు.

ఇట్లీ నైతికబోధలమీద సునిశ్చితుడనై, నా విశ్వా

సములో ఎల్లప్పుడును ప్రథమస్థానము నాక్రమించిన మత సంబంధి సత్యములతో పాటు, దానినికూడ ఒకవంక నుంచు కొని, ఇక నా అభిప్రాయములలో మిగిలిన వానిని స్వేచ్ఛగా వదలుకొనవచ్చునను పర్యవసానమునకు వచ్చితిని. నాకీ యాలోచనలు గలిగిన విజనావాసములోనే ఇంకను ఎక్కువ కాలము గుప్తముగా నుండుటకంటె ప్రజలతో సంబంధ వ్యవహారములను పెట్టుకొనుటవలననే నే నీ కార్యమును యథ్రపదముగా ముగింపగలనని ఆశించుటచే, శీతకాలము బాగుగా ముగియకముందే తిరిగి పర్యటించుటకు ప్రారంభించి తిని. ఇక తరువాత తొమ్మిదేండ్లలోను ప్రపంచ రంగస్థల ముపై ప్రదర్శింపబడుచున్న జీవితనాటకములలో నటుడుగా గాక ప్రేక్షకుడుగా నుండగోరిన వాడనై ఒకచోటినుండి మరొకచోటికి దిమ్మరుట తప్ప మరేమియు నేను చేయ లేదు. మరియు, ప్రతి పరిస్థితియందును సందేహాస్పదముగా తోచునట్టియు, మోసమునకు మూలకారణము కాదగినట్టియు, దానిని గురించి ముఖ్యముగా చింతింప ప్రయత్నించు చుంటిని కావున, నామనస్సులో నిదివరకు ప్రవేశించిన దోష ముల నన్నిటిని క్రమముగా నిర్మూలించితిని. కేవలము సందే హించుటకొరకే సందేహించుచు, అనిశ్చితత్వముకంటె అతీత మైన దెద్దియు అన్వేషింపని స్కెప్టిక్కులను (గ్రీకుదేశమునందలి ఒకానొక దార్శనిక వర్గము) నే నిందులో అనుకరించుట మాత్రము లేదు; ఎందుకనగా: తద్విరుద్ధముగా దృఢనిశ్చయ

మున కాధారమును కనుగొనవలెననియు, కఠిన శిలలను, లేక పాటిమట్టిని పొందుటకుగాను, ఒదులు ఒదులుగానుండు మట్టిని ఇసుకను అవతల పారవేయవలె ననియు, నా యుద్దేశ్యము. నాకు జూడగా ఇందులో నేను సఫలుడ నైనట్లే; ఎందుకనగా: నేను పరీక్షించిన ప్రతిజ్ఞావాక్యముల సత్యరాహిత్యమును లేక నిశ్చయరాహిత్యమును దుర్బలములైన ఊహాలతోగాక, స్పష్టములు, నిశ్చితములు అయిన హేతువులతో కనుగొన ప్రయత్నించితిని కాబట్టి, నిశ్చితమైనదేదియు నందు లేదనునది కేవలము అనుమానము మాత్రమే అయినను, పర్యాప్తనిశ్చయముతో కూడిన ఏదో ఒక నిగమనమును నేను చేయలేనంతగా సంశయాస్పదమైన దేదియు నాకు గన్పట్టలేదు. మరియు, ప్రాతయింటి నొకదానిని పడగొట్టి నప్పుడు పునర్నిర్మాణమున కుపయోగించుటకు సాధారణముగా దాని శిథిలములను భద్రము చేసినట్లే, స్వల్పాధారములు గలవిగ నాచే నిశ్చయింపబడిన స్వాభిప్రాయములను నాశనము చేయుటలో నేను వివిధపర్యవేక్షణాలను, ప్రయోగములను జరుపగలిగితిని. మరియు, అంతకంటె సునిశ్చితములగు నభిప్రాయముల స్థాపించుటకు నా కుపయుక్తమైన అనుభవమునుగూడ చాల గడించితిని. ఇంకను నాకై నేను ఏర్పరచుకొనిన ప్రమాణపద్ధతి నభ్యసించుచునే యుంటిని. ఎందుకనగా, దాని నిబంధనలప్రకారము నా ఆలోచనల నన్నిటిని నడపుటకు సామాన్యముగా శ్రద్ధతీసికొనుటయే గాక, అప్పు

డప్పుడు ఈపద్ధతి నుపయోగించి గణితశాస్త్రములోని చిక్కులను విడదీయుటకును, ఇతర శాస్త్రములకు చెందిన కొన్ని ప్రశ్నలకు సమాధానము వడయుటకును, కొన్ని గంటలను ప్రత్యేకించితిని; కాని ఈ శాస్త్రములలోని పర్యాప్త నిశ్చయములేని సూత్రములనుండి ఈ ప్రశ్నలను నేను విడదీసినంతనే, అవి దాదాపు గణితశాస్త్రీయములుగా చేయబడెను. ఈ సంపుటములోగల అనేకోదాహరణముల * వలన దీని సత్యము వ్యక్తము కాగలదు. ఈ ప్రకారముగ, ఆధర్మము నుండి సుఖమును వేరుచేయుటకు ప్రయత్నించుచు, తమ విశ్రాంతి సమయమును విసువులేకుండ అనుభవించుటకుగాను, అనింద్యములగు వినోదములందు వ్యాసక్తులగుచు, ప్రశాంతముగను, అమాయికముగను, జీవితములను గడపుట తప్ప మరేవృత్తియు లేనివారివలెనే నేనును జీవించుచున్నట్లగుపడుచు, నాఉద్దేశ్యమును అనుసరించుచునే ఉంటిని. మరియు, కేవలము పుస్తకముల ననుసంధానము చేయుటలోగాని, విద్వాంసులతో సంభాషించుటలోగాని, నిమగ్నుడనై యుండిన కలుగగల సత్యముయొక్క జ్ఞానాభివృద్ధికంటె బహుశః ఎక్కువ అభివృద్ధినే పొందితిని.

* "వెలుతురుకు సంబంధించిన శాస్త్రము", "ఉల్కా-శాస్త్రము" "రేఖాగణితము" లను గ్రంథములోని విషయములు. ఉపోద్ఘాతము చూడుడు.

పండితవాద విషయములైన క్లిష్టతలను గురించి ఎట్టి నిశ్చితాభిప్రాయమునకు రాకముందే, సామాన్యముగా ప్రచలితముగా నున్నదానికంటె సూక్ష్మతరమైన ఏదర్శన సూత్రములనుగాని అన్వేషింప ప్రారంభింపక మునుపే, ఈతొమ్మిది సంవత్సరములు ఎట్లో గడిచిపోయినవి. మరియు, పూర్వమెందరో ప్రఖ్యాతపురుషు లీప్రయత్నములను చేసిరి. కాని వారు సఫలులైనట్లు తోపదు. దాని నుదాహరణముగా గైకొనుటచేతనే అది బహుకష్టమగు కార్యమని నేనూహించితిని. కావున నేనివరకే ఈ జిజ్ఞాసను పూర్తిచేసినాడనను బహువ్యాప్తమగు సమకాలీన కింవదంతిని వినియుండకపోయినచో, నేనింతత్వరలో దీనిని ప్రారంభించి యుండెడివాడను గాను. ఈ కింవదంతికి ప్రోద్బలకముగా ఏయాధారములు చూపబడినవో నేనెరుగను. మరియు, నాసంభాషణ దానికేమాత్రముగనైన సహకరించి యుండినచో, దానికి కారణము, నాఅజ్ఞతను స్వల్పజ్ఞులకంటె హెచ్చు నిష్కపటముగా నేను ఒప్పుకొనుటయే అయియుండును. ఇతరులు తథ్యములని నమ్మిన అనేక విషయములు సంశయాస్పదములనుటకు నేను చూపిన హేతువులుగూడ దీనికి కారణములై యుండును. దర్శన ప్రస్థానము నెట్టిదానిని గూర్చిగాని నాచేసిన ప్రజ్ఞావాదము లిందులకు కారణములు గాజాలవు. కాని నిజముగా నున్నది యున్నట్లు గాక వేరు విధముగా నేను శ్లాఘింపబడుట

నాకిష్టము లేదు. కావున నాకు వచ్చిన ప్రఖ్యాతికి యోగ్యుడనగుటకు అన్నివిధముల ప్రయత్నించుట అవసరమని తలంచితిని.

ఇప్పటికి సరిగా ఎనిమిదేండ్లకు పూర్వము ఈ కోర్కె వలన నేనొక తీర్మానమునకు వచ్చితిని. ఆతీర్మాన మిది: పరిచితులను గలియుట కవకాశముగల సమస్తప్రదేశములకు దూరముగా నుండుట: ఈ దేశమునకు తరలుట: ఈ దేశమునకే నేను తరలుటకు గారణము లివి: ఇచ్చట యుద్ధము చాలకాలము జరిగినది. ఈ దీర్ఘయుద్ధము సక్రమమగు శిక్షణ స్థాపింపఁబడుటకు సహాకరించినది. సురక్షితముగా జనులు శాంతిలాభము లనుభవించునట్లు చేయుటయే, శాశ్వతముగా భరింపబడు సైన్యముల ముఖ్యోపయోగముగ జూపట్టుచున్నది. ఈ దేశీయులు చాల చురుకైనవారు. ఇతరుల వ్యవహారములందు కౌతుకము చూపుటకంటె స్వవ్యవహారములందే మిక్కిలి జాగరూకులై యుందురు. ఈ మహాజన సమూహ మధ్యమున, మిక్కుటముగ జనసమ్మర్దముగల మహానగరములలో లభ్యములగు నెట్టి సదుపాయములను గోల్పోకుండ, సుదూరములగు నెడారులయందువలె ఏకాకిగను, ఉపహ్మాత వ్యవహారుడుగను, నేను జీవింప శక్తుడనైతిని.

* Hollard ఇచటి కాతడు 1629 లో వెళ్ళెను. ఉపోద్ఘాతము చూడుడు.

# చతుర్థ భాగము

అచ్చట నేను చేసిన ప్రథమ మననములను గూర్చి చెప్పుటకు సంశయించుచున్నాడను. ఎందుకనగా : సామాన్యముగా ఇవి ప్రతి వ్యక్తియు నంగీకరింపలేనంతగా ఆధ్యాత్మికములు, అసాధారణములును. అట్లయ్యు, నేను చేసిన పునాదులు తగినంత సురక్షితముగా ఉన్నదియు లేనిదియు నిశ్చయించుటకు అవి అవసరము గావున వానిని గూర్చి ప్రసంగించుటకంటె నాకు మార్గాంతరములేదు. ఇదివరకే చెప్పబడినట్లు, అత్యంతము అనిశ్చితములని మనము గ్రహించిన అభిప్రాయములనుగూడ, వ్యవహారమునకు సంబంధించినంతవరకు, కొన్నిసారులు సంశయాతీతములుగా అవలంబించుట అవసరమని నేనిదివరకెప్పుడో గమనించియుంటిని; కాని నాశ్రద్ధను కేవలము సత్యాన్వేషణకే అప్పు డుపయోగింపదలచితిని. అందుచే సరిగా తద్విరుద్ధపద్ధతియే నాకు ఆవశ్యకమైనది. అటుతరువాత నావిశ్వాసములలో పూర్ణముగా నిస్సంశయమైన దేమైనను ఉన్నదో లేదో నిశ్చయించుటకుగాను, కొంచెమైనను సంశయాస్పదములని అనుకొనుటకు వీలైన అభిప్రాయములన్నిటిని త్రోసివేయ తలంచితిని. తదనుకూలముగా, మన యింద్రియములు కొన్నిసారులు మనలను భ్రాంతులుగా చేయుట చూచి అవి మన కుపస్థాపితము చేయునట్టి దేదియు నిజముగా లేదు అని యనుకొనుటకు ఇష్టపడితిని. మరియు,

కొందరు మనుష్యులు హేతువాదములలో పొరపడి, రేఖా గణిత సంబంధములైన అతి సరళ విషయములలో కూడ హేత్వాభాసములకు లోనగుచున్నారు గావున, ఇతరులెంతటి దోషభూయిష్ఠులో నేనును అంతటి దోషభూయిష్ఠుడనే అని నమ్మినవాడనై నేనిదివరకు అనుమానములుగా తీసికొనిన సమస్త తర్కములను అసత్యములుగా త్రోసివేసితిని. మరియు, చివరకు, మనము జాగరూకులమై యున్నప్పుడు అనుభూతములైన ఆలోచనలే, నిద్రితులమైయున్నప్పుడుకూడ అనుభూతములు గావచ్చుననియు, ఆ స్థితిలో అందొకటియు నిజముగాదనియు, ఎప్పుడు గమనించితినో, అప్పుడు, జాగరూకుడనై యున్నతరి నా మనస్సులోనికి ఎప్పుడైనను సరే ప్రవేశించిన సమస్త విషయములలోను నా స్వప్నభ్రాంతుల లోని సత్యమునకంటె ఎక్కువ సత్యములేదని అనుకొంటిని. కాని, నేనిట్లు అంతయు కల్లయేయని తలంపగోరగనే, అట్లు తలచిన నేను ఏదో ఒకటిగా ఉండవలెననుట, అత్యంతావశ్యక మని కనిపెట్టితిని; నేను ఆలోచించుచున్నాను, కాబట్టి నేనున్నాను. అను నీసత్యము, 'స్కెప్టిక్కులు' ఆపాదింపగల ఎంతటి విపరీతమైన సంశయమునకు కారణమైనను, దాని నాందోళితము చేయలేనంత నిశ్చితముగాను, స్పష్టముగాను ఉండుట కనిపెట్టినందున, నే నన్వేషించుచున్న దర్శనము యొక్క ప్రథమసూత్రముగా, ముందువెనుకలు చూడకుండ నేను దానిని గ్రహింపవచ్చునని నిశ్చయించితిని.

తరువాత 'నేనేమిటి' అనుదానిని శ్రద్ధగా పరీక్షించి తిని. మరియు నాకు శరీరము లేదనియు, నేనుండునట్టి ప్రపంచముగాని ప్రదేశముగాని లేదనియు నేను అనుకొనగలిగినను అందువలన నేను లేను అని అనుకొనలేనని గమనించితిని. పైగా, ఇతరవస్తువుల సత్యమును సందేహింపవలెనని ఆలోచించుట, అను పరిస్థితినుండియే అతి స్పష్టముగను నిశ్చితముగను నేనుంటినని తేలెను; వేరొక వంక, నేనాలోచించుటయే మానియుంటినేని, నేనెన్నడైనను సరే భావించిన సమస్తేతర వస్తువులు నిజముగా ఉండి యుండినను, నేనుంటినని నమ్ముటకు నాకు కారణమెద్దియు ఉండకపోయెడిది: అందుచే నేను కేవలము ఆలోచించుటయే సంపూర్ణస్వభావముగా, లేక, సత్తుగా గల ద్రవ్యమునుయు, తానుండగలందులకై ఆద్రవ్యమునకు ఏదేశాపేక్షయు లేదనియు, అది ఏ భౌతికవస్తువు మీదగాని ఆధారపడి యుండలేదనియు తెలిసికొంటిని. కావున, ఈ 'నేను', అనగా, దేనివలన నేను నేనుగ నున్నానో ఆయాత్మ, శరీరముకంటె కేవలము భిన్నమనియు, దీనిని గూర్చి తెలిసికొనుట శరీరమును గూర్చి తెలిసికొనుట కంటె సులభతరమనియు, శరీరము నశించినను ఆత్మ తన యస్తిత్వమును గోల్పోదనియు తెలిసికొంటిని.

దీని తరువాత, ఒక ప్రతిజ్ఞావాక్యము సత్యమును, నిశ్చయమును అగుటకు అవశ్యకమైన దేది అను సామాన్య

గవేషణ చేసితిని. ఏలయన నేనుసత్యమనియు నిశ్చితమనియు నెరింగినట్టి దానిని (నే నాలోచించుచున్నాను కాబట్టి నేనున్నాను) కనిపెట్టితిని గావున ఈ నిశ్చితత్వ మెందు గలదో అది తెలిసికొనవలసి యున్నదని తలంచితిని. మరియు 'నే నాలోచించుచున్నాను, కాబట్టి నేనున్నాను' అను మాటలలో ఆలోచింపగలందులకు ఉండుట అవసరమని స్పష్టముగా కన్పట్టు చున్నది. ఇట్లు కన్పట్టు తప్ప తత్సత్యమును గూర్చిన విశ్వా సము గల్పింపగల దెద్దియు విశిష్టమైనది లేదని గమనించుటచే, మనము స్పష్టముగను, విశదముగను ఊహింపగల వస్తువులన్ని యు సత్యములే అను సూత్రమును నేను సామాన్య నిబంధనగా తీసుకొనవచ్చునని నిశ్చయించితిని. అయినను మనము విశదము గా ఊహించు వస్తువులెవ్వియో సరిగా నిర్ణయించుటలో కొంత కష్టమున్నదనియు నేను గమనించి యుంటిని. నేను సంశయించి తిని; అందువలన నా సత్త్వము కేవలము సంపూర్ణము కాదు అని, ఈ నిబంధన ననుసరించి, మననము చేయుటవలన, (సంశయించుటకంటె తెలిసియుండుట ఎక్కువ సంపూర్ణతయని నేను స్పష్టముగా చూచినందున) నాకంటె ఎక్కువ సంపూర్ణ మైన యట్టిొంచిద్వస్తువును గురించి చింతించుట ఎచ్చటనుండి నేర్చుకొంటినో గవేషింప నిశ్చయించితిని. మరియు, వాస్తవ ముగా సంపూర్ణతరమగు ఒకానొక (వస్తు) స్వభావమునుండియే నేనీభావనను తప్పక గ్రహించియుండవలెనని స్పష్టముగా గుర్తించితిని. ఇక నాకు బాహిరములగు గగనము, భూమి,

ప్రకాశము, ఉష్ణము మొదలగు వేలకొలది వస్తువుల భావనలు ఎక్కడనుండి వచ్చినవో తెలిసికొనుటకు నాకంత కష్టము కలుగలేదు. ఏలయన: వానిని నాకంటె శ్రేష్ఠతరములుగా చేయగలిగిన దానిని దేనిని వానిలో నేను గమనింపనందున, అవి సత్యములైనచో, నాస్వభావము కొంత సంపూర్ణతగలిగి యున్నంతవరకు, అవి దానిపైనే ఆధారపడియున్నవనియు, అవి అసత్యములైనచో వానిని నే నెచటనుండియు గ్రహింప లేదనియు, అనగా నాస్వభావములోని యేదో ఒక అసంపూర్ణతవలననే అవి నాలో ఉన్నవనియు నేను నమ్మగలిగెడి వాడను. కాని నాకంటె సంపూర్ణతరమగు స్వభావమును గూర్చిన భావనవిషయములో ఇది అసంభవము. ఏలయన, దాని నెటనుండియు గైకొనకుండనుండుట అనునది అసంభవ మనుట తెల్లము; మరియు అభావమునుండి భావముద్భవించుట కంటె, సంపూర్ణతరమైనది ఈషత్సంపూర్ణమగు దాని కార్యమో, ఆధేయమో అగుట తక్కువ అనుపపన్నముకాదు గావున, దానిని (అట్టి భావనను) నానుండియే గ్రహింపగల్గుట అట్లే అసంభవము.

కావున వాస్తవముగా నాకంటె సంపూర్ణతరమైనట్టియు నేనూహింపగల యావత్సంపూర్ణతలనుగూడ తనయందే కలిగి యున్నట్టియు, స్వభావముచేతనే అదినాయందు నిక్షిప్తమనుట ఒకటియే పరిశిష్టము; అనగా: ఒక్కమాటలో, అదియే,

ఈశ్వరుడనుట, మరియు, నాకులేని సంపూర్ణతలను కొన్నిటిని నే నెరుగుదును గావున, నేనొక్కడనే అస్తిత్వమందున్న సత్త్వమును గాదనియు, (ఇక్కడ మీ అనుమతితో దర్శన ప్రస్థానముల పరిభాషా పదములను విరివిగా వాడెదను) సంపూర్ణతరమగు అన్యసత్త్వమొకటి అవశ్యముగ నున్నదనియు దానిపై నే నాధారపడియున్నాననియు, దానినుండియే నాకున్న దంతయు పొందితిననియు తీర్మానించితిని. ఏలయన, ఎంత అల్పమైనను నాకుగల సంపూర్ణత అంతయు నానుండియేవచ్చి యుండునట్లుగా నే నొక్కడనే ఒంటరిగను, ఇతరములగు ప్రతిసత్త్వమునుండియు స్వతంత్రముగను ఉంటినేని, ఆ కారణముచేతనే, నాకులేదని నేనెరింగియున్న సంపూర్ణతా పరిశిష్టమంతయుగూడ నానుండియే పొందగలవాడనే. మరియు ఆప్రకారము స్వయముగ అనంతుడుగను, శాశ్వతుడుగను, పరిణామరహితుడుగను, సర్వజ్ఞుడుగను, సర్వశక్తిమంతుడుగను కాగల్గెడివాడనే; సారాంశమేమన, ఈశ్వరునిలో నేను గుర్తింపగల సంపూర్ణతల నన్నిటిని కలిగి యుండెడివాడనే, (పై హేతువాదములచే నిరూపితాస్తిత్వము గల) ఈశ్వరుని స్వభావమును నా స్వభావము అనుమతించినంతవరకు, తెలిసి కొనుటకుగాను నామనస్సులో కొంత భావనగల గుణములకు సంబంధించినంతవరకు ఆగుణములను కలిగియుండుట సంపూర్ణతాచిహ్నమగునా? కాదా? అనుట మాత్రమే నేను గమనింపవలసియుండెను; మరియు, ఈశ్వరునియందు అసంపూర్ణతను

సూచించునది యొక్కటికూడ లేదనియు, మిగిలినవానిలో నేదియు కొరతగాదనియు నేను దృఢముగా నమ్మితిని. ఇట్టి సంశయాదులనుండి విముక్తినందుటకు నేనే సంతసించెడివాడను గావున, సంశయము, చాంచల్యము, శోకము, మొదలగునవి ఈశ్వరుని యందుండజాలవని నేను కనుగొంటిని. ఇవికాక, ఇంద్రియగోచరములైనట్టియు, భౌతికములైనట్టియు, అనేక వస్తువుల భావనలను నేను కలిగియుంటిని; ఏలన, నేను కల గనుచున్నాననియు, నేను చూచుచున్నట్టిది, లేక, ఊహించు నట్టిది, అంతయు అసత్యమేఅనియు అనుకొనినను, నా ఆలోచ నలలో వాస్తవముగా ఆ భావములున్నవని నిరాకరింప నశక్తుం డనైతిని. కాని, నే నీవరకే నాయందలి చిత్స్వభావము భౌతికమునుండి భిన్నమని అతిస్పష్టముగా గుర్తించితిని. గావున, నిర్మాణమంతయు ఆధేయత్వమునకు నిదర్శనమనియును, ఆధేయ స్థితి అసంపూర్ణతయగుట ప్రకటమే అనియు, అందువలన, ఈ రెండుస్వభావములతో సమ్మిశ్రితుడగుట ఈశ్వరునిలో సంపూర్ణతకాజాలదనియు, తత్కారణము వలననే ఆతడు అట్లు సమ్మిశ్రితుడు కాడనియు, నిశ్చయించితిని. కాని సమ గ్రముగా పూర్ణములు కానట్టి దేహములుగాని, చిద్వస్తువులు గాని, లేక, తదితర స్వభావములుగాని ప్రపంచమందుండినచో, ఆతడు లేకుండ వానికి క్షణమాత్రస్థితియైన నుండదు. అంతగా వాని అస్తిత్వము ఆతని శక్తిపై ఆధారపడియున్నదనికూడ నిశ్చయించితిని.

తరువాత ఇతరసత్యముల నన్వేషింప ప్రవృత్తుడనైతిని; మరియు రేఖాగణితజ్ఞుల (శాస్త్ర) విషయమును ముందుంచుకొని వారియొక్క సరళమైన కొన్నినిరూపణలను, పరిశీలించితిని (ఆవస్తువు) పొడుగుగను, వెడల్పుగను, ఎత్తుగను, లోతుగనుఉండి నిరవధిగావ్యాపించి, విభిన్నాకృతులకు, పరిమాణములకు తావిచ్చి విభిన్నభాగములుగా విభాజ్యమై, అన్నివిధముల కదలింపబడుటకును, ఇతస్తము చేయుబడుటకును, వీలైన నిరంతరపదార్థము, లేక అవకాశముఅని ఊహించితిని. (ఎందుకన, రేఖాగణితజ్ఞులు తమ చింతనా విషయమందు ఇదియంతయు ఉన్నదని అనుకొనెదరు.) మరియు, మొట్టమొదట నేనుగమనించిన దిది: ఈనిరూపణలయందు సర్వసమ్మతితోనున్న గొప్పదృఢనిశ్చితత్వమునకు గారణము, నేనీవరకే ప్రతిపాదించిన నిబంధనల కనుగుణముగా, అతిస్పష్టముగా, అవి ఊహింపబడుటయే. ఆతరువాత, ఈనిరూపణలన్నిటిలో వాని విషయాస్తిత్వము గూర్చి నాకు దృఢవిశ్వాసము కలిగింపగల్గిన దేదియు లేదని కనుగొంటిని. ఉదా: త్రికోణమొకటీయబడినదని యనుకొనినచో, దానిమూడు కోణములును రెండు సమకోణములకు నియతముగా సమానములని నేను విశదముగా చూచితిని. కాని, అది నిమిత్తముగా ఏదైన త్రికోణ మున్నదని నాకు దృఢవిశ్వాసము కలిగించునట్టిదేమియు కనుగొనలేకపోతిని. పై పెచ్చు, దానికి మారుగా, సంపూర్ణ సత్త్వభావనాపరీక్షకు

తిరిగ రాగా, రెండు సమకోణములకు త్రికోణముల సమానత త్రిభుజభావనలోనే అంతర్వ్యాప్తమైనట్లుగా, లేక, కేంద్రము నుండి గోళోపరితలముపైనున్న బిందువుల సమదూరత గోళ భావనలోనే అంతర్వ్యాప్తమైనట్లుగ, లేక అంతకంటెను స్పష్టతరముగా, సంపూర్ణ సత్త్వభావనలో తద స్తిత్వము అంతర్వ్యాప్తమైనట్లుగా, గ్రహించి, తత్కారణముచే, ఈశ్వరుని యొక్క, అనగా, ఈసంపూర్ణ సత్త్వముయొక్క అస్తిత్వము లేదా ఉండుట, రేఖాగణితశాస్త్రములోని యేనిరూపణమైన నెంత నిశ్చయమో, కనీసము అంతపరకైన నిశ్చయము అనియు తెలిసికొంటిని.

కాని యీ సత్యమును తెలిసికొనుటలోను, తమ మనస్సును నిజముగా నేమిటో తెలిసికొనుటలోనుగూడ కష్ట మున్నదను విషయము చాలమందికి నచ్చుటకు హేతువు వారు తమ ఆలోచనల నెప్పుడును ఇంద్రియగోచర వస్తువు లను దాటిపోనీయక (భౌతిక వస్తువులకు మాత్రమే పరిమితమగు ఆలోచనాప్రకారము) కల్పనాశక్తి ద్వారమున తప్ప మరి యేమార్గమునను దేనినిగూర్చియు నాలోచింప నభ్యాసము లేని వారగుటయే. కావున, కల్పనీయముకాని దంతయు వారికి అబోధ్యముగ భాసించును. సాంప్రదాయిక దార్శనికులు, ముందుగా నింద్రియములచే గ్రహింపబడని దేదియు అవగత్యంతర్గతము కాదను సూత్రము అంగీకరింతురనునట్టియు,

ఈశ్వరాత్మ భావనలు ఎన్నడు ఇంద్రియగ్రాహ్యములు కావనుట యెటులను నిశ్చయము అనునట్టియు, సందర్భమువలననే దీని సత్యము పర్యాప్తముగ తెల్లమగుచున్నది; మరియు ఈభావనల నాకలనము చేసికొనుటకు తమ కల్పనాశక్తి నుపయోగించువారు, ధ్వనులను వినుటకును, గంధముల నాఘ్రాణించుటకును, తమ చక్షువుల నుపయోగింప ప్రయత్నించుట వంటిపనినే సరిగా చేయుచున్నారు; అయితే చక్షురింద్రియము ఘ్రాణ, శ్రోత్రేంద్రియము లిచ్చుదానికంటె హీనతర ప్రతీతినిచ్చుట లేదను భేదముండిననేతప్ప వాని స్థానమందు మన అవగత్యంతర్వర్తిత్వము లేనిదే మన కల్పనాశక్తిగాని, ఇంద్రియములుగాని, దేనిని గూర్చి దృఢవిశ్వాసము నీయజాలవు.

తుదకు, సోదాహరణముగా నేను వెలువరించిన హేతువులవలన, ఇంకను, ఈశ్వరాత్మల అస్తిత్వమునుగూర్చి చాలినంత నమ్మకములేని వ్యక్తులుండినయెడల, వారు తాము బహుశః దృఢతర సత్యములుగ విశ్వసించుచున్నారమని యెంచునట్టి, 'మనకు శరీరమున్నది, భూమియు, నక్షత్రములు నున్నవి' ఇత్యాది సమస్తములైన ఇతర ప్రతిజ్ఞావాక్యములును అంతకంటె తక్కువ నిశ్చితములుగా ఎఱుంగవలెనని నేను కోరుచున్నాడను; ఎందుకనగా వాని యునికిని సందేహించుటలో, వైపరీత్యము భాసించునంతటి బలీయమైన

నైతిక దృఢవిశ్వాసము మనకీ వస్తువులను గురించి యున్నను, భౌతికాతీత దృఢవిశ్వాసమునకీప్రశ్న సంబంధించినంతవరకు, వానిని సంపూర్ణముగా విశ్వసింపకుండుటకు తగిన యాధారము మనకు గలదను విషయమును వివేకహీనుడు తప్ప ఎవ్వడైన నంగీకరించును. కారణము : నిద్రితులమై యుండగా మనము అన్యశరీరమును గలిగియున్నారమనియు, అన్యనక్షత్రములను, అన్యపృథ్విని చూచుచున్నారమనియు, ఊహింపగలము. వాస్తవమున కట్టివి లేనేలేవు. మనము కలగనుచున్నప్పుడు కలుగు నాలోచనలు, జాగ్రదవస్థలో నున్నప్పు డనుభూతములగు వానికంటె స్ఫుటత్వమున, వైశద్యమున తక్కువ కానప్పుడు, ఇందు రెండవవి అసత్యములు కావనియు మొదటివే అసత్యములనియు మనమెట్లు ఎరుంగుదుము? మరియు, అత్యంత ప్రతిభావంతులైన పురుషులు తమ ఇష్టము వచ్చినంత పర్యంతము, ఈప్రశ్నను పర్యాలోచించినను, ఈశ్వరాస్తిత్వ పూర్వసంభావన చేయనిదే ఈసంశయమును నిరస్తముచేయు పర్యాప్తమైన హేతువు నెద్దానిని ఈయగలరని నేను నమ్మను. ఎందుకన, ప్రప్రథమమున కొలది కాలము కితమే నిబంధనగా తీసికొనిన "మనము స్పష్టముగను, విశదముగను, ఊహింపగల వస్తువులన్నియు సత్యములే" అనుసూత్రముగూడ విశ్వసనీయమగుటకు ఈశ్వరుడున్నాడు, లేక దివ్యపురుషుడు, అతడు సంపూర్ణసత్త్వము; మనకున్న దంతయు తజ్జన్యము అనునవియే కార

ణములు. దానినుండి నిగమనమిది: మనభావనలులేక ఊహాలు ఎంతవరకు స్పష్టములు, విశదములు అయి ఉన్నవో అంత వరకు యథార్థములును, ఈశ్వర ప్రసాదితములును అగును. అందుచే అంతవరకు అవి సత్యములును కావలసినదే. కావున, కొంత అసత్యముతో కూడిన భావములు తరచుగా మనకు కలుగుచున్నను కలంతయో, గూఢతయోఉన్న వాని విషయ మునమాత్రమే యిది సంభవించును. అనగా: ఈయంశమున నవి శూన్యమునందు పాల్గొనుటయే కారణము. అనగా, అవి మనలో అట్లు తారుమారుగా నుండుటకు కారణము. మనము సమగ్రముగా సంపూర్ణులము కాకపోవుటయే. మరియు, సత్యము, లేక సంపూర్ణత శూన్యమునుండి ప్రసారితము కావ లెననుటయు, అసత్యము లేక అసంపూర్ణత, అది అసంపూ ర్ణత మైనంతవరకు, ఈశ్వరునినుండి ప్రసారితము కావలెనను టయు, సమానముగా అనుపపన్నములే అనుట తెల్లము. కాని, మనయందలి సత్యము యథార్థము అయిన దంతయు సంపూర్ణమును, అనంతము నగు సత్త్వము నుండియే వచ్చు చున్నది అని మన మెరుగక పోయినచో, ఎంత స్పష్టములు విశదములు అయినను, మనస్వభావములు సత్యవత్త్వము అను సంపూర్ణతనుగూడ కలిగియున్నవి అనుదృఢ విశ్వాసము కలు గుట కాధారము మనకు లేదు.

ఈశ్వరాత్మల జ్ఞానము మనలను ఈ నిబంధననుగూర్చి నిశ్చితులుగా చేసిన పిదప, జాగరూకులమై యున్నప్పుడు,

మనచే అనుభూతములగు ఆలోచనల సత్యము, మనస్వప్న ములు భ్రమలు అను కారణముచే ఏమాత్రమును సందేహింపఁ బడరాదని మనకు సులభముగనే అవగతము. ఎందుకనగా, ఒక వ్యక్తికి నిద్రించునప్పుడుకూడ అత్యంతము విశదమగు భావన కలిగెనేని, ఉదాహరణకు రేఖాగణితజ్ఞుఁ డొకడు ఏదో యొక క్రొత్తనిరూపణను కనిపెట్టెనేని, అతను నిద్రితుడై యున్నాడు అను పరిస్థితి దాని సత్యమును వివాదగ్రస్తముగా చేయలేదు. మఱియు, వివిధ వస్తువులను మన బాహ్యేంద్రియ ములు వ్యక్తము చేసిన రీతిగనే స్వప్నములుకూడ వ్యక్తము చేయుచున్నవి. ఇది స్వప్నములలోని అతిసామాన్యదోషము. అట్టి యభిప్రాయముల సత్యమును మనము సందేహించునట్లది చేయవచ్చును. కాని దానికేమి? జాగరూకులమై యున్న ప్పుడుకూడ అవి మనలను మోసగించును. ఉదాహరణ: కామెర్లు వచ్చినవారికి సమస్త వస్తువులును పసుపుపచ్చగా తోచుట; లేదా సుదూరమున నున్న నక్షత్రములు లేదా పదార్థములు, వాని స్వరూపముకంటె మనకు చిన్నవిగా గన్పడుట; సారాంశమేమనగా, జాగరూకులమై యున్నను, బుద్ధిప్రామాణ్యము లేనిదే యేవస్తువుయొక్క సత్యమునుగాని దృఢముగా నమ్ముటకు మనము అంగీకరింపరాదు. నేను మన 'బుద్ధియొక్క' అని యనుచున్నాననియు, మన కల్పనాశక్తి యొక్క అనిగాని మన యింద్రియములయొక్క అనిగాని అనుటలేదనియు గుర్తింపవలసి యున్నది. ఎట్లనగా, ఉదా

హారణకు, మనము సూర్యుని అతిస్పష్టముగా చూచుచున్నను, సూర్యుడు మన కగపడు పరిమాణమును మాత్రమే కలిగి యున్నాడని, తత్కారణముచే నిర్ణయింపరాదు; మఱియు, అభూతకల్పన నొకటి యున్నదని పర్యవసితులము కానక్కర లేకుండగనే, సింహాశీర్షము మేషశరీరమునకు అతుకుకొని యున్నదని అతి విశదముగా కల్పన చేయవచ్చును; ఏలయన మనమట్లు చూచునది, లేక కల్పించునది యథార్థముగ నున్న దని బుద్ధితీర్మానింపలేదు. కాని, మనభావనలు, లేదా అస్పష్ట భావనలుకూడ కొంత సత్యమును కలిగియున్నవని అది తేట తెల్లముగ మనకు చెప్పుచున్నది. ఎందుకనగా: లేక పోయి నచో, సమగ్ర సంపూర్ణుడును, సత్యశీలుడును అగు నీశ్వరుడు, వీనిని మనయందు నిక్షిప్తము చేయుట సంభవముకాదు; మఱియు, జాగ్రదవస్థయం దున్నంత స్పష్టముగ, సంపూర్ణ ముగ, నిద్రావస్థయందు మనహేతువాదము లుండవు. (కొన్ని సమయములందు మనస్వప్నరూపములును అంత సజీవములుగా నిశితములుగా లేక అంతకంటె అధికతరముగా ఉండి యున్నను) మనము సమగ్ర పరిపూర్ణులముకాదు కావునను, అందువలననే మనయాలోచన లన్నియు సత్యములుకాజాలవు కావునను, జాగ్రదవస్థయందలి యనుభవములలోనే వాని యందలి సత్యము గ్రహింప నగును; స్వప్నావస్థయందుకాదు, అని మనబుద్ధి చెప్పుచున్నది.

# పంచమ భాగము

ఈ ప్రధానసత్యములనుండి నేను నిగమనముచేసినట్టి సమగ్రసత్య పరంపరను మిక్కిలి సంతోషముతో ప్రకర్శింప బూనుకొనువాడనే. కాని పండితుల వాదోపవాదములకు లోనైన పెక్కుప్రశ్నలనుగూర్చి నేను ప్రసంగింపవలసియుండును గావునను, అట్లు వారితో విరోధింప నభిలాషనాకులేదు గావునను, వానినిగూర్చి వివరింపకుండుటయే మంచిదని నేను విశ్వసించితిని. ఈ సత్యము లెవ్వియోమాత్రము స్థూలముగా చెప్పెదను. వానినిగూర్చి స్పష్టతరముగా వివరించుట ప్రజలకు లాభదాయకమగునో, కాదో, ఉత్తమూర్ఖతగల వివేకులు తరువాత నిర్ణయింపవచ్చును. ఈశ్వరాత్మల యస్తిత్వమును నిరూపించుటలో నేనుపయోగించుచున్న సూత్రముదక్క అన్యము నెద్దానిని స్వీకరింపను అను నాతీర్మానమునందు నే నచంచలుడనైయుంటిని. అనగా, పూర్వము రేఖాగణితజ్ఞుల నిరూపణలకంటె మిక్కిలి స్పష్టముగను, నిశ్చితముగను నాకు జూపట్టనిదాని నెద్దానిని సత్యమని యంగీకరింపకుండుట. అయినను ఈయంశములను ప్రకటింప సాహసించుచున్నాడను. దర్శనశాస్త్రములో సామాన్యముగా చర్చింపబడు ముఖ్యములగు క్లిష్టతల విషయమున సంతృప్తికరములగు సాధనలను కొలది కాలములోనే కనుగొంటిని. అంతేకాదు. ప్రకృతిలో ఈశ్వరుడు స్థాపించిన కొన్ని నియమములను గమనించితిని. వానిని

గూర్చి మన మనస్సులో కొన్ని యభిప్రాయములు నాటుకొను నట్లొనర్చుచేసెను. ఒకమారు మనము వానిపై చాలినంతగా మననము చేసినచో, ప్రపంచమందున్నటువంటి, లేక సంభవించునట్టి అన్నిటియందును సరిగా అవి గమనింపబడుచుండె నను విషయమున మనము సంశయింపబనియుండదు. మరియు, ఈనియమముల క్రమమునుగూర్చి విచారించుటలో, నేను పూర్వము నేర్చుకొనిన, లేక నేర్చుకొన నాశించినవానికంటె, మిక్కిలి యుపయోగకరములును ముఖ్యములును అగు పెక్కు సత్యములను కనుగొంటినని నాకుతోచినది.

అందు ముఖ్యమైన వాని నొక గ్రంథములో వివరింప యత్నించి యున్నాడను, కాని కొన్ని యోజనలు తత్ప్రకటన కాతంకములై యున్నవి. నేనాగ్రంథమందలి విషయముల నిచ్చుట సంక్షేపించుటకంటె సులభతరముగా తత్ఫలితములను తెలియజేయలేను. దానిని వ్రాయబూనుటకు పూర్వము భౌతికపదార్థముల స్వభావములను గూర్చి నాకు తెలిసినదంతయు అందిముడ్చవలెనని నాయుద్దేశ్యము. కాని, ఒక ఘన పదార్థపు వివిధముఖముల నన్నిటిని ఒకేరీతిని బాగుగా సమతలముపై వ్యక్తముసేయ లేమశక్తులమని కనుగొనిన చిత్రకారులు, ముఖ్యమగు దాని నొక్కటి యెంచుకొని, దాని మీద మాత్రమే ప్రకాశము పడునట్లుగా చేసి, మిగిలినవాని నన్నిటిని ఛాయలోనికి త్రోసి, ముఖ్యమైన వానిని చూచు

నప్పుడు అవి యెంతదనుక కానవచ్చునో అంతవరకే వానిని కనబడనిచ్చినట్లుగనే, నామనస్సులో నున్నదంతయు నాప్రసంగములో నిముడ్చ శక్తుడను గానను భయముచే, ప్రకాశము లను గూర్చిన నాఅభిప్రాయములను మాత్రమే, ఒకింత విపుల ముగా నైనను సకే వివరింపదలచితిని. ఆ తరువాత, సమ యము వచ్చునప్పుడు, కాంతి దాదాపు సమగ్రముగా వాని నుండియే వెలువడును కావున, సూర్యునిగూర్చియు, స్థిరనక్ష త్రముల గూర్చియు కొంత చేర్ప నిశ్చయించితిని. కాంతిని ప్రసరించును గావున అంతరిక్షము గూర్చియు, దానిని ప్రతి బింబించును గావున గ్రహములను, ఉల్కలను, భూమిని గూర్చియు, భూమిపైనున్న పదార్థములన్నియు రంగుగల వియో, లేదా ప్రకాశసుగమములో, లేదా భాస్వరములో అయినందున, విశేషించి వానిని గూర్చియు, చిట్టచివరకు ఈ అన్ని పదార్థముల ద్రష్ట గావున మనుష్యుని గూర్చియు కొంత చేర్చదలంచితిని. ఇంకను ఈవిషయములన్నిటిని కొంత వరకు ఛాయలోనుంచుటకును, పండితులు అంగీకరించిన అభి ప్రాయములనుగైకొను లేదా ఖండించు నవసరములేకుండగనే వానినన్నిటినిగూర్చి నాఅభిప్రాయములను స్వతంత్రముగా వ్యక్తీకరింపగల్గుటకును, ఎల్లప్రజలను వారివారి వాదములకు వదల నిశ్చయించితిని. ఈశ్వరుడు కల్పితావకాశములలో ఎక్కడనైన ఒక ప్రపంచమును నిర్మించుటకు పర్యాప్తమగు ప్రకృతిని యిప్పుడు సృజించునేని, ఆ ప్రకృతి విభిన్నభాగము

లను రకరకములుగాను, తారుమారుగాను చలింపజేయునేని, తద్వారమున కవులు ఎన్నడుగాని పరికల్పించనంతటి అప క్రమము గలిగిన అవ్యవస్థ బయలుదేరునేని, తాను స్థాపించిన నియమముల కనుగుణముగ ప్రవర్తించునట్లు ప్రకృతిని వద లుచు, మామూలు ప్రకారము తన యనుమతిని ప్రకృతికిచ్చి ఈశ్వరుడు తన పని ముగించునేని ఆ నూతనప్రపంచములో ఏమి జరుగునో దానిని గూర్చి మాత్రమే చెప్ప సంకల్పించి తిని. ఈ భావము తోడనే, నేను మొట్టమొదట ఈవిషయ మును వివరించితిని. మరియు, ఈశ్వరుని గూర్చియు, ఇటీవల నేను చెప్పిన దానికంటె మరేదియు నామనస్సునకు స్పష్టతర ముగను, బోధ్యతరముగను ఉండజాలదు అని దానిని ప్రదర్శిం చుటకు యత్నించితిని. ఎందుకన, దార్శనిక పద్ధతులలో వాదోపవాదములకు గురియగు రూపములుగాని, గుణములు గాని దానికి లేవనియు, సాధారణముగ నెవరైన నజ్ఞులమని భావింపగలంతటి యస్వాభావికమగు విషయమెద్దియైనను నందు లేదనియు, నేను స్పష్టముగా భావించితిని. పైగా, నేను ప్రకృతి నియమము లెవ్వియో గుర్తించి చూపితిని; మరియు, ఈశ్వరుని యనంత సంపూర్ణత్వముపై తప్ప నితరములగు సిద్ధాంతములపై నా తర్కక్రమమును నిలుపకుండ, సందేహా మున కెట్టి యవకాశమైన గల సర్వమునుగూర్చి నిరూపించు టకు ప్రయత్నించితిని. మరియు నీశ్వరుడు మరికొన్ని ప్రపంచ ములను సృజించెనేని ఈ నియమములు అనుష్ఠింపబడని ప్రపం

చమును సృజింపజాలదనియు, ఆ నియమముల స్వభావమెట్టి దనియు నిరూపింప యత్నించితిని. ఆ తరువాత, ఈ నియమముల కనుగుణముగా, అవ్యవస్థగా నేర్పడిన ద్రవ్యము చాల వరకు అంతరిక్షమువలె వ్యాప్తమగుటకు తగినరీతి నెట్లు క్రమత నేర్పరచుకొనినదో, ఆ లోగా, దాని భాగములు కొన్ని భూమిగను, కొన్ని గ్రహములుగను, తోకచుక్కలుగను, తక్కినవి సూర్యునిగను, స్థిరనక్షత్రములుగను ఎట్లు రూపంది' నవో చూపితిని. మరియు ఈస్థితియందు కాంతికి సంబంధించిన విషయములను విస్తరించుచు, సూర్యునియందు, నక్షత్రములందు చూపట్టు నాకాంతి స్వభావమెట్టిదో, ఎట్లు క్షణమాత్రమున నది అక్కడనుండి అపరిమితమగు నంతరిక్షావకాశముల బయనించునో, ఎట్లు గ్రహములనుండియు, తోకచుక్కలనుండియు నది భూమివైపు ప్రతిబింబించునో, చాల దూరము నేను వివరించితిని. అంతరిక్షములయు, నక్షత్రములయు ద్రవ్యము, స్థితి, గతి మొదలగు వివిధములగు వాని గుణములను గూర్చియు అనేకాంశములను దీనికి చేర్చితిని; తత్ఫలముగ, నేను వర్ణించిన వ్యవస్థయందలి వానితో సరిసమానముగా చూపట్టరానివి, లేదా కనీసము చూపట్టకపోవచ్చునది, అంతరిక్షమునగాని, నక్షత్రములయందుగాని, దర్శనీయమగున దెద్దియు లేదని విశదీకరించుటకు, వానిని గూర్చి చెప్పదగినదంతయు చెప్పితినని నాతలంపు. తరువాత నేను ముఖ్యముగా భూమిని గూర్చి చెప్పదలంచితిని. ఏద్రవ్య

ముతో భూమి సంఘటితమైనదో అద్దానికి నెట్టిగౌరవము నీశ్వరుడీయలేడని నేను స్పష్టముగ ముందే భావించినను, దాని భాగములన్నియు సరిగా కేంద్రాభిముఖము లగుటకు ఇది యెట్లు అడ్డము కారాదో; ఉపరిభాగమున నీరును, గాలియు గల్గుటచే అంతరిక్షముయొక్కయు, విశేషించి చంద్రునియొక్కయు ప్రవృత్తి సర్వపరిస్థితులయందును, సముద్రములందు గన్పట్టునట్టి పాటుపోటులను, ఉష్ణ (అయనాంతర) దేశములందు గన్పట్టు జలవాయు ప్రవాహములను ఎట్లు కలిగించునో; పర్వతములు, సముద్రములు, నీటియూటలు, నదులు, ప్రకృతి సిద్ధముగా నందెట్లు రూపమునందునో, గనులయందెట్లు లోహములు జనించునో, పొలములలో మొక్కలెట్లు పెరుగునో, మరియు సాధారణముగ, మిశ్రితములు, లేక సంయుక్తములు అని సామాన్యముగ పిలువబడు వస్తువులన్నియు నెట్లుత్పత్తి చేయనగునో నేను చూపితిని; నక్షత్రములుగాక కాంతిజనకములగువానిలో నిప్పు తప్ప మరొకటి నాకు తెలియదు. కావున దాని స్వభావమునకు సంబంధించినంతవరకు సర్వమును, అనగా:— దాని యుత్పత్త్యాధార రీతులెట్టివో—ఒక్కొక్కప్పుడు కాంతిలేకుండ ఉష్ణమును, ఉష్ణములేకుండ కాంతియును ఎట్లుండునో, అది వివిధవస్తువులపై వివిధములగు రంగులను నానావిధములగు గుణములను ఎట్లు కలుగజేయునో; ఎట్లది కొన్నిపదార్థములను ద్రవరూపమును పొందించి కొన్నిటిని గట్టిపరచునో; అది ఇంచుమించుగ

అన్ని వస్తువుల నెట్లాహారించునో, లేక ఎట్లు బూడిదగ, పాడిగ మార్చునో; తుదకు, దాని రసాయనిక క్రియా త్రైక్ష్ణ్యమాత్రమున నది ఆ భస్మమునుండి గాజు నెట్లు తయారు చేయునో చూపుటకును నేనెట్టి కష్టమును గణింపలేదు: ఎందు కనగా: బూడిద గాజుగా రూపాంతరమునందుట ప్రకృతి యందలి యొక అద్భుతవిశేషము. కావున నద్దానిని వివ రించుట యందు నేను ప్రత్యేకమగు నానందము నందు చున్నాడను.

ఎట్లైనను ఈవిషయములఁబట్టి యీశ్వరునిచే ఈ ప్రపంచము నేను వివరించినట్లే సృజింపబడినదని తీర్మానించు టకు ప్రవృత్తుడనై యుండలేదు; ఎందుకనగా, ఈశ్వరుడు ప్రప్రథమమున, అది యిప్పుడెట్లుండెనో అట్లే సృజించి యుండుట మరియు సంభావ్యము, కాని ఈశ్వరు డీ ప్రపంచ మును ఏ ప్రక్రియా పుంజముతో భరించుచున్నాడో, ఆ ప్రక్రియాపుంజముతోడనే మొట్టమొదట ఈప్రపంచమును సృజించెననుట తథ్యము. మతశాస్త్రజ్ఞులందరు ఈయభిప్రాయ మును ఏకముఖముననే స్వీకరించిరి. అందువలన ప్రారంభము నుండియు ఈశ్వరుడు ఈప్రపంచమునకు అవ్యవస్థతప్ప మరొక రూప మీయకపోయినను, ప్రకృతి సూత్రములను కొన్నిటిని స్థాపించి అవియిప్పుడు ప్రవర్తించుచున్నట్లు ప్రవ ర్తించుటకు తన యామోదము నొసంగినచో, సృష్ట్యద్భుత

ప్రకారముయొక్క గణ్యతకు లోపములేకుండ, ఈప్రకారము గనే, భౌతికములగు వస్తువులన్నియు, కాలక్రమముగ ఇప్పుడు మనకవి యగుపడునట్లే కాగలిగెడివని నమ్మవచ్చును. ఈ భౌతిక వస్తువులు ఒక్కమారుగ పరిపూర్ణస్థితిలో ఉత్పత్తి యైనట్లు పరిగణించుటకంటె, అవి క్రమముగా ఈప్రకార మున ఈస్థితికి వచ్చినవని కనుగొనినచో, వీని స్వభావము మరియు సులభముగ నూహింపనగును.

నిర్జీవములను గూర్చియు, మొలకలను గూర్చియు, వివ రించిన తరువాత జంతువులను గూర్చియు, అందు ముఖ్యముగా మానవుని గూర్చియు, వివరింప దలంచితిని. కాని, తక్కిన వానినిగూర్చి నే నేప్రకారముగ చెప్పితినో, ఆప్రకారముగ వీనిని గూర్చి చెప్పుటకు తగిన జ్ఞానము నాకిప్పుడు లేకుండు టచే, అనగా, కారణములనుండి కార్యములను నిగమనము చేసి, ఏమూలద్రవ్యములనుండి ఏప్రకారముగ ప్రకృతి వానిని సృజించెనో చూపుటకు తగిన జ్ఞానము లేకపోవుటచే, శరీరావ యవముల బాహిరరూపమునందును, అంతరావయవముల ఆను గుణ్యమునందును మనదేహమునకు అంతటను సరియగునట్టి మానవదేహమును, ముందు నేను వివరించిన ద్రవ్యము తప్ప నన్యమగు ద్రవ్యము నుపయోగింపకుండ ఈశ్వరుడు చేసెన నియు, ప్రథమమున ఆదేహమందు వివేకయుతమగు నాత్మను గాని, లేదా, వర్ధమానము లేక సూక్ష్మగ్రాహియగు నాత్మగా

బనికివచ్చు మరేపదార్థమునుగాని, ప్రవేశపెట్ట లేదనియు నూహించి తృప్తుడనై యుంటిని. కాని, అతడు కాంతిహీన మగు నల్లని హృదయకోశమందు దగిల్చియున్నాడు. దానిని గూర్చి వివరించియేయుంటిని. ఎండకుండగనే ముందు ప్రోగు చేయబడిన గడ్డియందలి యుష్ణమునకును, క్రొత్త నారాయ ములు పులిసి నురగెక్కుటకు గారణమైన యుష్ణమునకును, ఈయగ్ని యెవ్విధమునను భిన్నము కాదని నాతలంపు. ఈ దేహమందు, ఈయూహ ప్రకారము ఉండదగు ప్రవృత్తులను పరీక్షించునప్పుడు ఆలోచనాశక్తి మనకు లేకుండగనే, అందు వలన మనకాత్మ లేకుండగనే, మనయందుండదగు వానినన్ని టిని సరిగా నేను గమనించితిని. అనగా, ఆలోచించుటయే స్వభావముగాగల, శరీరభిన్నమగు మనయీ భాగము వివేక హీనములగు జంతువులు ఏప్రవృత్తులలో మనను పోలియున్న వని చెప్పవచ్చునో, ఆప్రవృత్తులను దానికి ఇచ్చుచున్నదనుట. కాని, ఆలోచనపై నాధారపడి యుండుటచే ఈప్రవృత్తులలో మనకు మాత్రమే సంబంధించిన దాని నెద్దానిని నేను కను గొనలేక పోతిని. తరువాత, ఈశ్వరుడు వివేకయుతమగు ఆత్మను సృజించి, దానిని, నేనుముందు వివరించినట్లొక ప్రత్యేక రీతిగ ఈశరీరమునకు చేర్చెనని నేను భావించి నంతనే వీనినన్నిటిని నేను కనుగొనగల్గితిని.

కాని, అచ్చట నేనెట్లు ఆవిషయమును నడిపితినో చూపుటకై, ఇచ్చట, హృదయకోశధమనుల గతినిగూర్చి

వివరించుట కుద్దేశించితిని. జంతువులయందు చూపట్టునది ముఖ్యమును అత్యంత సాధారణమును అగు గతిగావున, అది తక్కిన వానినిగూర్చి యేమి తలంపవలెనో, దానిని వెంటనే నిర్ణయింపదగు సాధనమునిచ్చును. ఈ విషయమునుగూర్చి నేను చెప్పబోవునది తెలిసికొనుటలోగల కష్టము తగ్గుటకై, శరీర విచ్ఛేదన శాస్త్రమునందు ప్రవీణులుకానివారు, ఈ నిరూపణలను శ్రద్ధగాచదువ నారంభించుటకుముందు, వారిసమక్షమున నూపిరితిత్తులుగల (ఎందుకన ఇది అంతట చాలినంతదనుకమానవతుల్యమే) ఒకపెద్దజంతువుయొక్క హృదయకోశమును ఛేదింపించుకొని, అద్దానియందలి హృదయ వివరములను రెండును నిరూపింపబడునట్లు క్రమమైకొన నుపదేశించుచున్నాను.

ప్రప్రథమమున కుడివైపున రెండు విస్తృతములగు నాళికలు, అనుగుణముగ నుండునట్టియు, రక్తమును పరిగ్రహించువానిలో ముఖ్యమగునట్టియు, దేహమునందలి తక్కిన సిరలన్నియు తనకు శాఖాప్రాయములుకాగా, వానికి తాను కాండమువలె నున్నట్టియు, మహాసిరయు (vena cava; Hollow vein); నాడీకాథమనియు (vena Artiriosa; Arterial vein) గలవు. నాడీకాథమని కాపేరనుచితము; ఎందుకనగా, అదియు ఒక థమనియే. అది హృదయకోశమున జనించును. ఆకోశమును దాటిన తరువాత ఊపిరితిత్తులంతటను వ్యాపించుచు వివిధశాఖలుగా మారును. రెండు ఎడమ

ప్రక్కనున్న కుహరము. దానితో, పూర్వోక్తములగు వానికి పరిమాణమున సమానములు, లేక వానికంటె విశాలములు అగు రెండు ప్రవాహికలు సంగమించుచుండును. అదియే సిరాధమనిక (Arteria venosa venous artery) అదియు అనుచితముగనే అట్లు పిలువబడుచున్నది. ఎందుకన అది మామూలు సిరయే. అది ఊపిరితిత్తులనుండి వచ్చును. అచ్చట నాడికాధమనితో అల్లుకొనియున్నట్టియు, మనము పీల్చుగాలి ప్రవేశించు శ్వాసనాళికతో అల్లుకొనియున్నట్టియు, నానా శాఖలుగ అది విభజింపబడును. మరియు, హృదయకోశము నుండి బయల్వెడలి శరీరమంతటకు తన శాఖలనుపంపు మహాధ మని కలదు. అట్టివారికి, జాగరూకతతో, ఈ రెండు కుహరము లందున్న నాల్గువివరములును, మడతతలుపులవలె తెరచు కొనుచు మూసికొనుచుండు పదునొకండు సూక్ష్మత్వక్కులును చూపబడవలెనని నేను కోరుచున్నాను. అనగా, శూన్యగర్భ మగు శిరయొక్క ముఖద్వారమున మూడు సూక్ష్మత్వక్కు లుండును. అవి అచ్చట, ఆశిరయందున్న రక్తము హృద యముయొక్క దక్షిణ కర్ణికలోనికి సర్వదా ప్రవహించు నట్లుగను, మరియు అరక్తము పైకి ప్రవహింపకుండ అప్పు నట్లుగను, వ్యవస్థితములై యున్నవి; నాడీకాధమని (Anter-ial vein) ముఖద్వారమున మూడు సూక్ష్మత్వక్కు లుండును; అవి పూర్వోక్తములగువానికి కేవల విరుద్ధముగ నేర్పరుపబడియున్నవి. అవి, ఈ కుహరమందున్న రక్తమును

వెంటనే ఊపిరితిత్తులలోనికి పోవునట్లు చేయును. కాని ఊపిరితిత్తులలోనికి రక్తము హృదయకుహరములోనికి రాకుండ అరికట్టును; మరియు ఈరీతిగనే, సిరాధమనికాముఖమున, రెండు మడతతలుపులున్నవి. అవి, ఊపిరితిత్తులనుండి రక్తమును హృదయముయొక్క ఎడమ వివరమునకు పోనిచ్చునుగాని, అరక్తమును తిరిగి రానీయవు; మరియు, మహాధమనియొక్క ముఖమున మూడు మడతతలుపులు గలవు. అవి హృదయకోశమునుండి రక్తము పైకి ప్రవహించునట్లు చేయును. కాని పైనుండి రక్తము లోపలకు రాకుండ ఆపును. సిరాధమనికాముఖము కోడిగ్రుడ్డువంటి ఆకారము గలదగుటచే, రెండు మడతతలుపులతో చక్కగా మూయబడును. తక్కినవి గుండ్రముగ నుండుటచే మూడు మడతతలుపులతో సుకరముగ మూయబడును. ఈ సూక్ష్మత్వక్కలిన్ని యుండుటకు మీద వివరించిన హేతువుకంటె భిన్నమగు హేతువు చూపట్టదు. మరియు, మహాధమనియు, నాడికాధమనియు, సిరాధమనికంటెను శ్వాసగర్భసిర కంటెను, కఠినతరమును, దృఢతరమును అగు నిర్మాణము గలవనియు, వారు గమనింపవలెనని నాకోరిక; ఆతుది రెండును, హృదయకోశమును ప్రవేశించుటకు ముందు వ్యాకోచమునందును. అచ్చటినుండి, హృదయకోశముతో సమానమగు పదార్థముతోడనే చేయబడిన, ద్వికోష్ఠసంజ్ఞాకములగు హృదయకర్ణికలుండును. తక్కిన శరీరభాగము లన్నిటికంటె, హృదయకోశమున హెచ్చు వేడి

యుండును. తుదకు, అత్యంతము వేడిచేయబడిన పాత్రలోనికి చుక్కలు చుక్కలుగ పోయబడిన ద్రవములన్నియు వ్యాకోచము నందునట్లుగనే, హృదయకుహరములోనికి పోవు ఏరక్త బిందువైనను, త్వరలో వ్యాకోచము నంది విస్తరించునట్లు చేయుశక్తి ఈ యుష్ణమునకు కలదు.

ఎందుకన : హృదయకోశముయొక్క కుహరములు, రక్తశూన్యములు కానప్పుడు, కుడినుండి శూన్యగర్భమగు శిర నుండియు, ఎడమనుండి నాడీకాండమనిక నుండియు రక్తము వీని లోనికి అత్యవసరముగ ప్రవహించునని చెప్పుటకంటె హృదయకోశచలన విషయమున నాకు చెప్పవలసినదిలేదు; ఎందుకన: ఈనాళములు రెండును సదా రక్తపూర్ణములై యుండును. మరియు, హృదయకోశమువంకకు తెరచియున్న వాని ద్వారములు మూయబడజాలవు. కాని, ఈహృదయ కుహరములు రెండింటిలోనికి ఒక్కొక్క రక్తబిందువు పోయినంతనే ఈరక్తబిందువులు, పోవుద్వారములు విశాలములగుట చేతను, అవి వచ్చు నాళములు రక్తపూర్ణములగుటచేతను, స్థూలములగు నారక్తబిందువులు వెంటనే ఉష్ణసంగతి వలన విరళీకృతములును, విస్తృతములును అగును. ఈప్రకారముగ, హృదయకోశము వ్యాకోచమందునట్లు అవిచేయును. మరియు, అప్పుడే నాళీముఖమునగల కవాట పంచకమును పీడించి మూసి హృదయకోశములోనికి మరి రక్తము ప్రవహింపకుండ ఆపును.

మరియు, విరళీకృతములైన కొలదియు, తక్కిన రెండునాళముల యొక్క ద్వారస్థిత కవాటములను ముందుకు త్రోసి తీయును. అందువలన, ఈప్రకారముగా, ధమనికాసిరయొక్క శాఖలన్నింటిని, మరియు మహాధమనిని, ఒక్కసారిగనే హృదకోశముతోకూడ వ్యాకోచమునందునట్లు చేయును. ఆతరువాత, వెంటనే హృదయ కుహరములందు ప్రవేశించిన రక్తము చల్లబడును కావునను, చిన్నకవాటము లాగును, మూయబడును కావునను, శూన్యగర్భసిర యొక్కయు, నాడీకాధమనిక యొక్కయు అయిదు కవాటములు నూతనముగ తెరచుకొని హృదయకోశధమనికలను పూర్వమువలెనే వ్యాకోచమునందునట్లు మరల చేయు రక్తబిందువులకు రెండింటికిని మార్గము నొసంగును గావునను, హృదయకోశము, ధమనికల వలెనే సంకోచము నందును. మరియు, హృదయకోశమునందు ప్రవేశించు రక్తము, కర్ణికలనబడు రెండు కోష్ఠముల ద్వారమున పోవును గావున వానిగతి హృదయగతికి విరుద్ధముగ నుండును. హృదయము వ్యాకోచమునందు నప్పుడు అవి సంకోచము నందును. కాని, గణితశాస్త్ర నిరూపణ బలమునెడ నజ్ఞులగు వారును, యథార్థహేతువులనుండి సత్యాభాసములను విడమరచు నభ్యాసము లేనివారును, పరీక్షింప కుండగనేపూర్వోక్తవిషయములను నిరాకరింప సాహసింపకుండ ఈక్రింది సత్యవిషయమును పేరికి చెప్పదలచితిని. సరితూగునట్లైన వేయు బరువు యొక్కయు, చక్రముల యొక్కయు, శక్తి, స్థితి, ఆకా

రసులను గడియారముయొక్క చలనము అనుసరించి వచ్చును. అట్లే నేనిప్పుడు వివరించిన చలనములు హృదయకోశమునందు ప్రత్యక్షముగ జూడనగు ఆయా భాగముల యొక్క నుండియు, వ్రేళ్ళతో స్పృశించి, గ్రహింపనగు నష్టము నుండియు, అనుభవమునుబట్టి తెలిసికొనగు రక్తస్వభావము నుండియు, అవశ్యము అనుసరించి వచ్చుచున్నది.

కాని, ఈప్రకారముగ హృదయకోశములోనికి సిరల నుండి నిరంతరము ప్రవహించు రక్తము సంపూర్ణముగ వ్యయము కాకపోవుటయు, హృదయకోశద్వారమున పోవు రక్తమంతయు తమలోనికే వచ్చు ధమనులు అత్యంతము సంపూర్ణముకాకపోవుటయు, ఎట్లు సంభవించుచున్నదని ప్రశ్నింతు రేని, ఈవిషయమున ప్రప్రథమముగ త్రోవచూపిన ఇంగ్లాండు దేశపు వైద్యుని వ్రాతలనే సమాధానముగ నేనిచ్చుట చెప్ప వలసియుండును. ధమనులయొక్క చిట్టచివరను చిన్నమార్గ ములు పెక్కుగలవనియు, హృదయమునుండి ధమనులు గ్రహించురక్తము ఈచిన్నమార్గముల ద్వారముననే సిరల యొక్క చిన్న శాఖలకుపోయి తిరుగ హృదయకోశమునకు వచ్చుననియు, తన్మూలమున ఆరక్తమార్గము ఒక నిరంతర వ్యాపనముగనున్నదనియు, అతడు ప్రప్రథమముగ బోధించెను. ఈవిషయమున శస్త్రవైద్యుల సామాన్యానుభవము మనకు ప్రబల దృష్టాంతము. తగు పొడుగుగల గుడ్డపీలికతో, కోయ

బోవు శిరకు మీదిభాగమున, చేతికి కట్టుకట్టి, వారు రక్తమును ఇనుమడిగా ప్రవహింపజేయుదురు. ఆబంధమే లేనిచో రక్తమంతగా ప్రవహింపదు. వారు చేతికిని రంధ్రమునకును మధ్యగా క్రిందను కట్టుకట్టినను, లేదా మీదను గట్టిగాకట్టినను సరిగా తద్విరుద్ధమగు ఫలము కలుగును. ఎందుకనగా, తగు రీతిని బిగించిన కట్టు చేతియందప్పటికేయున్న రక్తము శిరాముఖమున హృదయకోశమువంకకు రాకుండ నరికట్టజాలునే కాని, ధమనుల ద్వారమున క్రొత్తరక్తము ముందుకురాకుండ ఆపజాలదు. ఏలన, ధమనులు శిరలక్రిందనున్నవి. మరియు, వానిపై పొరలు దృఢతరములుగావున నొక్కుట కష్టసాధ్యము. మరియు, శిరాద్వారమున, చేతినుండి రక్తము హృదయమునకు తిరిగివచ్చుటకంటె, హృదయమునుండి ధమనులద్వారమున చేతికివచ్చు రక్తము శక్తిమత్తరముగా ప్రవహించును. మరియు, శిరయందు గావింపబడిన ఛిద్రమువలన ఈరక్తము చేతినుండి పైకిపోవునుగావున, బంధమునకు క్రింద కొన్ని మార్గములు ఆవశ్యముగానుండవలెను. అనగా, ధమనులనుండి రక్తమిచ్చుటికి వేరి మార్గమునవచ్చునో, అట్టి చేతిచిట్టచివరి భాగములనుట. ఈవైద్యుడు రక్తప్రసారవిషయమున తాను చెప్పిన యంశములను కొన్ని సూక్ష్మత్వక్కుల యునికినిబట్టి, బాగుగా స్థాపించుచున్నాడు. ఆ సూక్ష్మత్వక్కులు చిన్నకవాటములట్లు శిరామార్గమున నక్కడక్కడ నుండును. ఆయునికి యెట్టిదనగా: ఆచిన్నకవాటములు శరీరమధ్యమునుండిరక్త

మును అగ్రములకు పోనిచ్చును; అగ్రములనుండి రక్తమును హృదయకోశమునకు రానిచ్చును. అంతమాత్రమే. మరియు, అవైద్యుడే ఒకయనుభవమును బట్టి, తన రక్తప్రసార సిద్ధాంతమును స్థాపించెను. ఆయనుభవ మిది: హృదయ కోశమునకు చాలదగ్గరగా ధమనిని గట్టిగా బంధించి, హృదయకోశమునకు ఆ బంధమునకు మధ్యభాగమున కోసినచో అట్లు తెగిన ధమనినుండి కొలదికాలములోనే, శరీరమందలి రక్తమంతయు పైకి పోవును అందువలన ధమనినుండి పైకి ప్రవహించు రక్తము హృదయకోశమునుండి గాక, మరి యేభాగమునుండి యైన వచ్చుచున్నదిఅను నూహ సాధారమేయుండజాలదు.

కాని, నేను చెప్పినదే రక్తప్రసారమునకు నిజమగు కారణమని స్పష్టముగా ఋజువుచేయు పరిస్థితులనేకములు గలవు: అట్లు మొట్టమొదట సిరలనుండి ప్రవహించు రక్తమునకును, ధమనులనుండి ప్రవహించు రక్తమునకును గల భేదము ఈక్రింద చెప్పబడు వానినుండి మాత్రమే కలుగగలదు. శిరములయందుండు సప్తటీకంచె ధమనులయందుండు నప్పుడు, రక్తము హృదయకోశద్వారమున పోవుటచే, విరళము, శుద్ధమునై, పలుచబడి, ప్రకాశవంతమై, వేడిగనుండును. సావధానముగ చూచినచో ఈ భేదము, హృదయకోశ ప్రాంతముననే మిక్కిలి విశేషించి యుండుననియు, దానికి చాల దూరముగానున్న భాగములందు అంత స్పష్టముగా

నుండదనియు తెలియనగును. రెండవ విషయము: నాడికా ధమనియు, మహాధమనియు నిర్మింపబడిన చర్మముయొక్క దార్ఢ్యము, దీనిచే శిరలవైపుకంటె ధమనులవైపు రక్తము శక్తిమత్తరముగా త్రోయబడుచున్నదని చక్కగ తెల్ల మగును. హృదయకోశ ద్వారమున పోయిన తరువాత శ్వాస కోశమున మాత్రమే యుండిన శిరాధమనికా రక్తము, మిక్కిలి పలుచగను, విరళముగను, వెంటనే అగును. అది శూన్యగర్భశిరనుండి తత్క్షణమే నిర్గమించు రక్తముకంటె పలుచగనుండి, సులభతరముగా, అమోఘముగా మిక్కిలి విరళముకానిచో, హృదయకోశముయొక్క దక్షిణ కుహరము కంటెను, నాడికాధమని కంటెను, తద్వామ కుహరమును, మహాధమనియు ఎందులకు మిక్కిలి విస్తృతములును విశా లములును కావలెను? మరియు, రక్తము, తన స్వభావమును మార్చుకొనుట కనుగుణముగా, అధికతరమానముననో, న్యూనతరమానముననో, పూర్వముకంటె హెచ్చువేగముననో తక్కువ వేగముననో హృదయకోశముయొక్క వేడిమి వలన విరళీకృతమగునని తెలిసికొనినచో నాడిని పరిశీలించునప్పుడు వైద్యులేమి యూహింపగలరు? ఈ వేడిమి తక్కిన అవయవ ములకెట్లు పంపబడు చున్నదను విషయమును గూర్చి విచా రించినచో, నయ్యది హృదయకోశ ద్వారమునపోయి, అందు వేడిమి నంది తరువాత శరీరమందంతటను వ్యాపించిన రక్తము వలన నగుచున్నదని అంగీకరింపవలదా? అందువలన

ఒకభాగమునుండి రక్తము తీయబడినచో, ఆభాగమునుండి ఉష్ణముకూడ అట్లే తీయబడుట సంభవించుచున్నది. మండు చున్న యినుమువలె హృదయము వేడిమిగలదైనను, కాలు సేతులను వేడిమిగల వానినిగా అక్కడకు నిరంతరము రక్త మును పంపనిచో, చేయజాలదు. నిశ్వసించుట వలన నిజముగ నుపయోగము తగినంత స్వచ్ఛముగ గాలిని శ్వాస కోశ ములలోనికి తెచ్చి, హృదయకోశము యొక్క దక్షిణ జఠరికయందు వికళీకృతమై ఆవిరిగ మారినట్లుండి శ్వాసకోశములందు ప్రవేశించిన రక్తమును, హృదయ కోశముయొక్క యెడమ కుహరమునందు ప్రవేశించుటకు పూర్వము, చిక్కబరచి క్రొత్తగా రక్తములోనికి మార్చు టయే. ఈప్రక్రియ యంతయు జరుగనిచో అందున్న ఉష్ణో గ్రతయొక్క పోషణమున కది యుపయోగపడదు. ఈక్రింది పరిస్థితినిబట్టి యీవిషయము దృఢపడుచున్నది. శ్వాసకోశ ములు లేని జంతువులకు హృదయకోశమున నొక్క కుహరమే యుండుననియు, గర్భాశయమందున్నప్పుడు శ్వాసకోశము నుపయోగింపలేని బిడ్డలకు శూన్యగర్భశిరనుండి హృదయకోశ ముయొక్క దక్షిణ కుహరములోనికి రక్తముపోవు నొక రంధ్రమును, నాడికా ధమనికనుండి బృహద్ధమనికలోనికి శ్వాసకోశముల ద్వారమున పోకుండగనే రక్తము ప్రవహింప నగు నాళమును, ఉండుననియు కనుగొనబడినది. మరియు, హృదయకోశము ధమనికల ద్వారమున ఉష్ణమును జీర్ణాశయ

మునకు పంపనియెడలను, ఆహారమును విద్రవీకరించుటయందు తోడ్పడు రక్తద్రావణములను కొన్నిటిని పంపక పోయిన యెడలను, జీర్ణక్రియ యెట్లు నడచుచున్నది? హృదయకోశ ద్వారమున బహుశః దినమునకు ఒకటి లేక రెండు వందల సార్లకు పైగా రక్తము వచ్చుచు పోవుచు పరిశుద్ధమగుచుండె నని తెలిసికొనినప్పుడను, ఆహారద్రవమును రక్తములోనికి మార్చు ప్రక్రియ సులభముగా అర్థముకాదా? విరళీకృతమగు చున్నప్పుడు హృదయకోశమునుండి ధమనుల యగ్రములకు పోవు రక్తశక్తి తాముచేరిన అవయవములందు తన యంశము లను కొన్నిటిని నిలుచునట్లుచేసి, తమచే పరిభ్రష్టములగు కొన్నిటి స్థానమును ఆక్రమించుననని చెప్పుటకంటె శరీరము యొక్క వివిధ ధాతువుల పోషణోత్పత్తులను గూర్చి ఋజువు చేసి వివరింపదగిన దేమున్నది? అవి కలియు ఛిద్రములయొక్క- స్థితి, ఆకృతి, లేదా స్వల్పత్వము,- వీని కనుగుణముగా కొన్ని భాగములలోనికి కొన్ని ప్రవహించును. ఈ ప్రకారము గనే, నానావిధములుగ ఛిద్రములగు జల్లెడలుకూడ నానా విధములగు ధాన్యజాతులను విడదీయుటకు నుపయోగించును. ఈవిధముగ చెప్పుటకంటె శరీరమునందలి వివిధ ధాతువుల పోషణోత్పత్తుల వివరణ విషయమున ఋజువుచేయ దగినది లేదు. మరియు, తుట్టతుదకు అన్నిటికంటె పశుతత్త్వ ప్రాదు ర్భావమే ముఖ్యముగా పరిశీలింప దగినది. ఆతత్త్వములు సూక్ష్మవాయువువలెను, లేదా, మిక్కిలి స్వచ్ఛమును విశ

దమును అగు జ్వాలవలెను, హృదయకోశమునుండి సమృద్ధిగా మెదడువరకు ఎడతెరపి లేకుండ ఆరోహించుచు, అందుండి నరముల ద్వారమున కండరములలోనికి చొచ్చుకొనిపోయి అన్ని అవయవములకును చలనమును కలిగించును. అత్యంతము సంభ్రమితములై లోనికి గ్రుచ్చుకొని పోవుట వలన, మెదడు వంకకు నిర్గమించు నీతత్త్వములను సంఘటింపగల శక్తిగల రక్తాణువులనుగూర్చి యీక్రింది కారణముల కంటె అన్యము ఊహించవలసిన యవసరములేదు. వాని నిచ్చటికి గొనివచ్చు ధమనులు హృదయకోశమునుండి మిక్కిలి తిన్నని రేఖలలో నిర్గమించును. యంత్రజ్ఞుల నియమముల కనుగుణముగా - ఆ నియమములు ప్రకృతి విషయమునను సమానములే - ఒక్కమారుగా అనేక వస్తువులు ఒకే బిందువు వంకకు మొగ్గునప్పుడు, అచ్చట వాని యన్నిటికి తగినంత స్థలము లేకపోవుచో (హృదయకోశముయొక్క యెడమ కుహరమునుండి ముందుకు ప్రవహించుచు మెదడు వంకకు పోవు రక్తాణువుల విషయమున ఇంతే.) బలహీనములును, సంభ్రమము తగ్గినవియు నగు భాగములు తప్పక ఆ బిందువునుండి బలీయములగు వానిచే ప్రక్కకు త్రోయబడును. ఈప్రకారము, ఆ బలీయములగు భాగములే ఆ బిందువును చేరును.

నేను మొట్టమొదట ప్రకటింప దలంచుకొనిన వ్యాసములో మిక్కిలి సూక్ష్మవిషయములతో గూడ ఈ యంశము

లన్నియు వివరించి యుంటిని. తెగిన వెంటనే స్వల్పకాలము వరకు తల నిర్జీవమైనప్పటికిని, కదలుచు, భూమిని కరచుచు నుండుట మనము చూచుచున్నాము. ఇట్లగుటచే శరీరమం దున్న పశుతత్త్వములకు అవయవములను కదల్పజాలు శక్తి నిచ్చుటకు, మానవశరీరముయొక్క నరములయు, కండరము లయు రచనా విధానమెట్టిదో; జాగ్రత్స్వప్ననిద్రావస్థలను కల్గించుటకు మెదడులో ఎట్టిమార్పులు, కలుగవలెనో; తేజస్సు, శబ్దములు, గంధములు, రుచులు, వేడిమి, మరియు బాహ్యవస్తువులయొక్క సమస్తగుణములును, ఇంద్రియముల ద్వారమున వివిధాభిప్రాయముల నెట్లు దానియందు నాటు నట్లుగ చేయునో; క్షుత్పిపాసలు మొదలగు నాంతర వికార ములు, మనస్సుపై వాని భావముల నెట్లు నాటునట్లు చేయ గలవో; ఈ యభిప్రాయముల నన్నిటిని పరిగ్రహించు సామాన్యబుద్ధివలననేమి తెలిసికొనవలెనో, వీనిని నిల్పుకొను చున్న స్మృతి కర్థమేమో; వానిని పెక్కు విధములుగ మార్పగలట్టియు, వానినుండి నూత్న భావములను సంఘటింప గలట్టియు కల్పనాశక్తి కర్థమేమో; పశుతత్త్వములను ఆ సాధనము తోడనే కండరముల ద్వారమున వ్యాపింపఁ జేయుచు, ఇచ్ఛాశక్తియొక్క దర్శకత్వమటుండగా, మన స్వవిషయమున నెన్నిసంభవింపగలవో వివిధములగు నన్ని మార్గములందును, దాని యింద్రియములకు ప్రత్యుపస్థాపితము లగు వస్తువులకుగాని, లేక ఆంతరములగు నుద్రేకములకు

గాని, యెద్ది తగునో ఆరీతి యందును, అట్టి శరీరావయవము లను గదలునట్లు చేయగల కల్పనాశక్తి కర్థమేమో ; నేను చూపియున్నాడను. మానవ పరిశ్రమచే కల్పింపబడిన వివిధ స్వయం చలన యంత్రములు చేయు నానావిధ భ్రమణముల నెరింగినవారికి ఈ విషయము అశ్చెరువు గొల్పదు. అందును జంతుశరీరమునందు జూపట్టు అసంఖ్యాకములగు నెముకలు, కండరములు, నరములు, ధమనులు, శిరలు, మరియు తదితర భాగములు—వీనితో సరిపోల్చిన యెడల, ఈ యంత్రనిర్మాణ మునకు సాహాయ్యపడిన భాగములు చాల తక్కువ. అట్టి వారు, ఈ శరీరమును ఈశ్వర నిర్మితమగు నొక యంత్రముగ తలంపవలయును. అయ్యది నిరుపమానముగ నేర్పరుపబడినది. మానవ నిర్మితమగు ఏ యంత్రముయొక్క భ్రమణముకంటెను, ప్రశస్తతరములగు భ్రమణములకు అది తగియున్నది. మరియు, ఇచ్చట ముఖ్యముగా నాగి చూపదలంచిన దొకటి కలదు. అవయవములందును, బాహ్యాకారము నందును, ఒక కోతిని గాని, లేదా వివేకహీనమైన మరి యే జంతువునైనగాని, సరిగా సరిపోలు యంత్రము లున్నయెడల వానికిని, ఈ జంతు వులకును స్వభావమునందెట్టి భేదము కలదని తెలిసికొనుటకు మనకు సాధనములు లేవు ; కాని, మన శరీరముతో సరియగు రూపములు గల యంత్రములుండి, అవి మన పనులను అవ కాశ మున్నంతవరకు అనుకరింపగల్గినచో, అప్పటికిని అవి నిజముగా మనుష్యులు కావని తెలిసికొనదగిన శోధనలు

అత్యంతము నిశ్చితములు రెండు గలవు. అందు మొదటిది: ఒకవేళ మన యాలోచనలను ప్రకటించుటకు సమర్థమగు రీతిని, మాటలనుగాని, లేక ఇతర సంజ్ఞలనుగాని, మన మేర్ప రిచునట్లు అవి యుపయోగింపజాలవు. ఎందుకనగా: పదముల నుచ్చరించునట్లుగను, దాని యవయవములందు మార్పును కలిగించు బాహ్యవస్తువుల కనుగుణముగా, కొన్ని క్రియలు వ్యక్తము చేయునట్లుగను, మనమొక యంత్రమును సులభముగా సృజించవచ్చును. ఉదాహరణకు: ఒకప్రత్యేక స్థలమునందు స్పృశించినచో, దానితో మనమేమి చెప్పగోరి యుంటిమో దానిని ఆ యంత్రము అడుగవచ్చును. మరొక చోట నైనచో, అద్దానికి బాధ కలిగినట్లు అరువవచ్చును. అట్లే మరికొన్ని పనులను చేయవచ్చును. కాని, అత్యంతము స్వల్పబుద్ధిగల మానవుడైనను చేయగల యట్లు సమ్ముఖమున చెప్పబడిన దానికి యుక్తముగా ప్రత్యుత్తర మిచ్చుటకై అది పలువిధముల తనమాటల నేర్పరచు నెన్నడు సంభవింపదు. రెండవ శోధన: అట్టి యంత్రములు పెక్కింటిని, మనతో సమముగ, ఒకానొక మనకంటె అధికముగ లోపరహితముగ చేయగలిగినను, నిస్సందేహముగ అవి మరికొన్నిటియందు తప్పగలవు. అందువలన నవి జ్ఞానమూలకముగ ప్రవర్తింపలేదనియు, కేవలము వాని యవయవముల ఏర్పాటు మూలముననే, అట్లు చేయుచున్నవనియు, కనుగొనగలము. ఎందుకనగా, వివేకము విశ్వజనీనమగు నుపకరణము.

అది ప్రతి సమయమునందును లభ్యమగును. ఇక, ఈ యవయవములు, తద్విరుద్ధముగా, ప్రత్యేక కార్యము నకును ప్రత్యేకమగు నేర్పాటును గోరును. జీవితమునందలి ప్రత్యవసరమునందును మనకుగల వివేకము మనల నెట్లు వ్యవహర్తలుగ చేయుచున్నదో, అట్లుచేయు సమర్థతగల అవయవ వైవిధ్యము ఏ యంత్రమునందైన నుండుట వివేచింపగా నసాధ్యము. మరియు, ఈ రెండుశోధనలమూలమున, ఆప్రకారమే, మానవులకును, పశువులకును గల భేదమును మనము తెలిసికొనవచ్చును. ఇట నొక్కి చెప్పదగిన విషయ మొకటి గలదు. మానవులయందు, భిన్నపదములనుగలిపి తమ యభిప్రాయమును సుబోధకముగ ప్రకటించి చెప్పలేనిమంద బుద్ధి ఎవ్వడునులేడు. ఇంకొకవంక, ఎంతసంపూర్ణమైనదైననూ, లేదా ఎంతటి అదృష్టములగు స్థితులయందున్నను అట్టిది చేయగల జంతువెద్దియును లేదు. ఈ యశక్తి అవయవలోపముచే నేర్పడినదికాదు. ఎందుకనగా, గోరువంకలు, చిలుకలు మనకువలెనే పదముల నుచ్చరింపగలవు. అయినను మనము మాటలాడినట్లు మాటలాడజాలవు. అనగా, అవి చెప్పునది వాని కర్థమైనదని చూపగలట్లు మాటలాడజాలవనుట. అట్టియెడ పుట్టుచెమిటి, మూగవారినిచూడుడు. ఇతరులు మాటలాడునెడ నుపయోగించు నవయవములు వారికిలేవు. వారు స్వచ్ఛందముగా కొన్ని సంజ్ఞలను సృజించి, తమ యభిప్రాయములను వెల్లడింతురు. వారి సాంగత్యమున తరచుగానుండు

టచే, వారిభాషను గ్రహించుట కవకాశముగలవారికి, వారి భావములు తెలియజేయుదురు. ఇది మానవులకంటె పశువులకు తక్కువ వివేకము కలదనుటయేకాక, ఉపరివాని కెట్టి వివేకమును లేదని ఋజువుచేయుచున్నది. ఎందుకనగా, మనుష్యుని మాటలాడ శక్తిగలవానిగా జేయుటకు కావలసినది చాల తక్కువ. మరియు, ఒకేజాతికిచెందిన జంతువులందు, మానవులందువలెనే, సామర్థ్యవిషయమున హెచ్చుతగ్గులు చూడనగును గావునను, ఉపదేశింపబడుటకు కొందరికంటె కొందరు శక్తిమత్తరులగుదురు కావునను జంతువుల యాత్మ మన యాత్మకంటె సంపూర్ణ భిన్నస్వరూపముగలదైనప్పుడు తప్ప, తమజాతిలో అత్యంతము లోపరహితమగు కోతిగాని, చిలుకగాని, అత్యంతము మందబుద్ధిగల శిశువుతోడగాని, లేదా అధమము మతిపోయిన శిశువుతోగాని, సరికాకపోడదనుట నమ్మదగిన విషయము కాదు. మరియు, ఉద్రేకములను సూచించునట్టియు, జంతువులు విశదపరచునట్లే యంత్రము లనుకరింపగలట్టియు స్వాభావసిద్ధములగు చేష్టలను సంభాషణ శక్తిగా భ్రమింపరాదు. జంతువులుకూడ మాటలాడుననియు, వానిభాష మన కర్థముకాదనియు, మనప్రాచీనులవలె తలంపరాదు. ఎందుకనగా: అది యట్లే యయినచో, మన యవయవములతో సరిపోలు నవయవము లనేకములు వానికిని గలవు గావున, తమసహచరులకు తెలియజేయునట్లే వాని యాలోచనలను మనకుగూడ తెలియజేయగలిగియుండెడివి.

ముఖ్యవిషయ మింకొకటి గలదు: కొన్ని పనులలో మన కంటె నధికతరమగు నేర్పును వ్యక్తముచేయు జంతువు లనే కములున్నను, అవేజంతువులు మరికొన్నింటియందు, ఎట్టి నేర్పును చూపకపోవుట గమనింపవగిన విషయము కావున, మనకంటె బాగుగా అవి పనిసేయుట వానికి మతిగలదను విషయమును నిరూపింపదు. ఎందుకనగా, దానివలన జంతువులకు మనకంటె నధికతరమగు వివేకము గలదనియు, మనల నవి సర్వవిషయములందు నతిక్రమింపగలవనియు తేలును. తద్వ్యతిరేకముగ, అవి వివేకహీనములనియు వాని యవయవక్రమమున కనుగుణముగా తత్స్వభావమే పనిచేయుచున్నదనియు నిరూపింపబడుచున్నది. అట్లు చక్రములతోడను, భారవాహికల (Weights) తోడను చేయబడిన గడియారము మన నైపుణ్యమంతటితో మనము చెప్పినదానికంటె సరిగా గంటలుచెప్పి కాలమానమును కొలువగలదని తెలియుచున్నది.

దీని తరువాత నేను వివేకయుతమగు ఆత్మనుగూర్చి వివరించియుంటిని. నేనింతకుముందు ప్రసంగించిన యితర వస్తువులకువలె, అద్దానిని భౌతికశక్తినుండి బయలు దీయుటకు ఎవ్విధముననను వీలులేదనియు, అయ్యది స్పష్టముగా సృజింపబడియుండుట తథ్యమనియు తెలియజేసియుంటిని; మరియు శరీరావయవ విన్యాస విషయమున తప్ప తక్కిన విషయములలో ఓడయందు తచ్చోదకుడున్నట్లు అది శరీరమందున్న చాలదు. ఇక నది, మనకున్న వానితో సమానమగు ఇంద్రియ

జ్ఞానము, ఆశలు కలుగునట్లుచేసి నిజముగు మానవుని నిర్మించు టకై శరీరముతో కలిపి జతచేయబడియుండుట అవసరము. చిట్టచివరకు, ఆత్మ మిక్కిలి ముఖ్యమగుటచే దానినిగూర్చి సుదూరము చెప్పితిని. ఎందుకనగా, కొందరు ఈశ్వరుడు లేడందురు. ఆ తప్పును నేను చాలినంతగా ఖండించితినని తలంచుచున్నాడను. మనయాత్మయు, జంతువుల యాత్మయు సమాన స్వభావము గలవే యనియు, అందువలన ఈజీవితా నంతరము ఈగలకంటె, చీమలకంటె ఆశింపవలసినదిగాని, భయపడ వలసినదిగాని ఏదియు లేదనియు, తలంచుటకంటె, నిర్వక్రనైతిక మార్గమునుండి దుర్బల మనస్కుల నమార్గము నకు త్రిప్ప శక్తిమంతమగు దోషము, నాస్తికత్వము దప్ప మరొకటిలేదు. మనయాత్మలును, జంతువుల యాత్మలును ఎంతగా భిన్నములో, మనకు తెలిసినప్పుడు, ఆత్మస్వభావ మును, శరీర స్వభావమును ఒండొంటితో సంబంధములేని వనియు, అందుచేత ఆత్మ, శరీరముతో మరణింపదనియు, స్థాపించు హేతువులను మనము అవగాహన చేసికొనగలము. చివరకు, దానిని నశింపజేయగల కారణములు గన్పట్టుట లేదు. కావున, అది అమరమని తీర్మానించుటకు మనము సహజముగా ఇష్టపడుదుము.

## షష్ఠ భాగము

ఈ విషయములన్నియుగల వ్యాసమును నేను ముగించి మూడేండ్లయినది. ముద్రాపకుల కిచ్చునుద్దేశముతో దానిని

నేను తిరిగి సరిచూచు చుంటిని. అప్పుడు కొందరు కొలది కాలము క్రిందట ఒకవ్యక్తి* ప్రచురించిన ఆధిభౌతిక శాస్త్రసిద్ధాంతము నొకానొక దానిని ఖండించిరని నేను తెలుసుకొంటిని. ఆ ఖండించిన వ్యక్తులయెడ నాకు మిక్కిలి గౌరవము కలదు. నా కార్యకలాపముపై వారికి గల యధికారము, నాయాలోచనలపై నావివేకమునకుగల ప్రభావముతో సమానము. ఆసిద్ధాంతమును నేను సమ్మతించితినని నేను చెప్పుటలేదు. కాని వారియాక్షేపణకు పూర్వము దాని యందు, మతమునకుగాని, రాష్ట్రమునకుగాని అపాయకరమగునని నేను భావింపదగినదాని నెద్దానిని నేను కనుగొనలేదు. కావున, నాబుద్ధికది సత్యమని తోచినచో దానిని గూర్చి యాలోచించుటలో నన్నాపునదియు లేదని కనుగొంటిని. అత్యంతము నిశ్చితముగా నేను నిరూపింపజాలనిచో క్రొత్త నమ్మకముల నంగీకరింపకుండుటకును, ఎవ్వరికైన నష్టదాయకమగుదాని నెద్దానిని వ్రాయకుండుటకును నేను సర్వదా మిక్కిలి జాగరూకుడనై యున్నను నాసిద్ధాంతము లందు గూడ నపార్థమునకు గురియగునవి గన్పట్టునేమో అని నేను భయపడితిని. గ్రంథమును ప్రకటింపవలెనను నాయుద్దేశమును మార్చుకొనుటకీయాలోచనలు చాలును. నా పూర్వనిశ్చయమునకుగల హేతువులు మిక్కిలి బలీయములే. అయినను, గ్రంథరచనయెడ నాకభిరుచిలేదు. ఆవైముఖ్యము కారణ

* గెలీలియో

ముగ (పుస్తక రచన) ఆపనినుండి తప్పించుకొనుటకై అనేకము లగు నితరహేతువులను వెంటనే నేను కనుగొనగల్గితిని. ఇరు వంకల నా హేతువుల స్వభావమిట్టిది: ఇచ్చట వానిని వ్యక్తీకరించుటలో నాకు శ్రద్ధయుండుటయేగాదు; వానిని గూర్చి తెలిసికొనుటలో జనసామాన్యమునకును కొంతశ్రద్ధ యుండవచ్చును.

నా మానసికశక్తులనుండి ప్రసారితములగు వానికి నేనెన్నడు నధికమగు విలువనీయలేను. ఎంతదనుక విచారణాత్మకములగు శాస్త్రములకు సంబంధించిన కొన్ని చిక్కుల విషయమున నేను సంతృప్తి నందుటకంటెగాని, లేదా, తచ్ఛాస్త్రోపదిష్ట హేతువులతో నాప్రవర్తనను సరిచేసికొనుటకు యత్నించుటకంటెకాని, అధికమగు ఫలమును నేనుపయోగించు పద్ధతియందు నేను సేకరింపనో, అంతదనుక, దానికి సంబంధించిన దాని సిద్ధాంతమును ప్రకటింపవలసిన బాధ్యత నాకు గలదని నేను విశ్వసింపలేను. ఇక ప్రవర్తన విషయము: ప్రతివ్యక్తియు సమృద్ధమగు తన సద్బుద్ధియెడ గట్టి నమ్మకము గలవాడే. కావున, ఈశ్వరునిచే సర్వోత్కృష్టులగు ప్రజాపరిపాలకులుగ స్థాపింపబడినవారుగాని, లేదా తాము ప్రవక్తలు కావగినంత కృపయు, నుత్సాహము నీశ్వరునిచే గాంచినవారుగాని, కాక మరెవ్వరైనగాని, మన యాచారమార్గములయెన్నికలో పాల్గొన ననుమతి గాంచినచో

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క సంఘసంస్కారి కానుపింప గలడు. నాయూహాలు నాకు ముదానవహములగుగాక; ఇతరు లకుగూడ వారి వారి యూహాలుండును. అవి వారికి మరియు సంతోషదాయకములు కావచ్చును. ఆధిభౌతికశాస్త్రమునకు సంబంధించిన సాధారణాభిప్రాయములను కొన్నిటిని నేను సంపాదించి విశిష్టములగు వివిధ క్షేత్రములయందు నిరూపణల చేయ నారంభించినంతనే, అయ్యవి యెంతదనుక మనలను తీసి కొని పోగలవో, నేటివరకు నుపయుక్తములై యున్న సూత్రము లకు అవియెట్లు భిన్నములై యున్నవో, కనుగొంటిని. నేను, అంతట వానిని దాచియుంచినచో జగత్కల్యాణ సంధాయక మగు ధర్మమునెడ మహాపచారము గావించుచున్నాడనని నమ్మి తిని. ఆ సూత్రముల మూలమున జీవితమునకు చాల నుపయోగ కరమగు జ్ఞానమును సంపాదించుట కవకాశము కలదని నేను తెలిసికొంటిని. సామాన్యముగా దర్శనశాస్త్రములందు చెప్ప బడు విచారణాత్మక తత్త్వశాస్త్రమునకు బదులుగా, వాస్తవ మగు తత్త్వశాస్త్రమును కనుగొనవచ్చుననియు, అద్దాని సాహా య్యమున అగ్ని జల వాయు నక్షత్రాకాశములయొక్కయు, మనలను చుట్టియున్న సమస్తపదార్థములయొక్కయు, శక్తిని, పనిని — శిల్పుల వివిధములగు చేతిపనులను ఎంత స్పష్టముగా తెలిసికొందుమో, అంత స్పష్టముగా తెలిసికొని, ఆవిధముగానే ఏ ఉపయోగములకవి తగునో వానికి వానిని అనువర్తింపజేసి, ప్రకృతికి ప్రభువులమును, హక్కుదారులమును మనము కాగల

మని కనుగొంటిని. బహుశ్రమలేకుండ భూమియిచ్చు ఫలములను, సకలసుఖములను, ఆనందముగ అనుభవించినట్లు మనలను చేయగల అనంతములగు కళలను క్రొత్తగా కనుగొనుటకే గాక, ముఖ్యముగా ఆరోగ్యరక్షణమునకుగూడ ఇది కోరదగినఫలము. ముఖ్యముగా ఆరోగ్యము జీవితానందకర హేతువులలో ప్రథమమును, ప్రముఖమును. ఎందుకనగా, శరీరావయవ గుణప్రవణతలపై మనస్సు చాలహెచ్చుగా ఆధారపడియున్నది కావున, మానవులను పూర్వముకంటె ఘనతరులగు మేధావులుగను, సహజశక్తియుతులుగను చేయు సాధనము ఎప్పుడైన కనుగొనబడినచో అద్దానికై వైద్య శాస్త్రమునందే వెదుకవలెనని నానమ్మకము. ఇప్పుడున్న ప్రకారముచూచినచో, వైద్యశాస్త్రము, సుప్రసిద్ధోపయోగము గలవానిని కొలదిగనే కలిగియున్నదనుట సత్యము. కాని, ఇప్పుడందు తెలిసికొన్నది, కనుగొనవలసినదానితో సరిపోల్చినచో, ఇంచుమించుగా శూన్యమే అని అంగీకరింపనివాడు వైద్యమే వృత్తిగా కలవారిలోకూడ ఉండడని నేను నమ్ముచున్నాను. ఇందు వైద్యశాస్త్రమును తక్కువపరచు నుద్దేశము నాకులేదు. మనకు వాని కారణములనుగూర్చియు, ప్రకృతి యొసంగిన పరిహారములగూర్చియు తగినంత సంపూర్ణ జ్ఞానమున్నచో, అనంతములగు శారీరక, మానసికజాడ్యముల నుండియు, బహుశః, వార్ధక్యాశక్తినుండియుగూడ మనము విముక్తులము కాగలమనియు నేను విశ్వసింతును. నేను నా

జీవితమంతయు అత్యావశ్యకమగు ఆ శాస్త్రశోధననుచందు వినియోగించుట కుద్దేశించితిని కావునను, జీవితపరిమాణము తక్కువగుట లేక, ప్రయోగములు చాలకపోవుట అనువానిచే అడ్డగింపబడినప్పుడుతప్ప, ఎవ్వడైనను ఎట్టిమార్గము ననుస రించినచో తప్పనిసరిగ కోరిన చరమస్థానమును చేరగలడో, అట్టిమార్గమును నే ననుసరించితిని కావునను, నేను కనుగొనిన ఆస్వల్పవిషయమును ప్రజలకు తెలియజేయుటకంటెను, అధిక ప్రజ్ఞావంతులను, తమతమ ప్రవీణత్వమునకును, శక్తికిని అను గుణముగ ప్రజానీకమునకు వారు క్రొత్తగా కనుగొనిన విష యముల నెరుకపరచుచు, చేయదగిన ప్రయోగములకు తోడ్ప డుచు, ముందుకుపోవ యత్నింపవలెనని ప్రేరేపించుటకంటెను ఈ రెండుఅడ్డంకులకు అమోఘమగునేర్పాటు మరొకటిలేదని నేను నిర్ణయించితిని. అందువలన తుది నారంభించినవాడు తనకుముందు గావించినవారు వదలినచోట ప్రారంభింప వచ్చును. అట్లుబహుజనుల జీవితమును, శ్రమను కలిపినచో ఎవరికివారే చేయగలిగినదానికంటె, ఏకముఖమున మనము ముందుకు పోగలము.

మరియు, జ్ఞాన మధికమగుచున్నకొలదియు, ప్రయో గావశ్యకతయు సదా అధికమగుచుండునని నేను నొక్కి చెప్పి యున్నాడను. ఎందుకనగా, ప్రారంభమందు అసాధారణ ములు, దురవగాహములు అగు దృశ్యములయెడ శ్రద్ధవహిం

చుటకంటె ఏ కొలదిపాటిగ యోజించినను సరే ఎద్దాని విష యమున మనము అజ్ఞతయందుండ జాలమో, ఎయ్యది మన యింద్రియములకు స్వచ్ఛందముగ చూపట్టునో, అట్టిదానినే ఉపయోగించుకొనుట చాలమంచిది. కారణమేమనగా, ఎంత దనుక మిక్కిలి సామాన్యములగు వాని హేతువులు మన కింకను తెలియవో, అంతదనుక, మరియు ననాధారణములు తరచుగ మనల నపమార్గమున పెట్టును. మరియు, అవి యాధారపడు పరిస్థితులు ఎల్లప్పుడును ఇంచుమించుగా మనము కనుగొనలేనంత విశిష్టములు, సూక్ష్మములునై యుండును. కాని, అందు నే నీక్రింది వరుసను గైకొనుచున్నా డను. ఒకటి: సామాన్యముగ ఈ ప్రపంచమందున్న, లేదా, ఉండగల సర్వముయొక్క ప్రథమ సూత్రములను, లేదా, కారణములను తెలిసికొనుటకు యత్నింతును. ఈ యుద్దేశము తోడనే, ప్రపంచమును సృజించిన ఈశ్వరుని తప్ప మరి యే యితరమును విచారణలోనికి తేదలుచుకొనలేదు; సహజముగ మన మనస్సులందున్న కొన్ని సత్యబీజములనుండి తప్ప మరియే యితరాధారముల నుండియు వీనిని రాబట్టు నూహ చేయ దలుచుకొనలేదు. రెండు: ఈ హేతువులనుండి నిగమనము చేయగలిగిన సర్వసామాన్య ప్రథమ ఫలితము లెవ్వియో నేను పరీక్షించితిని. ఈ ప్రకారముగ సర్వసాధారణములు, అక్లిష్టములు కావుననే, తెలిసికొనుటకు మిక్కిలి సుకరములు అగు ఆకసము, నక్షత్రములు, భూమి, ఆభూమిపైగూడ నీరు

గాలి, అగ్ని, లోహములు, ఈజాతికి చెందినవే మరికొన్నియు నేను కనుగొనియున్నాడనని నాకు తోచినది. తరువాత, నేను మరియు ప్రత్యేకాంశములకు దిగ నుద్దేశింపగా, నానావిధము లగు పదార్థములు నాకు చూపట్టినవి. తత్ఫలముగ అచ్చట వాని నుంచుట ఈశ్వరు నకామోదకరమగుచో అచ్చట నుండి యుండెడి అనంతములగు మరికొన్ని వస్తువులనుండి భూమిపై నున్న వస్తురూపములను, లేక జాతులను వేరుచేయుటకు గాని, తత్ఫలితముగ, వానిని మన యుపయోగములకై వినియో గించుటకుగాని, తత్ఫలితములను చక్కగా పరిశీలించుటవలన మనము వాని కారణములకు పోయి, వివిధ ప్రత్యేకానుభవ ములను మనకు పనికివచ్చునట్లు చేయనిచో, మానవ బుద్ధి సమర్థముకాదని నేను నమ్మితిని. అందుపై, ఇంద్రియగోచర మైన సమస్త వస్తువులను గూర్చియు ఆలోచింపగా, నేను కనుగొనిన సూత్రములనుబట్టి నేను సంతృప్తికరముగా వివరింప జాలని వెవ్వియు నే నెప్పుడు గమనింపలేదని నేను నిరాఘాట ముగా తీర్మానించి చెప్పుటకు సాహసించుచున్నాను. కాని, యీక్రింది విషయము లొప్పుకొనక తీరదు: ప్రకృతి శక్తి సమృద్ధము; విస్తృతము; ఈ సూత్రములు సూక్ష్మములు, సాధారణములు: కావున ఆ సూత్రముల నుండి భిన్నములగు ననేక మార్గముల నిగమనము చేయతగిన వని నేను వెంటనే తెలిసికొనుటకు వీలులేని ప్రత్యేక ఫలితమొక్కటియు నేను గుర్తింపలేదు. కావున, ఈ వివిధమార్గములలో, ఎద్దాని

ద్వారమున దానిని పరిశీలింపదగునో కనుగొనుట తరచుగా నాకు మిక్కిలి కష్టదాయకమై యున్నది: ఎందుకనగా ఈకష్టమునుండి తప్పించుకొనవలెనన్నచో మరికొన్ని ప్రయోగములను వెదకుటకంటె నాకు మార్గాంతరము లేదు. ఆ ప్రయోగము లెట్లుండవలెననగా: ఈ రీతులలో, ఒక దానితో మనము వివరింపవలసిన ప్రయోగముయొక్క ఫలితమును, మరొక్కరీతితో వివరింపవలసినదాని ఫలితమును ఒక్కటీ కాకూడదు. ఇక మిగిలినదాని విషయమున, ఆలోచింపగా, ఈ ప్రయోజనమునకు తోడ్పడు ప్రయోగములలో అధిక భాగమును చేయుటకు ఏమార్గమును గైకొనవలెనో, కావలసినంత విశదముగా కనుగొనుటకు తగిన స్థితిలో నే నున్నాడను. కాని, నాకున్న పనివారుగాని, రాబడిగాని, ఇప్పటికంటె వేయిరెట్లధికమైనను, ఆ ప్రయోగము లన్నింటికిని సరిపడవు. అంతగా అసంఖ్యాకములై అవి యున్నవని నేను, ఈప్రకారముగనే, కనుగొంటిని. కాబట్టి, నేను ప్రకృతి జ్ఞానమున పొందు నభివృద్ధియు, నేను చేయగల ప్రయోగములును, ఈ సమనిష్పత్తిలో నుండును. ప్రయోగములు కొలదిగా చేసినచో, కొలదిగనే అభివృద్ధియు, హెచ్చుగా చేసినచో, హెచ్చుగా నభివృద్ధియు ఉండును. నావిశ్వాసములో నేను తెలియజేయుట కాశించినదియు నిదియే. అనగా, తమ హృదయములందు మానవసామాన్యమగు మంచిగలవారు, అనగా బాహిరాకారముననే గాక యథార్థముగా పవిత్రులైన

వారు తమ ప్రయోగములనుగూర్చి నాకు తెలియజేయునట్లు ప్రేరేపించుటయే నేనాశించిన ప్రయోజనము. ఎవరైన చేసిన ప్రయోగము లున్నచో, నేను చేయుచున్నవానిలో నాకు సహాకరించుటకై, వానిని గూర్చి నాకు తెలియజేయుడు! అందువలన ప్రజానీకమునకు సహజమగు నభివృద్ధి చాల కలుగును.

కాని, అప్పటినుండి యితరకారణములు నాకు చూపట్టినవి. వానిని బట్టి నాయభిప్రాయమును నేను మార్చుకొన వలసిన వాడ నయితిని. మరియు, ఏమైన విలువగలవని నేనూహించిన ఫలితములన్నిటిని వాని యాథార్థ్యమును నేను పరీక్షించిన వెంటనే, వ్రాసికొనవలెననియు, వానిని ప్రచురింపదలంచినచో ఎట్టిజాగ్రత్తను వహింతునో అట్టి జాగ్రత్తనే వహింపవలెననియు తలంచితిని. ఈ మార్గము నాకు క్రిందికారణముల వలన నాదరణీయమైనది: అటయిన, వానిని సమగ్రముగ సూక్ష్మముగ పరిశీలించుటకు నాకు సమృద్ధమగు ప్రోత్సాహము కలుగును. ఎందుకనగా, నిస్సందేహముగ, మనస్సోపయోగమునకు మాత్రమే వ్రాయబడువానికంటె, పదిమంది చదువుదు రను నమ్మకముతో వ్రాయబడునవి బహుసూక్ష్మముగా పరిశోధింపబడును. (మరియు, తరుచుగా, మొదటనే నూహించునపుడు సత్యముగా తోచినది, వ్రాయుటకు ప్రారంభింపగనే అసత్యముగా తోచినది.) అట్లు వ్రాయుటవలన, నాచేతనగు

సంతవరకు ప్రజానీకముయొక్క లాభము నభివృద్ధి గావించు-
టలో ఎట్టియవకాశమును నేను వదలుకొనను. అట్లే, నా వ్రాతల
యం దేమైన విలువయున్నచో, నేను చనిపోయిన తరువాత
అవి యెవ్వరిచేతిలోనైన పడినచో, వారు తమ కుచితమని
తోచిన పనికి వానిని వినియోగించుకొందురు. కాని నాజీవిత
కాలమున వానిని ప్రకటించుట కెంతమాత్రము నంగీకరింప
కుండుటకు నేను నిశ్చయించుకొంటిని. ప్రకటించినచో వాని
వలన జనించు ఖండనములుగాని వివాదములుగాని, లేదా, వాని
వలన నాకు గలుగు కీర్తిగాని, నా యభివృద్ధికై నేను ప్రత్యే
కించియుంచుకొనిన కాలమును పోగొట్టుకొనుటకు కారణమగు
నని నాయూహ. ఏమనగా, యథాశక్తి ప్రతివ్యక్తియు లోక
కళ్యాణముచే పెంపుసేయవలసినవా డనుటయు, ఇతరు లెవ్వరి
కిని పనికిరాకుండ నుండుట వ్యర్థజీవితమే యనుటయు సత్యమే
యైనను, మన యాలోచనలు ప్రస్తుతమునకు సంబంధించిన
వగుటయేకాక, ప్రస్తుతము నతిక్రమించి యుండవలెననుటయు
సత్యమే. కొన్ని నేటి వారికి బహుశః కొంత లాభకరములే
యైనను, రాబోవువారికి మహత్తర లాభకరములగు లక్ష్యముల
నిర్వహణము మన దృక్పథములో నున్నప్పుడు, అట్టివానిని
వదలుటయే మంచిది. నిజముగా నే నితఃపూర్వము గ్రహించిన
స్వల్పవిషయములును, నాకు తెలియని విషయములతోడను,
నిస్పృహ చెందక నేను సంపాదింపగలనను జ్ఞానముతోడను,
సరిపోల్చినచో, ఇంచుమించుగా శూన్యమని యనుటకు-

సర్వథా నే నంగీకరించుచున్నాడను: ఎందుకనగా, శాస్త్రసత్య ములను క్రమముగా కనుగొనువారును, ధనమార్జించువారును సరిసమానులే; ధనవంతులకు ఉన్న దానికంటె అధికమగు ధన సంపాదనము సులభసాధ్యము. నిర్ధనులైనప్పుడు స్వల్పముగా కూడబెట్టుటకూడ కష్టతరము. లేదా, శాస్త్ర పరిశోధకులను సేనాధిపతులతో సరిపోల్చవచ్చును. ఎట్లన: వారి జయముల కనుగుణముగ వారి బలములును పెరుగును. మరియు, విజయా నంతరము పత్తనములను, రాష్ట్రములను చేకొను నప్పటికంటె, అపజయానంతరము మిగిలిన సేనలను కలిపియుంచుట కధిక తరమగు వివేకము కావలెను. ఎందుకనగా, ఎవడు, సత్యజ్ఞాన సంపాదనయందు తన్ను నిరోధించు కష్టములను, తప్పిదములను అధిగమింప యత్నించునో, అతడు నిజముగ యుద్ధమున పాల్గొనిన వాడే. ఎట్టి సామాన్యతగాని, ప్రాధాన్యముగాని గల విషయమును స్పృశించు అసత్యాభిప్రాయమును అంగీక రించినను, ఆతడు యుద్ధమున జయింపబడినవాడే. ఒకమారు సమ్యఙ్నిశ్చిత సూత్రములు తన యధీనమున నున్నప్పుడు పురోగమించుటకంటె, ఆ తరువాత తన పూర్వస్థితికి తిరిగి పొందుటకు మహత్తర నైపుణ్యము కావలెను. ఇక నా విష యము: శాస్త్రసంబంధిసత్యములలో నేమైనను కనుగొనుట యందు నేను జయముగాంచినచో (ఈ భాగమునందున్నవి నేను కొన్ని కనుగొన్నట్లు చూపునని నమ్ముచున్నాను) అవి నే నధిగమించిన అయిదారు ముఖ్యక్లిష్టసమస్యల ఫలితములు

మాత్రమే అనియు, ఆ యెదుర్కొనుటలో — వానిని నేను యుద్ధములుగనే లెక్కించితిని — విజయము నాకే గల్గినదనియు, నేను ప్రకటింపగలను. అట్టివే, మరి రెండుమూడు విజయములను పొందుటకంటె నా యుద్దేశములు సమగ్రముగా నెరవేరుటకు మరెద్దియు పైగా అక్కరలేదను నా నమ్మకమును బహిరంగముగా వ్యక్తముచేయుటకు నేను సందేహింపను. నేను ఈదుత్తో మాత్రమే ముందుకు పోలేదు. ప్రకృతి సామాన్య మార్గాను గుణముగ నాకీ లక్ష్యసిద్ధికి తగినంత వ్యవధి కలదు. కాని, మిగిలిన కాలమును నేనెంత జాగరూకతతో వాడుకొనుటకు నిబద్ధుడ నగుదునో, అంత అధికముగా దానిని వినియోగింపవలె నని నేను కాచుకొనియుంటిననియు భౌతికశాస్త్ర సూత్రములను నేను ప్రకటించినయెడల నాకాలము చాలవరకు దుర్వినియోగమగుననియు నేను తలంచుచున్నాడను. ఎందుకనగా, అవి సుస్పష్టములు; వాని నంగీకరించుటకు వానిని కేవలము అర్థము చేసికొనుటకంటె కావలసిన దెద్దియు లేదు. వానియందు, నిరూపించుట కవకాశములేని దొక్కటియు లేదు. అట్లయ్యు, ఇతరులయొక్క భిన్నములగు నభిప్రాయములకన్నిటికి అనుగుణముగా అవియుండుట అసాధ్యము కావున, వానివలన తప్పక జనించు విరుద్ధాభిప్రాయములు కారణముగ, నా మహోద్దేశమునుండి నేను తరచుగా తప్పుకొనవలసియుండెనని ముందే తెలిసికొంటిని.

ఈ ప్రాతికూల్యములు, నా తప్పులు నేను తెలిసికొనుటకును - నా యాలోచనలను వానిలో నేపాటిదైన విలువ యున్నచో - ఇతరు లర్థముచేసికొననిచ్చుటకును, పనికివచ్చుచున్నవని చెప్ప వగును. మరియు, ఒకనికంటె అనేకులు ప్రశస్తతరముగ చూడగలరు కావున, నా సిద్ధాంతముల నిప్పుడే వినియోగము లోనికి తెచ్చుకొనునట్లు చేయుటకును తిరిగి వారు తాము కను గొనిన వానితో నాకు సాహాయ్యము చేయుటకును పనికి వచ్చును. కాని నాకుగల దోషప్రవణత్వ తీవ్రతను నేను తెలిసి కొని యున్నను, నాకుగల ప్రథమాలోచనలను నే నెప్పుడును విశ్వసింపక పోయినను, నా యభిప్రాయములయెడ రాదగిన యాక్షేపముల యనుభూతి, వానినుండి యెట్టి లాభమును ఎదుకుచూడకుండ నన్ను నిరోధించుచున్నది. ఎందుకనగా గణనీయులగు నాస్నేహితుల యొక్కయు, నాయెడ తటస్థ భావము గలవారియొక్కయు, పక్షపాతముచే నాస్నేహితుల కన్నుల కెయ్యది గుప్తమైయున్నదో దానిని క్రోధాసూయా ద్వారమున కనుగొన నిశ్చయించుకొనిన వారియొక్కయు, నిశ్చి తాభిప్రాయముల ఋజువులు నాకుగలవు. కాని నేను చర్చించు చున్న విషయమున కతిదూరమైనయప్పుడు తప్ప, నేను ముందుగా తెలిసికొనని దెద్దియు నాక్షేపింపఁబడలేదు. కావున, నాయభిప్రాయములను నాయంత కఠినముగ, నిష్పా క్షికముగ విమర్శించిన వాని నొక్కనిగూడ, నేను కలియలేదు మరియు, నేటి దార్శనిక ప్రస్థానములయందు నడచుచున్న

వివాదములవలన వ్యక్తముసేయబడిన ఇతఃపూర్వాజ్ఞాత సత్య మేదియును లేదనియు నేను గుర్తించితిని. ఎందుకనగా, ఎవరికి వారే విజయమునకు ప్రయత్నించుచుందురు; కాగా ప్రశ్న కిరువంకల గల ఉపపత్తులను తూచిచూచుటకంటె, ఎవరికివారే కేవల సత్యాభాసము నత్యధికముగాజూప మరియు వ్యగ్రులై యున్నారు. చాలకాలముగా మంచి న్యాయవాదులై యున్నంత మాత్రమున, తరువాత ప్రశస్తతరులగు న్యాయ మూర్తులు గారు.

ఇక నాయాలోచనలను వ్యక్తముసేయుటవలన ఇతరులకు గలుగు నుపయోగము చాలగొప్పది కాజాలదు. కారణము వాని నింకను నేను చాలినంతదూరము గొనిపోలేదు. ఉపయో గములోనికి తెచ్చుటకు పూర్వము వానికి చేర్పవలసిన దింకను చాలగలదు. మరియు, గర్వరహితముగా నేనొక్కటి చెప్ప గల ననుకొనుచున్నాడను : వానినంతదూరము కొనిపోగలిగిన వ్యక్తి యెవ్వడైననున్నచో అతడు నాకంటె ఇతరుడు కాజా లడు. ప్రపంచమున, నా బుద్ధికంటె అనుపమానముగా నధి కమైన బుద్ధివిశేషముగలవారు లేరని కాదుకాని, తనకుదానై కనుగొన్నదానిని వలె తానొరునివలన గ్రహించిన దానిని ఒకడు బాగుగ్రహించి యద్దానిని తన స్వంతముచేసికొన జాలడు. ఇది ప్రస్తుతవిషయమునందుగూడ సర్వథా సత్యము. బుద్ధినైశిత్యముగల కొందరికి నా యభిప్రాయములను వ్యాఖ్యా

నించి చెప్పితిని. నేను చెప్పుచున్నంతసేపు చక్కగా అర్థము చేసికొనినట్లే చూపట్టియు, వారు, తిరుగ చెప్పునప్పుడు, ఆ యభిప్రాయములను సావాసిగా నే నంగీకరింపజాల నంతటి దూరము వానిని మార్చివేసిరి. ఈయవకాశమును గ్రహించి భావిప్రజాసంతతికొఱకు మనవిచేసికొన గల్గినందుకు సంతసించుచున్నాడను. నేను నాయంతట ప్రకటింపనిదాని నెద్దానిని కేవలము గాలికబురులవలన నమ్మవలదని మనవి. అట్టిది నానుండి వచ్చినదని నమ్మవద్దు. గ్రంథములు లభింపని ప్రాచీన తత్త్వశాస్త్రజ్ఞుల విషయమున చెప్పబడు నతుక్తులు నాకెంతమాత్రము నచ్చెరువు గొల్పలేదు. ఏమైనను, అంతమాత్రమున వారి యాలోచనలు అంత వివేకశూన్యములని నేను భావింపను. ఆకాలమునాటి ప్రజలలో వారుమిక్కిలి శక్తిమంతులు. కాని వారి కసార్థములను గల్పించిరి. తదనుగుణముగా, వారి శిష్యులయందు మచ్చున కొక్కడుగూడ వారి నతిశయింపకుండుట గమనింపదగినది. ప్రస్తుతము ఆరిస్టాటిలు అనుయాయులలోఆతనియెడ అత్యంతము భక్తియుక్తులగువారు, ఆతనికిగల ప్రకృతిజ్ఞానముతో సమమగు జ్ఞానము తమకున్నచో తమ్ము తా మదృష్టవంతులుగ భావించుకొందురను విషయమున, నాకు నిస్సందేహముగ నమ్మకము గలదు. అంతకంటె నధికతరమగునది వారు పొందరనుట సత్యము. ......... ఈవిషయమున వారు ఐవీ తీగెవంటివారు. అది తన్ను భరించుచున్న చెట్టుకంటె మీదికిపోవ యత్నింపదు. సరికదా, తరచుగా,

వృక్షాగ్రమువరకుపోయి, తిరిగి క్రిందికి వచ్చును. అట్లే వారు కూడ క్రిందికి దిగుదురు. అనగా, తాము చదువునూనుకొని నప్పటికంటె బుద్ధిహీనులుగా తమ్ము చాము చేసికొందురు. అట్టివారు గ్రంథకర్త సుగమముగా వ్రాసిన దానిని తెలిసి కొనుటతో తృప్తినందక, ఆతడొక్కమాటయైన చెప్పని, బహుశః తలంచికూడ నుండని, క్లిష్టసమస్యలకు పరిష్కారమును పై పెచ్చు కోరుదురు. సర్వసాధారణమైన శక్తిసామర్థ్యములు కూడ లేనివారికి, వారి తాత్త్వికరీతి బాగుగానరిపడును. ఎందుక నగా, వారుపయోగించు విభేదములందును, సూత్రములందును గల అస్పష్టత, జ్ఞాతవిషయములను గూర్చి వారెంత దృఢ విశ్వాసముతోమాటలాడుదురో అంతదృఢ విశ్వాసముతోడనే, సర్వవిషయములను గూర్చియు మాటలాడ గల్గునట్లును, ఏవిషయమును గూర్చియైన వారు చెప్పినదాని నంతటిని దోషదూషితమని యెవ్వరు నెత్తిచూపలేకుండ, కాపాడుకొన గల్గునట్లును, వారిని శక్తిమంతులుగా చేయుచున్నది. ఇందు కొక దృష్టాంతము. చూపుగలవానితో సరి సమానముగ పోరదలచి అంధకారబంధురముగు గుహలోనికి అతనిని గొని పోయిన గ్రుడ్డివానితో వీరు సరిపోలుదురు. అట్టివారికి నేనుప యోగించు తత్త్వశాస్త్ర సూత్రములను ప్రకటింపకుండుట లాభకరమని నేను చెప్పగలను. ఎందుకనగా, అవి అత్యం తము సూక్ష్మములు, స్పష్టములు. కావున, వానిని నేను ప్రకటించినయెడల, మీాద నేచెప్పినయోధులు దిగిన గుహ

గవాక్షములు తెరచి, యందు పగటివెలుగును ప్రవేశింప జేసి నట్లే యగును. కాని యీ సూత్రములను తెలిసికొనవలె నను నాతురత అధికతరులకు గూడ గల్గుటకు కారణములేదు. ఎందుకనగా, సర్వవిషయములనుగూర్చి ప్రసంగింపగల్గుటయు, వైదుష్య విషయమున కీర్తి గడించుటయు, వారి కోర్కె యైనచో, సత్యాభాసముతో తృప్తినందియున్నచో తమ ఉద్దిష్టమును వారు సుకరముగా పొందగలరు. ఈ సత్యా భాస మన్నిటియందును అంతగా కష్టము లేకుండగనే గన్ప ట్టును. ఇక సత్యమన్ననో మెల - మెల్లగా వ్యక్తమగును. అదియును కొన్ని శాఖలయందే. తక్కినవాని విషయమున బాహాటముగ మన యజ్ఞత నంగీకరింపవలసినదే. ఏలా గైనను, వేని విషయమునను అజ్ఞత లేనియట్లు గన్పట్టు వ్యర్థ గర్వమునకు బదులు, కొన్ని సత్యములను గూర్చిన జ్ఞానమునే, — అట్టి జ్ఞానము నిస్సందేహముగ మిక్కిలి యెన్నదగినది కావున, — గ్రహించుట మంచిదని గణించినచో, నామార్గము నకు సరియగు మార్గమునే అనుసరింప వారు వాంఛించి నచో, ఈ ప్రసంగములో నే నిప్పటికి చెప్పినదానికంటె అధికముగా నెద్దియు చెప్పనవసరములేదు. ఎందుకనగా, వారు నాకంటె బాగుగా ముందంజ వేయగలిగినచో, నేను కనుగొంటి ననుకొనుచున్న వాని నన్నిటిని వారు తమంతట తామే కనుగొనగలరు. క్రమము తప్పి నే నెద్దియు పరీక్షింప లేదు కావున, ఇంకను కనుగొనుటకు మిగిలియున్నది నిశ్చ

యముగా, నేనిప్పటికి కనుగొనగలిగినదానికంటె క్లిష్టతరమును, గంభీరమును. దానిని తమంతట తాము కన్గొనుట యందు కంటె, నావలన నేర్చుకొనుటయందు సంతృప్తి చాల తక్కువ యగును. పైగా, తొలుదొల్త సులభమైనదానికి యత్నించి, తరువాత క్రమక్రమముగా, మెల్లమెల్లగా కష్టతరములకు బోవు మానసికమగు నభ్యాసము నా యుపదేశము లన్నిటికంటె వారికి మంచి మేలు చేయును. నా స్వవిషయమున, నాయౌవనమునుండియు నేను నిరూపింప నన్వేషించుచున్న సత్యములన్నియు నాకు అప్పుడే (యౌవనమునందే) బోధింపబడియున్నచో, వానిని నేనెట్టి శ్రమయు లేకుండ నేర్చుకొనియున్నచో, బహుశః, వీనికి మించి మరెవ్వియు నేను తెలిసికొనియుండెడివాడను గాను. అథమపక్షము, నాపరిశోధన కనుగుణముగా నవ్యసత్యముల నెల్లప్పుడును నేను కనుగొనుటలో, నాకు గలవని నేను తలంచుచున్న, అభ్యాససౌలభ్యములను నేనెప్పటికిని సంపాదించి యుండియుండను. క్లుప్తముగా: ఒకడు ప్రారంభించిన పనిని వానియంత బాగుగా ఇంకొకడు పూర్తి చేయలేడు, అనదగుపని యెద్దియైన నీప్రపంచమున నున్నచో అయ్యది నేను శ్రమించుచున్నదే. ఈ పనికి తోడ్పడు ప్రయోగముల విషయము నాలోచించినచో వాని నన్నిటిని చేయుట కొక్కడు సరిపడడనునది సత్యము. అయినను, ఈ పనియందు, తన్ను తప్ప ఇంకొకరిని లాభకరముగ వినియోగించుకొనుటకు వీలులేదు. తాను డబ్బిచ్చి పనిచేయించు

కొనుట కవకాశముగల పనివారిని, లేక, అట్టి తెగవారిని, వినియోగించుకొనవచ్చును. లాభమునందలి యాశ (గొప్ప శక్తిగల సాధనము) నిర్ణయింపబడిన పనిని సరిగా నిర్వహింప వారిని ప్రోత్సహింపవచ్చును. ఇక కౌతుకముచే గాని, నేర్చుకోవలెనను అభిలాషచేగాని, తమంతటతామే తమ సాహాయ్యము నొసంగినవారి విషయము. సామాన్యముగా వారు నిర్వహించుదానికంటె వారి వాగ్దానము లతిశయించి యుండును. వారు చక్కని ఉద్దేశములను సూచింతురు. అందొక్కటియు నెరవేర్ప సాధ్యముకాదు. నిస్సందేహముగ, వారి కష్టమునకు పరిహారముగ వారు కొన్ని క్లిష్టసమస్యల వివరణములనుగాని, అధమము, అభినందనములనుగాని, వ్యర్థ ప్రసంగములను గాని, కోరుదురు. వీనియందు వినియోగించిన కాలమంతయు వ్యర్థముగా పోయినట్లే. ఇక, ఇతరు లిప్పటికి చేసియున్న ప్రయోగముల విషయము: తమకు దామే యీ తెగలవారు తమ ప్రయోగముల గూర్చి యొకనికి తెలియజేయ సమ్మతింపవలసి యుండినను (వాటిని రహస్యములుగా గణించువారేనాడును చేయరు) ఆ ప్రయోగములను చాలవరకు మితిమీరిన అనేక పరిస్థితులును, అంశములును వెన్నంటియుండును. కావున అందు నిశ్చితమగు సత్యమును కనుగొనుట కష్టతరము, పైగా, అవి సరిగా వివరింపబడవు; లేక అసత్యములైన నగును. (ఎందుకనగా, ఆసమాచారమును పంపినవారు వానిని తామంగీకరించిన సూత్రముల

కనుగుణముగా అవియున్నట్లు తోసజేయ నాతురులై యుండు టచే) కావున, వానిలో గొన్ని పనికివచ్చినను, వానిని ఏర్చి యెత్తికొనుటలో వ్యయమయిన కాలమునకు సరియగు నష్ట పరిహార మిందులో లేదు.

కావున, అత్యున్నత జాతికి చెందినవియు, ప్రజానీకము నకు అత్యంతోపయోగకరములును అగువిషయములను కను గొనుటకు తగిన శక్తిగలవాడని మనకు నిశ్చితముగా తెలిసిన వాడెవ్వడైన నున్నచో, తక్కిన ప్రజలందరు, అన్నివిధ ముల, ఆతనియుద్దేశములను జయప్రదముగా నడపుటకు సాహా య్యముగావింప నాతురత కలవారై యున్నచో, వారాతని కావశ్యకములగు ప్రయోగములకగు వ్యయమును భరించుట కంటె ఇతరుల వలని అకాల విఘ్నములచే ఆతని విశ్రాంతి కాలము పోకుండ నాపుటకంటె, చేయగలిగినది మరేద్దియు లేదని నాకు తెలియును. కాని, ఇంతకు పైగా అసామాన్యము లగు వానిని వేనిని వాగ్దానముచేయ నిష్టపడునంతటియు నా యుద్దేశములందు ప్రజానీక మత్యాసక్తి చూపవలెనని యూహించునంతగా వ్యర్థభావములను పోషించు నంతటియు, మహత్తరాభిప్రాయము నాపై నాకు లేదు. నే నర్హుడను కానని భావింపదగిన సాహాయ్యము నెవరినుండియైనను అంగీకరింప గల యంతటి నీచమగు నాత్మగలవాడను నేనుగాను.

ఈ మూడేండ్ల నుండియు సిద్ధముగానున్న వ్యాసమును ప్రకటింప నిష్టపడకుండుటకును, నాజీవిత కాలమున, అంత సామాన్యమైనదానికి, లేక, నాభౌతికశాస్త్రముల సూత్రములు తెలియుగల మరిదేనికైనను ప్రాముఖ్యము నీయకుండుటకై, నేను తీర్మానించుకొని యుండుటకును, ఈ విచారణలన్నియు కలసి కారణములగుచున్నవి. కాని, ఇప్పటినుండి రెండు కారణముల వలన కొన్ని ప్రత్యేకములగు వాదికుల నిచ్చట చేర్చుటకును, లోకమునకు నాచేతలను ఉద్దేశములను గూర్చిన వివరములు కొన్ని చెప్పుటకును, నేను నిశ్చయించుకొంటిని. ఈయోజనలతో మొదటిది! వీనిని నేను ప్రకటింపనిచో నా రచనలను ప్రకటింపవలెనను నాపూర్వోద్దేశముల నెరిగియున్న చాలమంది, నే నట్లు చేయకుండ తొలగుటకు నన్ను ప్రోత్సహించిన కారణములు, నాకీర్తికి తగవని యూహింతురు. ఎందుకనగా, నాకు కీర్తి యనిన నమితమగు నాసక్తి లేకపోయినను, నేను దాని నసహ్యించుకొనినను — నేనట్లు చెప్ప సాహసించినచో — నే నన్నిటికంటె నధికతరముగా నెంచు విశ్రాంతికి విరుద్ధమని కీర్తిని తలంతును గావున, నద్దానియెడ నేను విరక్తుడ నైనను, నా పనులను నేరములట్లు కప్పిపుచ్చుటకు నే నపేక్షింపలేను. ప్రఖ్యాతుడను గాకుండుటకై నేను ముందుగా జాగరూకత పడలేను. అట్టి ప్రవర్తనచే నా యెడనే నే తప్పిద మొనర్చినట్లగునని నేను తలంపవలసి యుండుట కొంతవరకును, అయ్యది నే నభిలషించు మానసిక

ప్రశాంతత్వమునకు విరుద్ధముగ నశాంతిని కలిగించుననుట కొంతవరకును, దీనికి కారణములు. నన్ను గూర్చి అందరకు తెలియుట, లేక, తెలిసుకొ పోవుట అనుదాని యెడ నేను సమానముగనే తటస్థుడనై యున్నాను, కొంతకీర్తిని సంపాదింప కుండ నుండలేకపోయితిని. కావున, నన్ను గూర్చి చెడ్డగా చెప్పికొనకుండ నన్ను నేను రక్షించుకొనవలసిన బాధ్యత నాపై నున్నదని నేను తలంచియుంటిని. ఈతత్త్వశాస్త్రపు మూదిరులను నేను వ్రాయ నిశ్చయించుకొనుటకుగల రెండవ కారణ మిదె. నే నభిలషించు ననంతములగు ప్రయోగములు నాకు లభింపకపోవుటచే నా స్వయంశిక్షణోద్దేశమున గలుగు నాలస్యము నాకు ప్రతిదినము ప్రత్యక్షమగుచున్నది. ఇతరుల సాహాయ్యము లేకుండ నా ప్రయోగములను నేను గావించుట అసాధ్యము. నాకు గల యాసక్తులలో లోకము అధికముగా పాల్గొనునని యాశించు నంతగా నన్ను నే నభినందించుకొనలేక పోయితిని. అయినను, స్వవిషయమున నాకర్తవ్య మొకటి గలదు. అందు లోపముండుట నా కిష్టముగాదు. ఆ లోపము వలన నా తరువాతి వారు నన్ను నిందించుట కవకాశము గలదు. మ ముద్దేశ నిర్వహణమునకు వారెట్లు తోడ్పడగలరో తెలియజేయుటలో నేను మిక్కిలి యజాగ్రత్త వహించితిననియు, అట్లజాగ్రత్త వహింపనిచో, ఇప్పటికంటె మంచి పరిస్థితియందనేక విషయములను నే నుంచగలిగెడి వాడననియు వారు నన్ను

నిందింపవచ్చును. అట్లు నిందించు నవకాశమును వారికి నే నీయ నిష్టపడను.

మరియు, అధికవివాదములకు కారణములు కానట్టియు, నేను కోరిన దానికంటె అధికముగా నా సూత్రములను వివరింప నన్ను నిర్బంధింప నట్టియు, అట్లయ్యు నేను శాస్త్రములందెద్ది నిర్వాహింపగలనో నిర్వహింపజాలనో స్పష్టముగా ప్రదర్శింప సమర్థములగునట్టియు, విషయములను కొన్నిటినేర్చి యెత్తికొనుట నాకు సులభమని నేను తలంచితిని. ఈవిషయమున నేను జయించితినో లేదో చెప్పవలసినవాడను నేను కాదు. నారచనలనుగూర్చి ప్రసంగించుచున్నప్పుడు, వానిగూర్చి ఇతరుల తీర్మానములను ముందుగా తెలిసికొను నుద్దేశము నాకు లేదు. కాని వానిని వారు పరీక్షించినచో నేను కృతజ్ఞుడనై యుందును. మరియు అట్లు చేయువారికి అధికతరమైన అవకాశము కల్గుటకై, వాని విషయమున ఆక్షేపణలు గలవారు నాప్రచురణ కర్తలకు, తమయాక్షేపములను పంపు శ్రమతీసికొనవలెనని నేను విన్నవించు కొనుచున్నాడను. వానిని గూర్చి ఆతడు నాకు తెలియజేయును. నా ప్రత్యుత్తరమునుగూడ వానికి కలుప నేను యత్నింపవచ్చును. మరియు, ఈప్రకారము, పాఠకు లొక్కమారే రెండింటిని (ఆక్షేపణ ప్రత్యుత్తరములను) చూచి ఎచ్చట సత్యముగలదో సులభతరముగా నిశ్చయించుకొనగలరు. ఏ స్థితియందును నేను, దీర్ఘములగు ప్రత్యుత్తరముల

నిచ్చువాడను గాను. ఉపరి, నాదోషములు సహేతుకములని నేను నమ్మినచో వానిని సంపూర్ణమగు నిష్కాపట్యముతో నే నంగీకరింతును. లేక, అట్టి దోషములు నాకు గన్పట్టనిచో, నేను వ్రాసిన విషయముల సమర్థించుటకు వలసిన వానిని మాత్రమే చెప్పెదను. నూత్న విషయముల వివరణలను చేర్పను.

Diaptrics, Meteorics అను వాని ప్రారంభమున నేను ప్రసంగించిన విషయములు, వానిని నేను ప్రమేయములని ఋజువుచేయునెడ తాటస్థ్యమును వహించితిని కావున, చూసీ చూడగనే, అసంతృప్తి కలిగించుచో, వానిని సంపూర్ణముగ ఓర్మితోడను, శ్రమతోడను చదువవలెననియు, అట్లుచేయుట వలన, సందేహపడువారు సంతృప్తినందగలరనియు, నేను విన్నవించుచున్నాను. ఎందుకనగా, ఈ వ్యాసములలోని హేతువు లన్యోన్యసంబంధము కలిగియున్నవి. తుదివానికి తొలివి కారణము లగును. కావున, తొలివానివలన తుదివి నిరూపింపబడుచుండగా, తొలివి వాస్తవమున, తుదివాని వలన నిరూపింపబడును. తొలివానికి తుదివి కార్యములగు చున్నవి. తర్కశాస్త్రజ్ఞులు వృత్తమని యను హేత్వాభాస వాదమునకు నేను గురియైతినని తలంపకుడు. ఎందుకనగా, అనుభవము ఈ కార్యములలో అధికసంఖ్య గలవానిని నిశ్చిత ములుగా చేసినను, ఏకారణములు నుండి నే నీకార్యములను నిగమనము చేసితినో అవి వాని యునికిని వివరింపగలిగినంతగా,

వాని యాథార్థ్యమును స్థాపించుట కుపకరింపవు. మరియు, తద్వ్యతిరేకముగ, ఆ కారణముల నిజస్థితి కార్యముల యాథార్థ్యమువలన స్థాపింపబడుచున్నది. నే నిప్పటికే వివరించియున్న ప్రథమ సత్యముల నుండి వానిని నేను నిగమనము చేయగలిగితినను నా తలంపు తెలియవలెనను నుద్దేశముతో తప్ప మరెద్దానితోడను నేను వానిని ప్రమేయము లనలేదు. అయినను, కొందరు మనీషులు నా సూత్రములుగా వారు గ్రహించిన వాని నుపయోగించి ఒక అపూర్వతత్త్వశాస్త్రమును నిర్మించుటయు, అద్దానివలన నేను నిందింపబడుటయు నిరోధించుటకు గాను, అట్లు చేయకూడదని నేను ఖండితముగా నిశ్చయించుకొంటిని. ఒక డిరువదియేండ్లాలోచించిన దానిని సర్వము నొక్కరోజులోనే, ఒకటి రెండు మాటలాతడు ఆ విషయమును గూర్చి తమతో చెప్పినంతమాత్రమున, సంపూర్ణముగా గ్రహింపగలమని యూహించువారిని గూర్చియు, తాము చూపు నక్కరకును, ఉల్లాసమునకు అనుగుణముగ ఎవరు హెచ్చుగ దోషములకు లోనగుచు సత్యదర్శనము నెడ శక్తిహీను లగుచుందురో వారిని గూర్చియు, నేను సూచించుచున్నాడను. వాస్తవముగను. సంపూర్ణముగను, మదీయములగు నభిప్రాయముల విషయమున, నూత్నములని వానికి క్షమార్పణ నేను చెప్పికొనను, కారణము ; వాని హేతువులు చక్కగా విచారింపబడినచో మిక్కిలి సామాన్యములుగను, సామాన్యవివేకమువలన స్థిరీకృతములుగను జూపట్టుటయే. తద్విషయమున నేను చెప్ప

నగు నితరాభిప్రాయములంత అసామాన్యములు కావు. అంత అన్యోన్యవిరుద్ధములు కావు. వానిలో నెవ్వానిని నేను మొట్టమొదట కనుగొంటినసియు నేను బడాయికొట్టను. వానిని నేను అంగీకరించితిని; వాని నితరులు గ్రహించిరి, లేదా గ్రహింపలేదు అనుటచే కాదు; ఇక, హేతువాదము, వాని యాథార్థ్యమునెడ నాకు నమ్మకము కలుగజేసినది కావున, నేను వాని నంగీకరించితిని.

Dioptrics లో వివరింపబడిన నూత్నకల్పనమును వెంటనే శిల్పులు ఆచరణలోనికి తేజాలక పోయినను, తత్కారణముగ నెవ్వరును దానిని ఖండింప నర్హులుకారని నా తలంపు. ఎందు కనగా, సూక్ష్మతమములగు వివరములనుగూడ మరువకుండు నట్లుగ నాచే నిర్మింపబడిన యంత్రమును చేసి చక్కదిద్దుటకు నైపుణ్యమును, అభ్యాసమును కావలయును. కావున ప్రథమ ప్రయత్నమునందే వారు జయమును పొందుచో, స్వరకల్పన గల యొక కృతి ముందున్నంతమాత్రమున ఒకవ్యక్తి ఒక్క రోజులో వీణావాదన సమర్థుడగుచో నెంతటి అచ్చెరువందునో అంతటి అచ్చెరువునే పొందవలసివచ్చును. నా గురువుల భాషయగు లాటిన్‌లోగాక, నా దేశభాషయగు ఫ్రెంచిలో నేను వ్రాయుటకు కారణము, ప్రాచీనుల రచనలయందే శ్రద్ధగల వారికంటె తమ నిష్పాక్షిక నిసర్గ వివేకము నుపయోగించు వారు నా యభిప్రాయముల విషయమున ప్రశస్తతరులగు

తీర్పుపలుకుదురని నే నాశించుటయే. మఱియు, సద్వివేకమును పరిశీలనాభ్యాసములతో మేళవించువారిచే నేను న్యాయమూర్తులుగా గోరుదును. సామాన్యభాషలో వివరింపబడినంత మాత్రమున నా హేతువాదముల నాలింప నిరాకరించునంతగా వారు లాటిను భాషయెడ పక్షపాతము కలిగియుండరని నా నిశ్చయము.

తుదకు, భావిలో శాస్త్రములయందు నేను చేయ నాశించు నభివృద్ధి విషయమున ప్రత్యేకముగ నెద్దియు చెప్పుటకుగాని, నేను నిర్వహింపగలనని నాకు నిశ్చయములేని వాగ్దానమున ప్రజలకు బద్ధుడనై యుండుటకుగాని నే నిష్టపడను. కాని యిది మాత్రము నేను చెప్పగలను. ఇంకను, నాకు మిగిలిన కాలమంతయు, ప్రస్తుత మమలులోనున్న వానికంటె అధికతర నిశ్చితత్వముగల వైద్యశాస్త్ర సిద్ధాంతములను నిగమనము చేయగల ప్రకృతి జ్ఞానమును సముపార్జించు ప్రయత్నమునందే వినియోగించుటకు నిశ్చయించుకొంటిని. మఱియు, ఇతరములగు వృత్తులయెడ, ముఖ్యముగా ఒకరిని బాధింపకుండ ఇంకొకరికి ఉపయోగకరములు కాజాలని వానియెడ, నా యిచ్ఛ మిక్కిలి వ్యతిరేకించును. కావున, ఏ పరిస్థితులచేనైన అట్టి పనులయందు నియమింపబడుచో వానియందు నేను సఫలీకృతుడ నయ్యెడివాడనని నమ్మజాలను. ఈ విషయమున నేను-

బహిరంగముగా ప్రకటించుట నా యైహికాభివృద్ధికి పనికి రాదు. కాని దానితో నాకు సంబంధములేదు. మరియు, నే నెవరి అభిమానమువలన, నా విశ్రాంతి కాలమును నిర్విఘ్నముగ, ఆనందముగ అనుభవింప ననుజ్ఞ నందియుంటినో, వారియెడ, అత్యున్నత భౌతికపదవృద్ధి నొసంగు నితరు లెవ్వరి యెడకంటె ఎక్కువ కృతజ్ఞుడుగా నుండగలను.

# ఆంధ్రాంగ్ల పద సూచిక

| | |
|---|---|
| ప్రసంగము | Discourse |
| ప్రమాణపద్ధతి | Method |
| తత్త్వశాస్త్రము | Metaphysics |
| శాస్త్రము | Science |
| ప్రకృతి | Nature |

## ప్రథమ భాగము

| | |
|---|---|
| సద్బుద్ధి లేక వివేకము | Good sense or Reason |
| స్వచ్ఛత | Clearness |
| భావనా వైశద్యము | Distinctness of imagination |
| దర్శనము | Philosophy |
| అసహజగుణములు | Accidents |
| రూపము | Form |
| స్వభావము | Nature |
| ఒకేవర్గమునకు చెందినవి | Species |
| భ్రమ | Delusion |
| ఈశ్వర విజ్ఞానశాస్త్రము | Theology |
| నిర్ణయము | Judgment |
| యుక్తియుక్తము | Intelligible |
| సంవాదశాస్త్రము | Rhetoric |
| యదార్థత్వము | Certitude |
| ప్రమాణము | Evidence |
| నిశ్చిత | Precise |
| భగవత్ప్రసాదితసత్యము | Revealed truth |
| సంభావ్యము | Probable |
| సమస్తమును హేళనపూర్వకముగ తూలనాడు కొందరు తాత్త్వికులు | Cynics |

| | |
|---|---|
| హేతువాదము | Reasoning |
| ఊహాచోదితము | Speculative |
| వ్యవహారజ్ఞానము | Common sense |
| వైరుధ్యము | Contradiction |
| (మనస్సుచే) గ్రహణము | Apprehension |

## ద్వితీయ భాగము

| | |
|---|---|
| చింత రాగము | Passion |
| ధర్మము | Religion |
| నిరూపణ | Demonstration |
| రాజ్యవిధానము | Constitution |
| తర్కశాస్త్రము | Logic |
| తర్కశాస్త్ర న్యాయము | Syllogism |
| అమూర్తము | Abstract |
| అర్థగ్రహణశక్తి | Understanding |
| చిత్తవిభ్రమము | Confusion |
| అస్పష్టత | Obscurity |
| సరళ | Simple |
| క్లిష్ట | Complex |
| అవశ్యకత | Necessary |
| విశదము | Distinct |
| క్రమము | Order |
| పరిస్థితి | Condition |
| భావన | Conception |

## తృతీయ భాగము

| | |
|---|---|
| శ్రద్ధ | Faith |
| అనుయోజన | Cognisance |

| | |
|---|---|
| ఆలోచన | Thought |
| ఇచ్ఛాశక్తి | Will |
| సుగుణము | Virtue |
| నీతివాక్యము | Maxim |
| మతసంబంధి సత్యములు | Truths of faith |
| గ్రీసుదేశమందలి యొకానొక దార్శనిక వర్గము. | Sceptics |
| అనిశ్చయత | Uncertainty |
| ప్రతిజ్ఞావాక్యము | Proposition |
| నిశ్చయము | Certainty |

## చతుర్థ భాగము

| | |
|---|---|
| ద్రవ్యము | Substance |
| స్వభావము | Essence or nature |
| దృఢవిశ్వాసము | Certitude |
| ఊహించు | Conceive |
| సత్త్వము | Being |
| ఈశ్వరుడు | God |
| ఇంద్రియగోచరములు | Sensible |
| భావన | Idea |
| ఆధేయత్వము | Dependency |
| చిద్వస్తువు | Intelligence |
| నిరంతరవస్తువు | Continuous body |
| కల్పనాశక్తి | Imagination |
| బోధ్యము | Intelligible |
| స్ఫుటము | Vivid |
| సంభ్రమితము | Confused |
| అవ్యక్త | Obscure |

## పంచమ భాగము

| | |
|---|---|
| స్థిరనక్షత్రము | Fixed star |
| గ్రహము | Planet |
| అవకాశము | Space |
| ప్రకృతి | Matter |
| అవ్యవస్థ | Chaos |
| నియమము | Law |
| అంతరిక్షము | Heavens |
| చేష్టారహిత లేక సూక్ష్మగ్రాహి | Vegetative or sensitive soul |
| ప్రవృత్తి | Function |
| వివేకము | Reason |
| గతి | Motion |
| హృదయకోశము | Heart |
| ధమని | Artery |
| శరీరనిర్మాణశాస్త్రము | Anatomy |
| హృదయవివరము | Ventricle or Cavity |
| నాళిక | Tube |
| మహాశిర | Hollow Vein |
| నాడికాధమని | Arterial Vein |
| సిరాధమనిక | Venous artery |
| శ్వాసనాళిక | Wind pipe |
| సూక్ష్మత్వక్కు | Pellicle |
| వివరము | Orifice |
| హృదయకర్ణిక | Pouch |
| కోష్ఠము | Auricle |
| కవాటము (మడత) | Valves |
| నాళము | Vessel |
| శూన్యగర్భసిర | Hollow vein |

| | |
|---|---|
| వ్యాకోచించు | Expand |
| సత్యాభాసము | Verisimilirude |
| సమతోలనచక్రములు | Counter weights |
| బంధము | Ligature |
| విరళీకృతముచేయు | Rarefy |
| అనురూప్య | Consistency |
| చర్మము | Coat |
| ధాతువు | Humour |
| పశుతత్త్వము | Animal spirit |
| యాంత్రికుడు | Mechanic |
| అంతరవికారము | Internal affection |
| సామాన్యబుద్ధి | Common sense |
| స్వయంచలన యంత్రము | Automaton |
| ఉద్రేకము | Passion |
| వివేకయుతమగు నాత్మ | Reasonable soul |
| ఇంద్రియజ్ఞానము | Sensation |
| ఆశ | Appetite |

## షష్ఠ భాగము

| | |
|---|---|
| విచారణాత్మక శాస్త్రము | Speculative science |
| (ఈశ్వర) కృప | Grace |
| అభిప్రాయము | Notion |
| వైద్యశాస్త్రము | Medicine |
| ప్రయోగము | Experiment |
| దృశ్యములు | Phenomena |
| నిగమనముచేయు | Deduce |
| విశేషము | Particular |
| ఆకృతులు లేక జాతులు | Forms or species |

| | |
|---|---|
| సూక్ష్మము | Simple |
| సాధారణము | General |
| ప్రకారము | Mode |
| ప్రయోజనము | End |
| కనుగొనినది | Discovery |
| వివాదము | Disputation |
| దార్శనికరీతి | Philosophic fashion |
| సత్యాభాసము | Appearance of truth |
| కిరణవక్రీభవనశాస్త్రము | Dioptrics |
| ఉల్కావిషయికశాస్త్రము | Meteorics |
| హేత్వాభాసము | Fallacy |
| వృత్తము | Circle |
| అన్యోన్యవిరుద్ధ | Paradox |
| నైసర్గికవివేకము | Natural Reason. |

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| i | 4 | పియిరీ | పియరె |
| iii | 17 | Syllopidm | Syllogism |
| vi | 2 | ఐశాక్ | ఐజాక్ |
| vii | 16 | ఫ్రాంక్‌ఫర్డ్ | ఫ్రాంక్‌ఫర్ట్ |
| xiii | 4 | Scientiuum | Scientiarum |
| | 13 | Poel | Poêle (ఉష్ణప్రదేశము) |
| xv | 21 | revelatation | revelation |
| xviii | 12 | Coitationes Privalai | Cogitationes Privatae |
| | 17 | Sententias | sententiae |
| xxii | 8 | Meteogloroical | Meteorological |
| xxiii | 5 | Papalr uncio | Papal nuncio |
| xxiv | 5,6,12,17 | భాండో | ఘాండో |
| xxxvii | 11 | టీలోస్ | టాలోస్ |
| | 12 | ఫాంటీనియరే | ఫోంటేనియర్ |
| xxxviii | 12 | ecxi | ccxi |
| xLiii | 1 | రొముస్ | రేముస్ |
| | 21 | Poele | Poêle(ఉష్ణప్రదేశము) |
| xLvi | 2 | Meditations | Meditationes |

